

గడపగడపకో సన్నాయి




# భక్త జయదేవ

దర్శకత్వం...పి.వి.రామారావు * పర్యవేక్షణ ...రామకృష్ణ
రచన...సముద్రాల * సంగీతం...రాజేశ్వరరావు * కెమెరా...వెంకట్
కళ...గోఖలే * నృత్యం...వెంపటి
నిర్మాతలు... నారాయణరావు & పరంధామరెడ్డి

డిస్ట్రిబ్యూటర్స్:- ఆంధ్ర ... విజయ పిక్చర్స్ + మైసూర్...శారదా మువీస్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


## ఉత్తరాలు

### ముఖచిత్రం కథ

మా (నా) అభిమాన నటుడు రామారావుగారి ముఖచిత్రంతో చక్కని రంగులు దిద్దుకొని, అందంగా ఉగాదిశుభోదయాన, కళకళలాడుతున్న ప్రకృతికి వింతశోభను కూరుస్తూ, ఉత్సాహంగా మాచేతుల్లోకి వచ్చిందిమీపత్రిక ఎంతకాలంగానో ఎదురుచూస్తున్న రామారావుగారి పరిచయం ఉగాదినాడే లభించింది. అందుకు పత్రికకు నాఅభివందనములు.! వారినిగురించి వ్రాస్తూ "మోము చందమామ వంటిది. అందం వెన్నెల వంటిది అతని సాహిత్యం ఒక వెన్నెల వాడ చిరునవ్వు వెన్నెల జాలు" మొదలగు వాక్యాలు మమ్మెంతో ఆనందపర్చాయి. ఇంకా "కాలేజీ (రామారావుగా,...ప్రేమారావుగా,...భీమారావుగా" అనే చలోక్తులలో ఎంతో నవ్వుకున్నాం. కళకళలాడుతూ, నిండుగా, వారి ముఖాన్ని తీర్చిదిద్దారు. నా అభిమానపత్రిక ఇకముందు కూడా ఇలాగే ముస్తాబవుతుందని ఆశిస్తాను.

వరం (రాజమండ్రి)

* * *

29—3—61 వార పత్రిక ముఖచిత్రం కథలో శ్రీ నందమూరి (నయనానంద) తారక రామారావు గూర్చి ప్రచురించినందుకు నా అభినందనలు

నేటి చిత్రజగతిలో నవనీతము వంటి హృదయముగల నటులు బహు అరుదు. చందమామ వంటి మోము, వెన్నెలవంటి అందం, నవ్వు

తను కన్న మృదువైన హృదయముకల రామారావు నా అభిమాన నటుడు అని చెప్పడానికి గర్విస్తున్నాను.

శ్రీమతి టి వీరగోపాలకృష్ణ (సూర్యాపేట)

* * *

"వయునానంద తారక రామారావు" ముఖచిత్ర కథ చాలా బాగుంది. "తెలుగు—వెలుగులు" లోనికి రావలసిన తారకరాముని ముఖచిత్ర కథ ద్వారా ప్రత్యేకించి ప్రచురించినందుకు ఆంధ్రపత్రికకు అభినందనములు ఇటువంటి ప్రముఖులు ఇంకా తెలుగు గడ్డపై ఉండగా తెలుగు—వెలుగుల శీర్షిక ఆపుచేయుటం చాలా బాగాలేదు.

జి నారాయణమూర్తి (రాజమండ్రి)

* * *

ఎన్. టి. రామారావునుగురించి గొప్పగా పొగ డారు. చాల సంతోషం అందుకు వారు తగిన వారు అయినా ఒక్కటి "శ్రుతిమించిన అభి నయాలు అతనికి గిట్టవు కేవలం ముఖకవళికల వరవళ్లు అతనికి పట్టవు" అన్నారు వ్యక్తి గతంగా రామారావుగారు ఉదారులు, ఉత్తములు. అలాంటి వ్యక్తి చిత్రరంగంలోనే లేడంటే అతిశ యోక్తి కాదు కాని, సినిమారంగం వరకు రామా రావు నటించిన ఉత్తమ చిత్రాలంటే "పిచ్చి పుల్లయ్య", "తోడుదొంగలు", "సంసారం", "పాండురంగ మహాత్మ్యం" "పల్లెటూరిపిల్ల" ఈ చిత్రాలు తప్పనిస్తే వారు నటించిన తతిమ్మ చిత్రాలు అన్నింటిలోను శ్రుతిమించిన నటనే. అలాంటప్పుడు శ్రుతిమించిన నటన అంటే వారికి గిట్టదని వ్రాశారుకదూ! కన్నులతో చూస్తున్నది కాదనగలమా? రామారావు నటనను గాని, వ్యక్తిని గాని శంకిస్తున్నానని కాదు; వారు ఎలాంటి చిత్రాలలో నటించినా విగ్రహం చక్కగా ఉంటుంది. నటనలో, నాటకంలో నటించినట్టు ఉంటుంది గాని, సహజత్వం కాస్త కరువు రచయిత కలం కాస్త వరవళ్లు త్రొక్కిందికదటండీ?!

ఎస్ ఎస్ బి నాద్ (పలమనేరు)

## వనితలకు వినతి

'వనితాలోకం' శీర్షికకు రచనలు పంపగోరేవారు కవరుపైన స్పష్టంగా 'వనితాలోకం శీర్షికకు' అని వ్రాయాలి. లేకపోతే అసంఖ్యాకంగా వచ్చే రచనలలో వనితల వ్యాసాలు విడదీయడం కష్టసాధ్యం.

వనితలు పంపే వ్యాసాలు తగు మాత్రపు పరిమితికి – అంటే అచ్చులో రెండు పేజీలకు మించకుండా ఉండాలి.

వ్రాసే రచనగానీ, చేసే సూచనగాని సమకాలీన సాంఘిక పరిస్థితులకు సంబంధించేదిగా ఉండాలి. ప్రయోజనాత్మకమైన వ్యాసాలకు ప్రాధాన్యం లభిస్తుంది.

కాగితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిన రచనలే అంగీకార పాత్రం కాగలవు. డిజైనులు, పంపేవారు అవి పొపుతాళ్ళు సైజు డ్రాయింగు పేపరుమీద ఇండియన్ ఇంకుతో వ్రాసి పంపవలెను. రచయిత్రుల చిరునామా లేని ఏ రచనా ప్రచురణార్హం కాదు.





# ఉత్తరాలు

మా ఆంధ్ర పత్రిక వారపత్రిక 29—3—61 తేది సంచికలో వేసిన ముఖచిత్రం (శ్రీ ఎస్. టి. రామారావు) చూడగానే మా అభిమాన తారల చిత్రాలని ఖాళీ చేయడానికి మీ రీ "ముఖచిత్రం వ్యాసం" శీర్షిక మొదలుపెట్టారనిపిస్తుంది. కాని మాకు వారి వివరాలు తెలిసేటట్లు చేసేలా లేదు

అంతగా సినిమాతారలను పరిచయం చేయాలని ఉంటే "తెలుగు వెలుగులు" శీర్షికలా మరి ఒక శీర్షిక, ఏ "తెలుగు తారలు" అనో, మరో విధంగానో పరిచయం చెయ్యొచ్చు కాని, ఇలా వంటి అట్టమీది బొమ్మలలో మా అభిమాన వారపత్రికను అనవసరంగా తయారుచేయవద్దని కోరుతున్నాము శ్రీ కేతిరెడ్డి వెంకటరావు గారి సహాయం ఉంటే మరల అట్టమీది బొమ్మలకు కొదువ ఉండదు లేకపోతే ఏదో ఒక కథలోని సన్నివేశం "బాపు" గారి చేత వేయిస్తే మరీ మంచిది

శ్యామ్ ప్రసాద్, శ్రీనివాస్, కృష్ణారావు
(విశాఖపట్టణం)

* * *

## "కవితా కింకిణి"

29—3—61 తేదీ సంచికలో "నవ్య సుమశోభలోకాల నిండుకొనగ—వచ్చె వాసంతి కేళికోద్యానమునకు" అంటూ 'వసంతలక్ష్మి'ని అవతరింపజేసి, కవితాకింకిణి బహుమతి పొందిన దేవి గారిని హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను.

ఇలాంటి ఉత్తమ కవితను ఆదరించిన సంపాదకులకు (నా) అభివందనములు

వి లక్ష్మీనరసింహారెడ్డి (గుంద్రాలిమర్రు

* * *

29—3—61 తేదీ ఆంధ్ర సచిత్రవార పత్రికలోని 'కవితాకింకిణి' శీర్షిక క్రింద ప్రచురించిన "వసంతలక్ష్మి" చాల బాగుంది ఇలాంటివి ఎన్నదగిన, ఎన్నికెక్కిన రచన లెన్నో ప్రచురించి, మా (పాఠకుల) మన్ననల నందుకొనగలరని ఆశిస్తున్నాను.

పి కృపావరం (న్యూఢిల్లీ)

* * *

## న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణగారు 29—3—61 వార పత్రికలో కాంగ్రెస్ ఉపనాయకత్వమును గూర్చి ప్రస్తావిస్తూ బ్రిటిష్ సంప్రదాయం ప్రకారం ఆర్థిక మంత్రి కాబోయే ప్రధాన మంత్రి అని వ్రాసినారు. కాని, బ్రిటన్‌లో రెండవ ప్రపంచ యుద్ధం తరువాత విదేశాంగ మంత్రి ప్రధాన మంత్రి అయినాడు కాని, ఆర్థిక మంత్రి ప్రధాన మంత్రి కాలేదు శ్రీ కృష్ణగారు ఇటువంటి విషయములను ప్రస్తావించవద్దని మనవి

కె. కోటేశ్వరరావు (తెనాలి)



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 31

12-4-61
బుధవారం

ప్లవవత్సర చైత్ర బహుళ ద్వాదశి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం: ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి
'భార్యాభర్తలు'లో కృష్ణకుమారి.



## సరికొత్త శీర్షిక

"26-4-61 సంచికలో 'పెంపుడు జంతువులు'" అనే సరికొత్త శీర్షిక ప్రారంభమవుతుంది. సాధారణంగా అందరూ పెంచే జంతువుల గురించి చిన్న వ్యాసాలు కొన్ని ప్రచురిస్తాము.

## రచయితలకు విజ్ఞప్తి

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ప్రతి సంచికను సర్వాంగసుందరంగా అలంకరించి పాఠకులకు అందజేయాలని మా సంకల్పం. ఇందుకు రచయితల సంపూర్ణ సహకారం అర్థిస్తున్నాం. రచయితలు తమ కథానికలను, వ్యాసాలను, ఇతర రచనలను పంపేటప్పుడు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, మద్రాసు-1" అని స్పష్టంగా వ్రాయాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

సంపాదకుడు.

## వచ్చేవారం...

హాలాహలం ..... కథ.

ఆడవారూ - ఐకమత్యం - వనితాలోకం.

దక్షిణాఫ్రికా - వ్యాసం.







క్రమశిక్షణ వుంటే ఇక స్వతంత్ర
పక్షానికి తిరుగులేదని జనరల్
కరియప్ప ప్రకటించారు

# జనాభా లెక్కలు

భారతదేశంలో ప్రతి 1000 మంది పురుషులకూ 940 మంది స్త్రీలున్నారు. సాధారణంగా ప్రపంచమంతటా స్త్రీల సంఖ్యే ఎక్కువ. మన దేశంలో మాత్రం పురుషసంఖ్య అధికంగా ఉండటానికి ఇక్కడి పురుషులు యుద్ధాలలో మరణించకపోవడమే నని సెన్సెస్ రిజిస్ట్రార్ శ్రీ మిశ్రా అన్నారు. కాని భారతదేశంలో ప్రసవంలో చాలామంది స్త్రీలు చనిపోతూ ఉంటారు. ఇది కూడా ముఖ్య కారణాలలో ఒకటి.

ఈమధ్య చేసిన జనాభా లెక్కలవల్ల తేలిన ముఖ్య విషయం, రెండవ పంచవర్ష ప్రణాళిక సమయంలో భారతదేశపు జనసంఖ్య సంవత్సరానికి సగటున నూటికి 2.7 చొప్పున పెరిగిందని ప్లానింగ్ కమిషన్‌వారు ఇది 1.7 కంటె ఉండదని అంచనా వేశారు. వీరు 1966 కి గాని 43.4 కోట్లకు మించిన జనసంఖ్య ఉండదనుకున్నారు. 1971 కి 45.5 కోట్లూ 1976 కి 50 కోట్లూ, జనం ఉంటారని లెక్కలు వేసుకున్నారు. అంటే 1961కే మనదేశంలో 43 కోట్లకు పైన జనం ఉన్నారన్నమాట.

ఇది ప్రమాదకరమైన పరిస్థితి అవడంలో సందేహంలేదు. ఇదే పెరుగుదలగనుక ఉండేట్లయితే 1971 కి మన జనాభా 53 కోట్లు మించేట్లుందని కొందరు నిపుణులు చెప్పారు. కాని ఇంకా ఎక్కువ ఉండవచ్చు. పంచవర్ష ప్రణాళికలు ఏ అంచనాలపైన ఆధారపడి ఉన్నాయో అవన్నీ చాలమట్టుకు తప్పినవని తెలుస్తుంది. 1967—68 కి మన జాతీయాదాయం 1950—1951 దానికన్నా రెట్టింపు అవుతుందనుకున్నారు. ఇది జరిగినట్లయితే భారతీయుల వ్యక్తిగత ఆదాయం 1973—74 కి కూడా రెట్టింపు అవుతుందని చెప్పారు. ఇప్పు డీసంఖ్యలు ఎంతవరకూ నిజమవుతాయన్నది సందేహాస్పదం!

జనాభా సంఖ్యలు జాగ్రత్తగా పరిశీలిస్తే కొన్ని విషయాలు తెలుస్తాయి. అస్సాం, రాజస్థాన్, పంజాబ్, గుజరాత్, మధ్యప్రదేశ్, పశ్చిమ బెంగాల్‌లలో జనసంఖ్య పెరుగుదల మొత్తం దేశం యొక్క పెరుగుదలకన్నా అధికంగా ఉన్నది. మద్రాసు రాష్ట్రంలో మాత్రం ఇది తగ్గింది. స్థూలంగాచూస్తే గోధుమ, జొన్న ముఖ్యమైన పంటలుగా ఉన్న ప్రదేశాలలో జనాభా బాగా ఎక్కువ అయినట్లు తోస్తుంది. కాని మద్రాసులో జనం తగ్గటానికి కారణమేమిటో అర్థంకాదు. ఈ రాష్ట్రంలో కుటుంబ నియంత్రణ ప్రచారం తక్కువ రాష్ట్రాలకంటే అధికంగా ఉన్నప్పటికీ ఇది మరీ ఇటీవలే ప్రారంభమవటంచేత దాని ప్రభావం ఎంతమట్టుకు పని చేసినదీ చెప్పడం కష్టం. పంజాబ్ మొదలయిన చోట్ల మలేరియావిధ్వంసం వంటి పద్ధతులు మరణ సంఖ్యలను తగ్గించికూడా జనాభా సంఖ్యలను పెంచి ఉండవచ్చునని కొందరు భావిస్తున్నారు.

ఈ లెక్కలకు సంబంధించిన కొన్ని వివరాలు ఇక్కడ చూపబడిఉన్న చిత్రపటంలో కనుపిస్తాయి.

## నిరుద్యోగ సమస్య

సాగుబడి అవుతున్న ప్రతి ఎకరానికీ 1951 లో 112 మంది ఉన్నట్లయితే, ఈ సంవత్సరం 117 మంది దాకా ఉన్నారు. అంతేకాక, దేశం మొత్తం మీద 1951 లో 1.61 కోట్లమంది శ్రామికులు ఉన్నట్లయితే 1976 నాటికి 2.22 కోట్ల మంది తయారవుతారని అంచనావేశారు. నిరుద్యోగసమస్య క్రమంగా ఎంత తీవ్రమవుతున్నదో దీనిబట్టే ఊహించవచ్చు.

## నగరాలూ-గ్రామాలూ

ఒక విషయంలో మాత్రం జనసంఖ్యలు అంచనాలకన్నా తక్కువ అని తేలింది. నగరాలలో



ఇటీవల హైదరాబాదులో జరిగిన అఖిలభారత పశువుల, కోళ్ల ప్రదర్శనంలో శ్రేష్ఠమైనవిగా ఎన్నికైన వాటి యజమానులకు ముఖ్యమంత్రి బహుమతులు పంచిపెట్టారు

1961 జనసంఖ్య [మొత్తం 434,424,429]

ప్రజలు పది సంవత్సరాలలో నూటికి 24 85 అధికమయ్యారు అంచనా 33 కాని ఇందులో ఒక చిన్న 'చిక్కు'కూడా ఉన్నది చిన్ననగరాలలో (అంటే 10,000 లోపు) జనసంఖ్యలు తగ్గినా పెద్దపట్టణాలలో పెరగటంచేత ప్రజలు పెద్దపట్టణాలకు తరలి వెడుతున్నారని ఊహించడానికి ఆధారమున్నది 1951 నుంచి 61 వరకూ గ్రామాలలోమాత్రం జనసంఖ్యలు అతిగా తగలేదు 82 62% నుంచి 82 16% కు పడిపోయింది

## పాకిస్తాన్

పాకిస్తాన్ 1961 జనాభాసంఖ్యల ప్రకారం వారి పెరుగుదల పదిసంవత్సరాలలో మనదానికన్నా అధికమని తెలుస్తుంది ఇది 23 7% అని ప్రకటించారు ఇది ఎట్లా ఉన్నా 1921 నుంచి నేటివరకూ మన సంఖ్యలను పరీక్షించినట్లయితే, 1921—31 లో 11% అనీ, 1931—41 లో 14 23% అనీ, 1941—51 లో 13 34% అనీ తేలుతుంది ఈ పద్ధతిలో 1981 కి భారతదేశపు జనసంఖ్య 65 కోట్లకు తగ్గదనే విషయం భయం కలిగించక మానదు.

# జనాభా లెక్కలు

## కుటుంబనియంత్రణ

ఇప్పటికే అతి పేదదయిన మనదేశం ఈ జనసంఖ్యను భరించలేదు కొందరు జనసంఖ్య అధికమయినంతమాత్రాన ప్రమాదమేమీ లేదనీ, యంత్రసాధనాలవల్ల 'జాతీయైశ్వర్యం' దీనిని మించగలదని భావిస్తున్నారు కమ్యూనిస్టు నాయకులైన మావ్ ట్సేటుంగ్ మాత్రమేకాక కాలిన్ క్లార్క్ వంటి ఆర్థిక నిపుణులుకూడా ఇటువంటి సిద్ధాంతాలను ప్రతిపాదిస్తున్నారు

శ్రీ కృష్ణమీనన్ కూడా కుటుంబనియంత్రణం లనవసరమని అన్నారు కాని ఈ 'సిద్ధాంతాలు' నమ్మదగినట్లుగా ఉండవు ఇప్పటికే మన ప్రణాళికలు చాలవనుకుంటూ కుటుంబనియంత్రణ అవసరం గుర్తించకపోవడం అత్యంత ప్రమాదకరం

ప్రస్తుతం కుటుంబ నియంత్రణకొరకు చేస్తున్న ప్రచారం చాలదు దేశమంతటా కుటుంబ నియంత్రణ అమలు జరిగితేనే మనకు 'ముక్తి'

## తంతి - తపాలా

### కొన్ని వివరాలు

—నేడు మన దేశంలో సుమారు 75,000 పోస్టాఫీసులున్నాయి.

—1959 లో 20,240 కన్నా లేవు.

—1966 కి దేశం మొత్తం పైన 100,000 తపాలా ఆఫీసులు ఉంటాయని లెక్కవేశారు.

—తంతి - తపాలాశాఖలో మొత్తం 125,000 మందిపైన పనిచేస్తున్నారు.

—ప్రతిరోజూ ఇంచుమించు 11,000,000 'వస్తువులు' (ఉత్తరాలూ, పార్సిళ్లూ వగైరా) తంతితపాలాశాఖ రవాణాచేయిస్తుంది.

—రోజుకి ఒకే 'డెలివరీ' ఉండే ఊళ్లు మన దేశంలో దగ్గిర దగ్గిర 240,000వరకు ఉన్నాయి. వారానికి రెండు మూడు 'డెలివరీ'లు ఉన్న గ్రామాలు మూడులక్షలవరకూ ఉన్నాయి.

—ప్రతిదినం భారత దేశంలో సుమారు 100,000 'టెలిగ్రామ్'లు వెళ్తాయి? ఇవి ప్రసారమవటానికి 1400 తీగలు ఉపయోగిస్తున్నారు.

—ఇటీవలే బెంగుళూరుకి రోజూవచ్చే 200,000 ఉత్తరాల, పార్శిళ్లలో ఇంచుమించు 10,000 తప్పు ఎడ్రెస్‌లకు 'డెలివర్' చేశారు!

అన్నది ఉన్నదనటంతో సందేహంలేదు ఇది కేవలం ప్రభుత్వంవారు ఒక్కరూ చేయగలిగినపని కాదు మళ్లీ (కసీసం) జాతీయోద్యమమంతటి ఉద్యమం బయలుదేరాలి సంఘసంస్కరణ ప్రేమసత్వం కన్నా జాతీయోద్యమాలే సాధించగలవన టంలో నిజం చాలా ఉన్నది

చదువుకున్నవారు కొన్ని రాష్ట్రాల లెక్కలు

| | 1961 | 1951 |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 20 8% | 13 1% |
| మద్రాసు | 30 2% | 20 8% |
| మహారాష్ట్ర | 29 7% | 20 9% |
| గుజరాత్ | 30 3% | 23 1% |
| కేరళ | 46 2% | 40 7% |
| ఢిల్లీ | 51 0% | 38 4% |
| ప బెంగాల్ | 29 1% | 24 0% |
| ఉ ప్రదేశ్ | 17 5% | 10 8% |
| బీహార్ | 18 2% | 12 2% |
| ఒరిస్సా | 21 5% | 15 8% |



ఒకాయన ఎలుకల బాధ పడలేక, ఎలుకలను పట్టుకొనుటకు, ఎరగా పకోడీ పొట్లం కొనుక్కొస్తున్నాడు ఆయనికి దారిలో స్నేహితుడు కలిసాడు. స్నేహితుడు పకోడీ పొట్లం తీసి, తినడం మొదలు పెట్టాడు. స్నేహితుడుతింటూంటేఆయన ఓ పకోడీ తీసాడు "అన్నీ తినేననుకున్నారా" అన్నాడు. స్నేహితుడు అబ్బే నువ్వు తిన్నందుకు కాదయ్యా నాకు ఒక్క టేచాలు, ఎందుచేతంటే, యీ వెదవ ఎలుకలు, నా పుస్తకాలు కొట్టేస్తున్నాయి. వాటిని పట్టుకోడానికి బోనులోకి ఒక పకోడీ తీసాను. అన్నీ నువ్వు తినేసినా పరవాలేదు అన్నాడు. ఆయన. స్నేహితుడు యిలా అన్నాడు. (ఆ పకోడీ తీసుకుంటూ) యీ వేళ మీ యింట్లో వుంటాను కాబట్టి, నా చెప్పులు కొరికేస్తాయేమో నని భయమేస్తోంది. కాబట్టి ఇవాల్టికి, "పకోడికి బదులు నాచెప్పు బోనులో పెట్టండి అన్నాడు"

—హెచ్ బి గోపాలరావు (ఆవిడ)



# పగడాలదీవి

## దీవి సుబ్బారావు

పట్టు చుక్కానీ,
తరువాత చుక్కలన్నీ లెక్కెడ్దుగానీ!
దూరంగా ఇసుకవొడ్డు కరిగిపోయిం
బరువుగా యీ వోడ లోతుకే సాగిపోతూంది.
ఎన్నినాళ్లీ తీరాలు, నిట్టూర్పులు
గడవాలి?
ఎప్పటికో
మన బ్రతుకు తెల్లవారేది?
దిగుళ్ళ అలల పొత్తిళ్ళలో జోకొట్టుదాము
గుడ్డి అహం వీడి దిక్సూచి చూచుకొందాము
తేజస్సునిండి, మనలో విశ్వాసం
వెన్నెల జలధిలా పొంగి
పగడాలదీవి గట్టుదొరికితే సరే సరి!
లేదూ! అసలు మనం పుట్టనే లేదు!
పట్టు చుక్కానీ
తరువాత చుక్కలన్నీ లెక్కెడ్దుగానీ!

కవితాకింకిణి
బహుమతి పొందిన కవిత

# న్యూఢిల్లీ 'శాంతి సమావేశం'

శాంతి సమావేశానికి ముఖ్య అధ్యక్షుడైన పండిట్ సుందర్‌లాల్ విషయమై కొంత వాగ్వివాదం జరిగింది. టాగూర్ వార్షికోత్సవంలో మాట్లాడుతూ ఒక చైనా దేశపు ప్రతినిధి, నేడే గనుక టాగూర్ బ్రతికిఉన్నట్లయితే ఈవిషయంలో తప్పంతా భారతదేశానిదే అని గుర్తించేవాడని అన్నారు. ఈ సందర్భంలో జరిగిన వాదవివాదాలలో పండిట్ సుందర్‌లాల్ వైఖరి అసంతృప్తికలిగించింది. అంతేకాక శ్రీ సుందర్‌లాల్ సరిహద్దు విషయంలో శ్రీ నెహ్రూతో తామొక ఒప్పందం కుదుర్చుకున్నట్లు చెప్పారు. నెహ్రూ తామటువంటిదేమీ కుదుర్చుకొనలేదని తర్వాత అన్నారు.

ఆయన ముఖ్యాధ్యక్షుడైనప్పటికీ శాంతి సమావేశానికి ప్రొఫెసర్ బెర్నాల్ 'ఛైర్‌మన్'గా అధ్యక్షతవహించాడు. 'స్టేట్స్‌మన్', 'హిందుస్తాన్ టైమ్స్' పత్రికలలో ప్రచురింపబడ్డ వార్తలే ఈ వ్యాసానికి ఆధారాలు.

ఇటీవల న్యూఢిల్లీలో జరిగిన "శాంతిసమావేశం" (పీస్ కౌన్సిల్) మార్చి 29 వ తేదీన ముగిసింది దానికి ప్రొఫెసర్ బెర్నాల్ అధ్యక్షతవహించారు వీరు ప్రారంభంలో ఒక ఉపన్యాసం చేశారు ఈశాంతిసమావేశం సాధించినవి, అణ్వస్త్రపరీక్షల నిలుపుదలకోసం చేసిన ప్రచారం, అల్జీరియా—ఫ్రాన్సు చర్చలుజరిగేట్లు చేయడం మొదలైనవని చెప్పారు.

వీరి తర్వాత ఆస్ట్రియానుంచి డా. బెర్నార్డ్ అనే ఆయన తను సభకు 'ప్రెస్ ఆఫీసర్' నని, విలేఖరులు వేసే ప్రశ్న లేమైనా ఉంటే ముందే తమకు తెలియబరచాలని, ఆ తర్వాతనే వాటికి శ్రీ బెర్నాల్ సమాధానాలిస్తారని చెప్పారు.

చాలామంది విలేఖరు లీపద్ధతికి ఒప్పుకోలేదు ఇష్టంలేనివారు సభను వదలిపోవచ్చునని డా. బెర్నార్డ్ అనటంతో చాలామంది లేచి అలాగే వెళ్ళిపోబోయారు అప్పుడు ప్రొఫెసర్ బెర్నాల్, డా. బెర్నార్డ్‌ను కొంచెం నెమ్మదించవలసిందిగా కోరి విలేఖరులను కూర్చోమన్నారు. ప్రశ్న వేసినప్పుడు దానికి జవాబు లివ్వగలమన్నారు.

ఈ ప్రశ్నలు చాలామట్టుకు శాంతిసమావేశం టిబెట్‌పట్ల వహిస్తున్న మౌనాన్ని గురించి వేశారు చైనా భారతదేశపు సరిహద్దులలో చేస్తున్న దురాక్రమణనుగురించి కూడా ప్రశ్నించారు

ప్రొ బెర్నాల్ సమాధానంలో చైనాతప్పు ఏమాత్రం లేదనీ, అసలు ఈ విషయాలలో ఎవరిదీ తప్పు లేదనీ వివరించారు శాంతియుతమైన సంప్రతింపులవల్లనే ఈ సమస్యలను పరిష్కరించాలన్నారు ఈ సమావేశంలో ఇటువంటి వాటిని ప్రస్తావించినట్లయితే ప్రస్తుతం జరిగే సంప్రదింపులు చెడిపోవచ్చుననె ఉద్దేశ్యంతోనే ఆ ప్రస్తావన తీసుకురావటం లేదన్నారు.

చైనా—భారతదేశపు వివాదాలు త్వరలో పరిష్కరింపబడకపోయినట్లయితే ఆసియా, ప్రపంచాల శాంతికే హానికలుగవచ్చునని శ్రీ నెహ్రూ చెప్పిన దాని విషయమై తమ అభిప్రాయం అడుగగా, శ్రీ నెహ్రూ ఏమన్నారో తమకు తెలియదని శ్రీ బెర్నాల్ అన్నారు. ఒకవేళ ప్రధానమంత్రి అల్లా అన్నారంటే ఆయన వూహ 'తీవ్రంగా' ఉందన్నారు.

లావోస్, క్యూబా విషయంలోకూడా చైనా—భారతదేశం విషయంలో వలె ఉదాసీనంగా ఎందుకు లేదని అడుగగా ఆయన సరియైన సమాధానము చెప్పలేదు.

జాతీయోద్యమాలు కొన్నిదేశాలలో అణగదొక్కబడుతున్నవని ఈ సమావేశంలో తీర్మానాలలో పేర్కొన్నారు, కాని టిబెట్‌పేరు కూడా చెప్పకపోవటానికి కారణం ఏమిటని కొందరు విలేఖరులు అడిగారు టిబెట్‌లో ఏవిధమైన అత్యాచారాలూజరగటంలేదని ప్రొ. బెర్నాల్ అన్నారు

చివరకు ఒకవిలేఖరి లేచి, ఈ సమావేశంలో కమ్యూనిస్టులు చేసినవాటన్నిటినీ సమర్థించటమే ముఖ్యోద్దేశమని తనకు తోస్తున్న దన్నారు దానితో డా. బెర్నార్డ్ సమావేశం ముగిసిందన్నారు. మరొక ప్రతినిధి, ప్రొఫెసర్ బెర్నాల్‌కు వేరే పను లుండటంచేత అందరినీ ఊరుకోమన్నారు ★

ఒక సుబ్బారావుకు సినిమా పిచ్చి జాస్తి. సినిమా చూచిన వెంటనే ఇంట్లో సినిమాలోని మాదిరి ఆ ఫీట్సన్నీ చేస్తుండేవాడా సుబ్బారావు. సినిమా కత్తియుద్ధంలాగా తను ఒక కర్రనుతీసుకొని "ఛా, ఛా" అంటూదాన్ని అటూ, ఇటూ త్రిప్పుతుంటాడు. ఈ విధంగా ఒక కత్తియుద్ధా లేమిటి, పాటలు, పాటలకు తగిన డాన్సులు, రేలంగి లాగ కామిక్ చేష్టలు, ఒకటేమిటి, అన్నీ. ఇలావుండగా ఆసుబ్బారావుకు పెండ్లయింది. పెండ్లి జరుగుతున్నపుడు మైక్‌లోంచి సినిమా పాటలు వినిపిస్తున్నాయి. సుబ్బారావు పెండ్లికూతురి మెడలోమంగళసూత్రం కట్టుతున్నాడు. ఇంతలో మైక్‌లోంచి "బైఠో బైఠో పెళ్లికొడకా" అనేపాట వెలుపలికివచ్చి, సుబ్బారావు చెవులలోనికి ప్రవేశించింది. ఇంకేముంది, వెంటనే సుబ్బారావు "తక్కీ"మని పీటమీద కూర్చున్నాడు. అక్కడికి వచ్చిన పెద్దలంతా ఇదేమిటా అని ఆశ్చర్యపోయి, తర్వాత అసలు సంగతిని తెలుసుకొని కడుపులు చెక్కలయ్యేలాగున నవ్వుకున్నారు.

ఏ. ఆదిలక్ష్మి (నెల్లూరు)



మార్చి 29 వ తేదీన న్యూఢిల్లీలో జరిగిన వాణిజ్య ప్రకటన కర్తల మహాసభ ప్రతినిధులకు, కేంద్ర సమాచారశాఖమంత్రి డాక్టర్. కేస్కార్ విందు ఇచ్చారు

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీ కృష్ణ**

# అశాంతికి దారితీసిన శాంతిసమావేశం: ఢిల్లీ అశోక్ హోటల్ తెరచాటుకథ

న్యూఢిల్లీ ఈవారం సందడిగా ఉన్నది భారత వాణిజ్య, పరిశ్రమల సమాఖ్య వార్షిక సమావేశం ఇక్కడ ఏర్పాటు అయింది మామూలు ప్రకారం ప్రధానమంత్రే ఈ సమావేశాన్ని ప్రారంభించారు వాణిజ్య ప్రకటన కర్తల (అడ్వర్ టైజర్సు) మహాసభకు కూడా ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం జరిపారు ప్రపంచ శాంతి మండలి అనే పేరుతో వ్యవహరిస్తున్న సంస్థ మరోకసారి సమావేశమైంది ఈ సమావేశం సాఫీగా జరగలేదు మొదటిరోజునే సమావేశ నిర్వాహకులకు మార్క్సిస్టులకు మధ్య కలతలు కలిగాయి చైనా విషయమై ప్రధాన మంత్రి తాను ఒక ఒప్పందానికి వచ్చామనీ, అందువల్ల ఆ సమస్యను సమావేశంలో చర్చించరాదనీ, భారతీయ ప్రతినిధివర్గం సభ్యుడు పండిత సుందర్ లాల్ అన్నారు అలాంటి ఒప్పందం అసలు జరుగలేదని ప్రధాన మంత్రి ఖండించారు దీనిమీద పండిత సుందరలాల్ ఏమి అంటారో ఇంకా తెలియలేదు భారత రాజధానిలో జరిగిన ఈ సమావేశంలో చైనా ప్రతినిధులు భారతదేశాన్ని దూషించారని పార్లమెంటు సభ్యుడు శ్రీ హేమ్ బారువా తెల్పారు అలాంటి సందర్భంలో పలువురు కాంగ్రెసువాదులు సమావేశంలో పాల్గొన్నారంటే ఆచార్య కృపలానికి ఆశ్చర్యం కలుగదా మరి! ఇందుకు ప్రధాన మంత్రి చెప్పిన సమాధానం కుంటిసాకుగా కనిపించింది

భారత వాణిజ్య, పరిశ్రమల సమాఖ్య 34 వ సమావేశానికి ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం జరిపారు ఒక వంక వివాదాలుచేసే అలవాటును విమర్శిస్తూనే శ్రీ నెహ్రూ, సామ్యవాదమనీ, సంక్షేమ రాజ్యమనీ, టెక్నాలజీలో ప్రావీణ్యం అనీ మామూలుగా తాను చేసే వివాదాల నన్నింటినీ ఏకరువు పెట్టారు.

సంక్షేమ రాజ్యంవల్ల ఒరిగేది ఏమిటో అంటే

నుంచి వెలువడే "న్యూ స్టేట్స్‌మన్" పత్రికలో శ్రీ హెరాల్డ్ విల్సన్ వ్రాసిన వ్యాసం చదివితే తెలుస్తుంది. ఈ పత్రికకు పెట్టుబడిదారీ విధానం అంటే పక్షపాతం కలదని అనలేంకదా! బ్రిటన్ సంక్షేమ రాజ్యమే. వస్తూత్పత్తిలోను, ఎగుమతుల లోను ఆదేశం జపాన్, పశ్చిమ జర్మనీ, సోవియెట్ యూనియన్‌లకంటే వెనుకబడింది. ఫ్రాన్స్ మినహా మిగతా అన్ని దేశాలలోకంటే అక్కడ జీవన వ్యయం మాత్రం ఎక్కువగా ఉన్నది. 1951 వ సంవత్సరాన్ని ప్రాతిపదికగా తీసుకొని అనాటి వస్తూత్పత్తిని 100 పాయింట్లనుకుంటే 1960 నాటికి పీటి ఉత్పత్తి జపాన్‌లో 353 పాయింట్లకు, పశ్చిమ జర్మనీలో 218 పాయింట్లకు పెరిగింది. బ్రిటన్‌లో 135 పాయింట్లకు మాత్రమే పెరిగింది, ఎగుమతులకు సంబంధించినంతవరకు జపాన్ ప్రథమ స్థానం ఆక్రమించింది. జపాన్ ఎగుమతులు 382 పాయింట్లకు, పశ్చిమ జర్మనీ ఎగుమతులు 304 పాయింట్లకు పెరిగాయి బ్రిటన్ ఎగుమతులు 114 పాయింట్లకు మాత్రమే పెరిగాయి ఇక జీవన వ్యయం సంగతి ఇది ఫ్రాన్సులో 148 పాయింట్లకు బ్రిటన్‌లో 136 పాయింట్లకు, జపాన్‌లో 129 పాయింట్లకు పెరిగింది పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందిన దేశాలమీద సంక్షేమ రాజ్య సిద్ధాంతం ప్రభావం ఇలా కనిపించింది. మనదేశం ఇంకా "స్వయంగా పెట్టుబడిని సమకూర్చుకోలేని స్థితి"కి రాక మునుపే శ్రీ నెహ్రూ సంక్షేమ రాజ్యం సిద్ధాంతాన్ని అమలు జరపాలని తాపత్రయపడుతున్నారు

పెట్టుబడిదారీ విధానం, మార్క్సిజం ఈ రెండూ ఒక శతాబ్దంనాటి సిద్ధాంతాలని ప్రధాన మంత్రి సెలవిచ్చారు "సాంప్రదాయక ఆర్థిక శాస్త్రవేత్తల దృక్పథంనుంచిగాని, మార్క్సిజం దృక్పథంనుంచిగాని ఈనాడు ఎవరైనా పరిశీలన సాగిస్తే, వారి ఆలోచన వంద సంవత్సరాల నాటి దని అనుకోవాలి" అని ఆయన చెప్పారు. అయితే తమ సిద్ధాంతాన్ని శ్రీ నెహ్రూ, వారి ప్రభుత్వం ఏకాలంనాటిదని భావిస్తున్నారో చెప్పటం కాలేదు. 1960 లో మిల్లు వస్త్రానికి విపరీతమైన కొరత ఏర్పడింది. ఆ సమయంలోనే భారీ మిల్లులకు పని కల్పించటానికి నూటికి రు 33 చొప్పున ప్రభుత్వం ధన సహాయం చేయవలసి వచ్చింది టెక్నాలజీలో ఎంతో అభివృద్ధిని సాధించిన ఈనాడు మద్య నిషేధం అమలుకు కోట్లాది రూపాయలు ఖర్చు చేస్తున్నారు. గో వధను నిషేధించటంతో దేశంలో తోళ్ళ పరిశ్రమ నాశనమైపోయింది వాణిజ్యశాఖ ఉపమంత్రి ఈ వారంలో తెల్పిన విషయాలవల్ల ఈ సంగతి స్పష్టమైంది "తోళ్ళను పదును చేయటానికి దేశంలో ఏర్పాటైన సదుపాయాలతో పోల్చి చూచినట్లయితే, ఉత్పత్తి బాగా తక్కువగా జరుగుతోందని చెప్పాలి ఉన్న సదుపాయాలతో నూటికి 60 వంతులు మాత్రమే వినియోగించుకున్నట్లు అంచనా. ఇప్పట్లో ఈ సదుపాయాలను అభివృద్ధి పరిచే యోచన లేకపోయినా, పరిశ్రమను ఆదుకునేందుకు దిగువ చర్యలు తీసుకుంటున్నాం : (1) తోళ్ళు (పదును కానివి) సరఫరా తక్కువగా ఉన్నందువల్ల వాటి ఎగుమతులను పూర్తిగా నిషేధించటం (2)

# న్యూఢిల్లీ లేఖ

తోళ్ళ (పదును కానివి) దిగుమతుల విధానాన్ని సడలించటం

అంటే మన తల తిక్కలు టెక్నాలజికల్ ప్రావీణ్యంలో అంతర్భాగాలయ్యాయన్నమాట !

వ్యక్తుల సంపద గూర్చి, ప్రజా బాహుళ్యం దైన్యాన్ని గూర్చి ప్రధాన మంత్రి పదే పదే ప్రస్తావించారు ఆకాశాన్ని అంటే భవంతులను నిర్మించటంకంటె మురికివాడల నిర్మూలనంతమకు ఇష్టమైన పని అన్నారు. కాని, ఢిల్లీలో 1947 తరువాత, అంతకుముందు ఉన్న మురికివాడల నిర్మూలనానికి బదులు మరికొన్ని తయారయ్యాయి. పేరొకనంత భారత రాజధాని నగరంలో సంక్షేమ రాజ్య ప్రచారకులు బ్రహ్మాండమైన సౌధాలు నిర్మించారు టెక్నాలజీలో ప్రావీణ్యం గడించటం అవసరమని ప్రధాన మంత్రి ప్రచారం చేయవచ్చుగాని, ఎన్నికలలో విజయం సాధించే టెక్నాలజీ మాత్రం వంద సంవత్సరాలనాటిదిగానే ఉన్నది. సంఘటితులైవున్న వోటర్లను ఏదోవిధంగా సంతృప్తి పరచాలి వీరిలో చాలామంది — కుమ్మరివారితో సహా—ఢిల్లీ మురికివాడలలో నివసిస్తున్నారు.

ఈ సమాఖ్యకు సంబంధించినంతవరకు సామ్యవాద వ్యవస్థ నిర్మాణం పేరుతో రూపొందిన విధానానికి కట్టుబడి ఉన్నంతకాలం, వాణిజ్య రంగానికి పుట్టగతులు ఉంటాయని ఏటా జ్ఞాపకం చేయించుకోవాలని ఉబలాటపడుతూ ఉంటుంది దేశాభ్యుదయంకోసం వీలైనంత ఎక్కువగా తోడ్పడటమే కాక, రాజకీయపక్షాల బొక్కసాలు నింపవలసిన బాధ్యత కూడా సమాఖ్యకు ఉన్నది

* * *

న్యూఢిల్లీలోని అశోక హోటల్‌నుగూర్చి అంచనాల సంఘం సమర్పించిన నివేదిక ఎంత భయంకరంగా ఉండాలో అంత భయంకరంగానూ ఉంది. ఈ పథకం అమలుకు అయ్యే ఖర్చులు, తదితర వివరాలు పరిశీలించకుండానే ప్రభుత్వం అందుకు పూనుకోవడం అసాధారణంగా ఉన్నదని సంఘం అభిప్రాయపడింది అసలు ఈ పథకం వెనకాల నడిచిన గ్రంథం ఏమిటో సంఘానికి తెలిసినట్లు లేదు. కాగా తెలుసుకోవాలని ప్రయత్నించను కూడా లేదు 1955—56 సంవత్సరంలో స్వర్గీయ మౌలానా ఆజాద్ ఐక్యరాజ్యసమితి విద్యా, సాంస్కృతిక సంస్థవారిని న్యూఢిల్లీలో సమావేశం కావలసిందిగా కోరారు తీరా వీరు ఆహ్వానించటం, వారు అంగీకరించటం జరిగాక, సమావేశ నిర్వాహకులు, ప్రతినిధుల వసతికి తగిన సదుపాయాలు లేవని ప్రభుత్వం గుర్తించింది. వెంటనే ఉరుకులు, పరుగులతో ఇప్పటి మౌలానా ఆజాద్ రోడ్డులో ఒక భవనం నిర్మించింది. దానికే "విజ్ఞాన భవనం" అని పేరు పెట్టారు

ఈ ప్రతినిధులకు వసతి సదుపాయ నవానగర్ సంస్థానాధీశుడు జామ్ సాహెబ్ ప్రవేశించారు ఈయన, శ్రీ నెహ్రూ ప్ర అంటే లిన్‌లితుగో ప్రభుత్వమనుకొని హో నిర్మించడానికి సంసిద్ధత తెల్పారు ఈ కృషికి ఇతర సంస్థానాధీశులు సైతం సంతసించి సహకరించవచ్చునని ఆయన ఆశించిఉండవచ్చు. ఇట్లా అనుకొని ఆయన నవ్వుతో కాలు వేశారు. తీరా న్యూఢిల్లీ వచ్చేసరికి, తుపాకులు పేల్చి ఈ మాజీ సంస్థానాధీశునకు స్వాగతం చెప్పిన పాపాన ఎవ్వరూ పోలేదు. ఈనాడు సంస్థానాధీశులకు ఉన్న బిరుదులు కూడా వారితోనే అంతరిస్తాయికదా వారికి మంజూరు చేసిన గౌరవభృతిమీద ఎస్టేట్ సుంకం, సంపద సుంకం విధించబడ్డాయి. అందుచేత వారిలో చాలా మంది ఇప్పుడు విదేశీ యాత్రికులను ఆకర్షించేందుకు టిక్కెట్లు అమ్ముకుంటున్నారు. జామ్ సాహెబ్ 1955 మేనెలో న్యూఢిల్లీ వచ్చి, సమావేశం (సమితి విద్యా సాంస్కృతిక సంస్థ) ఏర్పాటయ్యేలోగా హోటల్ నిర్మాణం పూర్తి చేసేందుకు తమ అశక్తతను వెల్లడించారు. ఈ విషయాలన్నీ తెలిస్తే హోటల్ నిర్మాణానికి పూనుకున్న ప్రభుత్వేతరులు వివరంగా అంచనాలు ఎందుచేత తయారు చేయించలేదో అర్థమవుతుంది. "వ్యవధి తక్కువగా ఉన్నందువల్ల భవన నిర్మాణంతోపాటే, వివరాలు అంచనా వేయవలసి వచ్చింది" అని ప్రభుత్వం అంచనాల సంఘానికి తెల్పింది.

అంచనాల సంఘం నివేదికలో ఇలా ఉన్నది : హోటల్ పరిశ్రమలో పెట్టుబడి ఖర్చులకు, మంచాల సంఖ్యకు సంబంధం ఉంటుంది. పెద్ద తరహా హోటల్‌లో ఒక మంచం ఏర్పాటు చేయడానికి సుమారు రు 35 వేలు ఖర్చు అవుతుందని హోటల్ ప్రమాణాల సంఘం (1958) పేర్కొన్నది అశోక హోటల్‌లో 422 మంచాలు ఉన్నాయి. దీని నిర్మాణానికి రు. 2 కోట్ల 78 లక్షలు ఖర్చు అయినట్లు తుది అంచనాలు తెల్పుతున్నాయి అంటే సగటున ఒక మంచం ఏర్పాటు చేయడానికి సుమారు రు 66 వేలు ఖర్చు చేయవలసి వచ్చిందన్నమాట.

మంచాల సంఖ్యను పెట్టుబడి ఖర్చులతో సమన్వయపరచాలనే ఆలోచన తమకు కలుగలేదని నిర్మాణాలశాఖ ప్రతినిధి సాక్ష్య సేకరణ సందర్భంలో చెప్పారు అసలు ఇలాంటి హోటల్ నిర్మాణానికని నిర్దేశించబడిన ప్రమాణాలు ఏమిటో కూడా తమ శాఖకు తెలియవన్నారు భవన నిర్మాణానికి ఇంత ఎక్కువ ధనం ఖర్చు కావడానికి అలంకరణ చాలావరకు కారణమన్నారు అంతేకాక వ్యవధి తక్కువగా ఉన్నందువల్ల పనివారికి రెట్టింపు కూలీలు ఇచ్చి, భోజన వసతులు, తదితర సదుపాయాలు కలిగించవలసి వచ్చిందట

ప్రభుత్వరంగంలో శ్రీ నెహ్రూ నిర్వహించిన రెండవ కార్యక్రమం ఇది ఇంతకు మునుపువారు ఢిల్లీ గృహనిర్మాణ సంస్థను ఏర్పాటు చేశారు. ఎన్ని మురికివాడలను నిర్మూలించటంమాని ఈ హోటల్ నిర్మించారో ఇంకా పరిశీలించవలసి ఉన్నది.



# హరి వంశము

## సాందీపని పర్వం-10

బంధువులు, సామంతులు, సర్పులు వెళ్లిపోగా, మధుర బావురుమంటూ ఉన్నది రాచనగరులు కూడా ఇంతవరకు బంధుజనాకీర్ణమై, ఉపనయనోత్సవోల్లాసంతో విలసిల్లినవి ఇప్పుడు బావురుమంటున్నాయి చంద్రుడులేని ఆకాశాన్ని పోలి యాదవుల రాజధాని పరమనిరుత్సాహంగా ఉంది. వసుదేవుని ఇంటిముంగల పాలికలు నవతెత్తి మోములువాలుతున్నాయి ఆ యుండ్ల, ఆ పాలికలు వినా మరి ఒక్కరికి ఇప్పుడు ఉత్సాహం అన్నది లేకుండా ఉన్నది సరుకుదింపిన ఓడలవలె ఇండ్లన్నీ తేలికపడి ఉన్నట్లు కన్పిస్తున్నవి రోహిణియు ఇరుకుగా ఉన్నది ఆమె ఇన్ని సంవత్సరములు అరణ్యవాసము చేసి వచ్చినది ఆమెకు అరణ్యకజీవనము అలవాటై పోయినది ఇప్పుడు ఈ నాగరిక జీవనమేమో క్రొత్తగా ఉన్నది బృందంలో ఈ మేడలు లేవు ఈ వీధులు లేవు ఈ జనసమ్మర్దము లేదు జీవితం ఇక్కడ నగరంలో తనకు పరమసంబాధంగా ఉన్నట్లు ఉన్నది రోహిణికి బృందలో ప్రతిదినము గోవులతో బ్రతికిన తాను ఇప్పుడు ఇక్కడ రాచమర్యాదలలో తెలలేక పోవుచున్నది అచ్చమైన, ప్రకృతిసిద్ధమైన జీవితానికి అలవాటుపడిన తనకు ఈ నాగరిక జీవితం ఇప్పుడు ఆయాసం అనిపిస్తున్నది బృందలో యమున ఉన్నది మధుర దగ్గరనూ యమున ఉన్నది కాని ఆ యమునకు ఈ యమునకు సంబంధం ఏమిటి ? ఈ యమున గూడ పట్టణవాసివలె, నాగరిక జీవన ప్రతీతిని వెలారుస్తూ ఉంది ఇంతవరకు తనకు మధురకు వచ్చిన క్రొత్తతనములో, బంధుగులను అందరిని చూచుకొన్న ఆనందములో, భర్తతో కలిసి ఇన్నాళ్ళకు తిరిగి జీవించ గల్గడము, కుమారుల ఉపనయనముల సందడిలో, ఈ విపర్యాసము కల్పించలేదు ఇది ఏదో అనిపించలేదు ఇప్పుడు అనిపించుచున్నది రోహిణి తన ఈ తోచన స్థితిలో ఒకరోజున దేవకి యింట, ఒకరోజున వసుదేవుని మరియొకభార్య యింట గడుపుచున్నది. ఆమెకు తన ఈ స్థితియేమో అర్థము కాలేదు ఆమె ఈ స్థితిలో అనుకొన్నది : నాకు వలెనే, రామకృష్ణులు గూడ బాధను పొందుచున్నారా ? నా బాధయే నాకు సరిగా అర్థమగుట లేదు బిడ్డలను అడిగి చూతునా ''

ఆమె బిడ్డలను అడగకుండగనే విషయమేమో శ్రీకృష్ణదేవుడు తెల్పివేసినాడు "తల్లీ ! మీరు ఏమో బాధ చెందుచున్నారు మీకు మధుర బృందవలె లేదు అవును ఇప్పుడు ఇక్కడ నీల లేదు నీల ఉన్నంతవట్టు మీకు ఏ బాధయు లేదు మరి అది బృందకు తిరిగి పోగా, మీకు ఏమియు తోచుచున్నట్లు లేదు ''

"రోహిణి మనస్సులో అనుకొన్నది· తండ్రి అసలు రహస్యమును గ్రహించినాడు. నాకు నీలవంటి కూతురు ఒక్కర్తుక కల్గిన బాగుండును" అనుకొన్నంతలో ఆమెకు నవ్వు వచ్చినది. ఇన్ని యేండ్లుగా అరణ్యవాసము, అజ్ఞాతవాసము చేయుగా, తనలో ఈ కోరిక లేదు ఏ కోరిక [illegible]
[illegible]

'తండ్రీ ! నీకు ఈ నగరమున తోచుచున్నదా" ?

"ఎందుకు తోచుటలేదు అన్న ఉన్నాడు ఉద్ధవుడు ఉన్నాడు. సాత్యకి ఉన్నాడు మన సూతుని బిడ్డను దారకుని చూచినారా ! తల్లీ. మీరు ? వాడు ఉన్నాడు ఇంత లేదు వాడు అప్పుడే అశ్వహృదయవేత్త! తల్లీ ! వాడు నాకు సారథి మరి అక్రూరుని సంగతి చెప్పనే అక్కరలేదుగద ! తక్కుంగల యదుకుమారు లున్నారు ఇకనైన రాచకార్యములు ఉన్నవి నాకు తోచకపోవుటలేదు ''

రోహిణి : "అవును ! అవును ! నీకు తోచకపోవుటలేదు"

కృష్ణుడు "మరియు మధుర ఉన్నది మధురను సంరక్షించుకోవలయునను ఆలోచన యున్నది తల్లీ ! కంసుడు విచిత్రమైన రాజు ఉద్ధతుడు. అతని ఔద్ధత్యమే నాకు ఇప్పటికి విచిత్ర మనిపించుచున్నది మధుర ఉన్నదా! దానిని అతడు పరమ నిరాదరముగా చూచినాడు కోటకు కాపులేదు అగడ్తలు చెడిపోయినవి కొన్నిచోట్ల కోట గోడలును విరిగిపడినవి కంసునకు పరరాజులన్న భయములేదు. తాను ఉండగా, మధుర అజేయమని అతని భావము అది అతని ఔద్ధత్య లక్షణము అందువలన మధురను నిరాదరించినాడు మరి మనము అట్లు కాదు యాదవులన్న విరోధము చేసెడి రాజులు చాలమంది ఉన్నారు మనము రాజుల మేమిటని వారి యభిప్రాయము వీరికి మాగధుడైన జరాసంధుడు నాయకుడు మరి అతనికి మధురపై కోపము రాకారణమున్నది నేను అత్తలను, అస్తిని, ప్రాస్తిని, బ్రతిమలాడినాను మీకు ఏ లోపము ఉండదు ఇక్కడనే ఉండిపొమ్మన్నాను మీకు అంతయును దెలియునుగదా ! మహారాజుచేత చెప్పించినాను మీరును, అమ్మ దేవకియును గూడ చెప్పినారు మా తండ్రి వసుదేవుడు కూడ చెప్పినాడు వారు వినలేదు నేను ఏమిచేయుదును ? వారిని మగధకు పంపించినాను వారు రాజగిరి చేరుచున్నారు. అవును వారు రాజగిర్యధీశుని తనయలు వారికి ఈ యాదవుల రాజ్యముతో ఉండుట యనగా, ముండ్లమీద ఉన్నట్లు అయినది తల్లీ ! ఇక మాగధుడు మధురను ముండ్లమీద ఉండునట్లు చేయును

రోహిణి ! ఇవి యన్నియు రాచవ్యవహారములు నేనో అడదానను. నాతో ఎందుకు ఇవి అన్నియు చెప్పుచున్నావు ?

శ్రీకృష్ణదేవుడు రోహిణిదేవి కన్నులలోనికి చూచినాడు. చూచి గల్లున నవ్వినాడు. "తల్లీ ! రామచంద్రునకు కైక ఎట్లు ప్రథమ శిక్షాగురువో, నీవు మాకు అట్లు ప్రథమ శిక్షాగురువు మరి రాజకార్యములు మీతోగాక మరి ఎవ్వరితో చెప్పుకొందును నేను రాజనైనచో, మంత్రులతో మాట్లాడియుందును. మరి నేను రాజును కాదుగదా ! అందుచేత మీతో చెప్పుకొనుచున్నాను మరియు ఒక్క విశేష మున్నది అదియును తమకు మనవి చేసుకొనవలయునని వచ్చినాను" అని శ్రీకృష్ణదేవుడు తిరిగి గల్లున నవ్వినాడు. అంతలో తీక్ష్ణుడైనాడు

"తల్లీ ! నేనును, అన్నయు పుట్టినది మొదలు ఆలలో పెరిగినాము సంస్కారము, ఆచారము, ఘనవిద్యాగ్రహణము లేక అడవి కారెడ్లవలె ఛందంగా పెరిగినాము సమగ్రరూపాసనం లేక చెడినాము ఇప్పుడు ఆ నర్వాన్ని ఏదో గురువును ఉపాసించి కైకొనడం తగవుకాదా ? అన్న రామునితో ఈ [illegible] మాట్లాడినాను [illegible] 'సరే' నన్నాడు మీతో మాట్లాడి గాని,

హారిత శివశర్మ

# హరివంశము

తండ్రిగారికి ఈ విషయం విన్నవించుకో దలచలేదు !"

రోహిణి : "దేవకితో చెప్పినావా ?"

శ్రీకృష్ణుడు నవ్వినాడు. "ఆ పని మీరు చేయవలయును" అన్నాడు.

శ్రీ కృష్ణదేవుడు బలరామునితో విద్యా సంపాదనం కోసం ఎక్కడికో బయలుదేరి పోనున్నట్లు ఆ తరువాత దేవకికి తెలిసినది వసుదేవునకు తెలిసి నది ఉగ్రసేనునకు తెలిసినది. సర్వ యాదవులకు తెలిసినది మరి శ్రీకృష్ణు నకు గురువు కాగల ఆ వ్యక్తి ఎవ్వరు ? ఉపనయన సమయమున శ్రీ కృష్ణ దేవుడు తన తండ్రికి యిచ్చిన వాగ్దానము మాట ఏమిటి ? భగవంతుడు గూడ ఆ వాగ్దానమును మరిచిపోలేదు. సావిత్రిని ఉపదేశించి ఆచార్యుడైన తన తండ్రి తనతో అనిన మాటలు ఇప్పటికిని భగవంతునకు గుర్తునం టున్నవి "యద్యయం ఆచార్యశ్చతుర్వేద సర్వ శాస్త్రవిత్ అధ్యాపయితుం వ్యాఖ్యాతుంశక్నోతి మచ్ఛిష్యోయం నాన్యత్రగచ్ఛేదా సమావర్తనా న్మత్తః నీవ విద్యా మభ్యసేదితి మనసి వర్తతే చేత్ " అని ఆ తండ్రి తన దక్షిణ హస్తమును తన దక్షిణ హస్తముతో పట్టుకొని "యస్మిన్ భూతశ్చ, భవ్యశ్చ సర్వేలోకా స్సమాహితా, తేన గృహ్ణామ్మిత్వామహం మహ్యాం గృహ్ణామి, త్వా మహాం ప్రజాపతి సా త్వామహ్యాం గృహ్ణామి" శ్రీ కృష్ణవర్మన్ ! అనినాడు. "శ్రీ కృష్ణ వర్మన్ ! ఆచార్యదేవోభవ !" అనినాడు. అనగా తాను "బాఢంభవామి భవద్భి రననుజ్ఞాతస్సన్ యజనాది కర్మ నకరోమి" అని సమాధానము చెప్పినాడు. ఇప్పుడు తాను ఆచార్యుడైన తండ్రిని వదిలి మరియొక ఆచార్యుని ఆశ్ర యించగా తలంచుచున్నాడు. ఇప్పుడు తండ్రియైన ఆచార్యుని అనుజ్ఞను తాను పొందవలసి ఉన్నది

భగవంతుడు ఒక సుముహూర్తమున బలరామ ద్వితీయుడై ఆచార్యు డైన తండ్రిని అగ్ని గృహములో తనకు దర్శనము ఇప్పించగా కబురు పెట్టి నాడు ఆ కబురును తీసుకొనిపోయినది రోహిణి శ్రీ కృష్ణదేవుడు ఆరోజున రోహిణిదేవిని ఇట్లు అర్థించినాడు : "ఆచార్యులయిన వసుదేవులు నాకు విద్యను సంపూర్ణముగా ప్రసాదించరని కాదు నాకు సాందీపని వద్ద శుశ్రూష చేయ వలయునని యున్నది. ఆయన కులపతి యని విన్నాను. మహాధనుర్వేత్త యని విన్నాను రాముడును, నేనును, ఆయనను సేవించి వచ్చెదము. ఉజ్జ

## "ఎప్పుడూ క్యూలో ముందే....ఐనా" ! ! !










సత్యమూర్తి (హైదరాబాద్)

వుడు, సాత్యకియు గూడ వత్తు మనుచున్నారు. సాందీపని ప్రసిద్ధి చాల దూరము వరకును వ్యాపించియున్నది నీవు తండ్రిగారితో మా యీ కోరికను గూర్చి విన్నవించవలయును"

రోహిణికి అభిప్రార్థనము ఏలనో అర్థమైనది దేవకితో చెప్పినచో ఆమె కొంత దుఃఖించును. ఇన్ని ఏండ్లు తనదగ్గర లేని బిడ్డ, తిరిగి అప్పుడే విద్యాభ్యాసమునకై పెరచోటులకు పోవుటను ఆమె భరించలేదు తన జీవితములో దేవకి సుఖమును ఎరిగినది ఇప్పుడు శ్రీకృష్ణుడు మధురకు వచ్చినది ఆ తల్లి సుఖమును చూరగొనుచున్నది ఇది ఇంతలో అన్యథాకరణమును చెందుటను ఆమె ఎట్లు సహించును వసుదేవుడును అంతియ స్వపుత్ర విరహక్లేశమును ఆ తల్లియు, ఆ తండ్రియు దీర్ఘకాలము అనుభవించినారు రోహిణి అన్నది తండ్రీ! ఇది కష్టమైన కార్యమును నామీద పెట్టినావు అయినను ప్రయత్నము చేస్తాను

మరి తాను అగ్నిగృహమును దరియగా తన భర్త తన్ను చూచి మందహాసమును చేసినాడు "ఏమి! రోహిణి! ఏదో కార్యమును అవలంబించి వచ్చినట్లున్నావు ?" అనినాడు

రోహిణికి తెలియును తన స్వామికి బిడ్డలు ఎవ్వరో గురువును ఆశ్రయించి విద్య నభ్యసించగా పోవుచున్నారని. మరి ఆమె దౌత్య మెందుకు ? శ్రీకృష్ణుని చేత లన్నియు ఇట్టులే వుండును. ఆమెయు నవ్వినది "ప్రభు! తమకు తెలియనిది ఏమి ? కుఱ్ఱలు మరియొక గురువు నాశ్రయించి విద్యను అభ్యసించగా తలంచుచున్నారు తమ అనుజ్ఞకోసము వేచియున్నారు"

వసు దేవకికి చెప్పినావా ?

రోహిణి . మీరు చెప్పిన బాగుండునని వూరకున్నాను.

వసుదేవుడు వెంటనే మాటాడలేదు కొంచెము సాలోచనుడై "రోహిణి! దేవకిని గూడా పిలుచుకొనిరా" అన్నాడు

రోహిణి దేవకి ఇండ్లకు పోయినది ఆమెను వెంటబెట్టుకుని వచ్చినది అప్పుడు వసుదేవుడు వారిని సంబోధించి ఇట్లా అన్నాడు : "ఓసి దేవకి! ఓసి! రోహిణి! మీకు ఇప్పుడు ఒక రహస్యము చెప్పుచున్నాను! నిజమునకు ఇది రహస్యమును కాదు శ్రీకృష్ణ బలరాములు నాకు శిష్యులు కదా! వారు ఇప్పుడు మరియొక గురువును ఆశ్రయించగా తలంచుచున్నారు." అని రోహిణిని చూచి "నీవు వారి దాతవు శ్రీకృష్ణుడు ఆ గురువు యెవ్వరో చెప్పలేదా ?" అని ప్రశ్నించినాడు

రోహిణి : స్వామి! చెప్పినాడు సాందీపనియుట. మన ఇండ్లలో ఉపనయనములు జరిగినప్పుడు సదస్యమునాడు వచ్చినాడట!

వసు : "అవును! ఆయనయే సాందీపని ఆయన అవంతీపుర వాసి· కాశికానగరంలో ఆయన గురుకులం ఉన్నది భగవంతులైన వ్యాసులు నాతో చెప్పినారు వసుదేవ! శ్రీ కృష్ణస్వామి తాను సాందీపని యొద్దకు విద్యాభ్యాసము నిమిత్తము పోదును అనును నీవు పుత్రప్రేమమున చేసి అభ్యంతరము చెప్పవలదు సుమా! మరి స్వామి ఎవ్వరు ? జగద్గురువు సర్వజ్ఞుడు. అయినా గుర్వంగీకరణం చేస్తున్నాడు ఎందుచేత ? లోకంలో మానవులు గురువాక్యోద్యుక్తులై గాని తత్పూర్వారంభము చేయగా పోలదని బోధించడం కోసం గోవిందుని ఈ ఆలోచనను నీవు కాదనకు" మరి నేను ఇందులో కాదనతగినది లేదు బిడ్డలను రమ్మను అనుజ్ఞ ఇస్తాను

వసు: దేవకివంక చూచినాడు "దేవకీ!" అన్నాడు "ఇది విధిగా జరగవలసిన పని నీవు మనస్సులో కష్టపడి లాభములేదు నీ కష్టము ఏమో నాకు తెలియనిది కాదు నాకును బిడ్డలను వదిలిపెట్టి యుండుట అనగా కష్టముగానే ఉన్నది మరి బిడ్డల చదువు మాట యేమి ? నేను సాందీపని యంత గురువునా! బాదరాయణులే తండ్రిని సాందీపని యొద్దకు పంపమన్నాడు. నేను కాదనను. నీవును అనవద్దు."

దేవకి : స్వామి! నేను కష్టపడెదనని అన్నానా ? మీరు అనుచున్నారు. బిడ్డలు అడవులలో కష్టపడుచుండగా సహించినాను కంసుడు వారిని చంపగా ప్రయత్నించినపుడు సహించినాను ఇప్పుడు బిడ్డలు ఒక మహా విద్వాంసుని కడకు చదువుకొన బోవుచుండగా ఏల కష్టపడుదును సంతోషింతును

రోహిణి ఊర్పు తీసుకొన్నది "చెల్లి! నేను నిన్ను తప్పుగా అర్థము చేసుకున్నాను" అన్నది

వసుదేవుడు గలగలా నవ్వినాడు

"రోహిణి నీవు తప్పుపడుట అని యున్నదా!" అన్నాడు.

రోహిణి దౌత్యము ఫలించినది ఆ మరునాడు ఒక్క శుభముహూర్తమున రామకృష్ణులు ఆచార్యుడైన తండ్రి దర్శనార్థము అగ్నిగృహములో ప్రవేశించినారు వారిని చూడగా ఆ తండ్రి పొందిన ఆనందమే ఆనందము. వారిని చూచినప్పుడెల్ల వసుదేవుడు అట్టి ఆనందమునే పొందును ఆయన ఇప్పుడు వారిని చూచి మందహాసం చేసినాడు "రామ! కృష్ణ" అని నోరారగా బిడ్డలను సంబోధించినాడు "తండ్రీ! రామ! నాయనా! కృష్ణ! ఏమి పనిమీద వచ్చినారు" అని ప్రశ్నించినాడు

శ్రీకృష్ణదేవుడు సమాధానము చెప్పినాడు

"ఆచార్య! మేము సాందీపని యను కులపతిని ఆశ్రయించి శుశ్రూషించి విద్యను అభ్యసించగాఎంచినాము అందుకు మీ అభ్యనుజ్ఞ కావలయును

వసు · దానికేమి! మా యనుజ్ఞ ఎప్పుడును ఉన్నది మీరు వేర గురువులను ఆరాధింతు మనగా మేము వద్దందుమా! ఓయి! శ్రీకృష్ణ వర్మ! అభ్యనుజ్ఞ ఇచ్చుచున్నాను

అప్పుడు బలరాముడు ఆచార్యుని సంబోధించినాడు. "భో! ఆచార్య! నేను కృష్ణునితోపాటు సాందీపని కొలువ పోయెదను. అభ్యనుజ్ఞ నిప్పింతురా?"

వసు : తాత! రామ! అటులనే అభ్యనుజ్ఞ నిచ్చుచున్నాను

తిరిగి వసుదేవుడు తన బిడ్డలను ఇద్దరిని సంబోధించినాడు తాత! రామ! నాయనా! కృష్ణా! మీకు నేను చెప్పవలసింది ఏమి ఉంది అయినా గురుకులవాసం చేయడానికి పోతున్నారు గనుక రెండు మాటలు చెప్పదలచుకున్నాను. మీరు బ్రహ్మచారులు విద్యను బ్రహ్మచర్యంతో అధ్యయనం చెయ్యాలి. ప్రతినిత్యము భిక్షతో అశనాయాసన్ని మార్చుకోవాలి. గురువునకు బరువు కారాదు. గురువు సాక్షాత్తు విష్ణువు గురువు బ్రహ్మ గురువు మహేశ్వరుడు తండ్రి! రామ! నాయనా! కృష్ణ! గురువు సాక్షాత్తు పరబ్రహ్మము ఆ గురువును అటులుగా చూడండి మరి భిక్షాక్రమం ఎట్టులో శాస్త్ర చెబుతున్నది. ఆ శాస్త్రాన్నే నేను మీకు చెబుతున్నాను

"గృహ్యోక్త విధినో పేతః
పరివర్త్యోత్తరీయకం
దండం పాత్రం సమాదాయ
నమస్కృత్య రవిం గురుం.
భిక్షార్థమ్మతతో యాసి
ద్విజవేశ్మ తథా వ్రజేత్ ।
వేదయజ్ఞై రహీనానాం
ప్రశస్తానాం స్వకర్మసు
బ్రహ్మచార్యాహరే ద్భైక్షం
గృహేభ్యః ప్రయతోన్వహం.
గురోః కులే న భిక్షేత
న జ్ఞాతికుల బంధుషు
అలాభేత్వన్యగేహానాం
పూర్వం పూర్వం పరిత్యజేత్.
అహితాగ్ని రనడ్వాంశ్చ
బ్రహ్మ చారీ చ తే త్రయః
అశ్నంత ఏవ సిద్ధ్యంతి
నైషాం సిద్ధి రనశ్నతాం.





# ఆత్మస్థైర్యం - ఆనందం

ఎ. వేణుగోపాల రెడ్డి

ఉదయం ఏడుగంటలకల్లా డాక్టరుగారింటి వరండాలో రోగిబృందం కొలువుదీర్చింది. డిస్పెన్సరీ తెరిచే టైము అసలు ఏడున్నరే అయినా మామూలుగా డాక్టరుగారు, స్నానం బ్రేక్ ఫాస్టులు ముగించుకుని రోగులకు ప్రసన్నమయే సరికి దాదాపు ఎనిమిదిగంట లవుతుంది. ఆరోజు ఎనిమిది దాటినా డాక్టరుగారి పత్తా లేకపోయే సరికి, రోగిసమూహం దర్శనంకోసం వేచి యున్న భక్తకోటిలా, ద్వారానికి అడ్డంగా పడి యున్న తెరకేసి తీక్షణంగా చూస్తూ "తెర తీయగరాదా ...." అనే త్యాగరాజకృతి అందుకునే పరిస్థితిలో ఉన్నారు. రణగొణమనే మాటల ధ్వని అట్టే లేకపోయినా తుమ్ములు, దగ్గులు (పొడివి, పెద్దవి) మూలుగులతో వరండా కాస్త సందడిగా ఉంది. రమణ కూడ ఆ రోజు రోగి ముఠాలో చేరాడు. అంతకు క్రితం రోజ సాయంత్రమే అకస్మాత్తుగా "ఫ్లూ" అతన్ని ఆలింగనం చేసుకుంది. ఆ ఉదయాన్నే మందు సీసా చేతబుచ్చుకుని డాక్టరుగారి ముడుపు చెల్లించుకోటానికి బయలుదేరక తప్పిందిగాదు.

ఎంతసేపని అలా రాతివిగ్రహంలా గుమ్మానికేసి చూస్తూ కూర్చోటం! విసుగుపుట్టింది రమణకు. బుర్ర గోక్కున్నాడు గడ్డం తడుముకున్నాడు. చేతనున్న మందుసీసాకార్కు రెండు మూడు సార్లు తెరిచి మళ్లీ మూశాడు. కాస్సేపు గోడమీది కాలెండర్లవేపు, ఫొటోలవేపు, గోడ గడియారంవేపు తెగ చూశాడు. చిన్నముల్లు

**రమణ వెంటఉన్న అమ్మాయిని చూచేసరికి కమల ఈర్ష్యతో ఉడికిపోయింది. అతడు ఆమెకు ఏమి అవుతాడు? కమలకు ఈ సందేహం ఎలాతీరింది.....**

పదిమిది తొమ్మిద్ది అంకెలమధ్య ప్రాకుతూంటే, పెద్దముల్లు రెండు దాటి మూడో అంకె మీదికి పరుగెడుతోంది ఇంతలో ఆపద్బాంధవుడిలా గుమ్మంతెరలోంచి ఊడిపడ్డాడు కాంపౌండరు మహాశయుడు! రోగిమురాకేసి చూసి 'డాక్టరు గారి బంధువులొచ్చారు ఆయన వాళ్లతోటి మాట్లాడుతున్నారు ఇంకో పావుగంటలో వచ్చేస్తారు'' అని ఓ చిరునవ్వు విసిరేసి, మళ్లీ తెరమరుగున మాయమయ్యాడు ఈ వార్త రోగిబృందంలో కొంత సంచలనం కలిగించింది నిట్టూర్పులతరువాత గుసగుసలు మొదలెట్టాయ్''

రమణకూడ కాస్త ఉత్సాహంతో, ఆ కాంపౌండరు చేసిన ప్రకటన తన సహరోగులలో ఎలాంటి మార్పు తీసుకొచ్చిందో చూడాలనే ఆసక్తితో వాళ్లందరినీ సర్వే చేయసాగాడు రోగులలో ఆడా మగా, వయసుమళ్లినవాళ్లూ, మళ్లబోతున్న వాళ్ళూ, మళ్లని వాళ్లూ, పసికందులూ, కుర్రాళ్లు ఉన్నారు వాళ్ళందరిముఖాలకేసి పరీక్షగా చూస్తూ రాగ అతని చూపు ఆ ''అమ్మాయి' మీద పడిందో లేద 'రక్' మని ఎందుకో ఆగిపోయింది మళ్లీ ప్రక్కకు సాగలా ఆక్షణంలోనే కమలకూడ అప్రయత్నంగా అతనివేపు చూడటం జరిగింది ఇద్దరి చూపులబాణాలూ చప్పుడుకాకుండా 'ఢీ' కొన్నాయ్ అయితే రమణ చూపులతూపుల ఉధృతాని కాగలేక, కమల సిగ్గుపడిపోయి చంక నున్న పిల్లాడిని తనముఖానికి అడ్డుగా తీసుకుని ప్రక్కనున్న ముసలావిడ వైపు దృష్టి సారించింది

రమణకూడ ఇతర్లు గమనిస్తున్నారేమో నన్న బిడియంతో కమలవైపు ఆట్టే ఎక్కువసేపు చూడలేకపోయాడు ఏదో తీవ్రంగా ఆలోచించు కుంటున్నట్టు, గడ్డం తడుముకుంటూ నేలకేసి చూస్తున్నాడు అతనిమనస్సు ఏదో అర్థంకాని బాధతో అల్లకల్లోలమైంది రమణ ఇదివరలో నాలు గైదుసార్లు కమలను మార్కెట్టుదగ్గరా, పార్కు లోనూ చూశాడు ఆమె తనవీధి చివరింట్లో దాదాపు ఆరునెలలుగా కాపురముంటోందని తెలుసు కూడ అయితే ఆమెను ఇదివరకు చూచి నప్పుడు తెలియని విషయం, ఇప్పుడు చూస్తు న్నప్పుడు బయటపడింది ఇదివరకు చూసినప్పు డల్లా రమణ, ఆమె ''కుమారి''గాబోలునని ఊహించుకుని ఆమె అందచందాలకు ముగ్ధు డయ్యేవాడు ఆమెనుగురించి ఏవేవో తియ్యటి కలలుగన్నాడు కూడ అయితే ఎంత ఘోరం జరిగింది! ఆమె ఎంతమాత్రమూ పెళ్లిగాని ''అమ్మాయి' కాదన్నమాట ఆమె ఇల్లాలు మాత్రమేగాక, ఓ మాతృమూర్తికూడా నన్న మాట! రమణ ఆమెనుగురించి లేనిపోని అపో హలు కల్పించుకున్నందుకు పరిహారంగా మనసు లోనే 'ఛీఛీ'మని లెంపకాయలు వాయించు కున్నాడు మరుక్షణమే అతనిలో ఆమెను చూస్తుంటే ఏదో చెప్పరానంత జాలి కలిగింది చూడబోతే పచ్చగా పదహారేళ్లయినా నిండినట్టు లేదు ఈపాటికే పెళ్లీ, సంతానప్రాప్తీ అంటే అది నిజంగా ఆమె దౌర్భాగ్యం గాక మరేవిటి అని అనుకున్నాడు ఇలాగయితే ఆడాళ్ళు ఎప్పుడు కాలేజీలలో చదివేది, ఎప్పుడు ముందడుగు వేసేది ప్రపంచం అంటే ఏవిటో బాగా తెలిసీతెలియక ముందే ఇలా ఆడాళ్లకు సంసారపుగొడవలు అంటగట్టే పెద్దమనుషుల నేమనాలి? ఇలా అందరమ్మాయిలూ పదహారేళ్లు నిండీ నిండకముందే బిడ్డల్ని చంకనెత్తుకుంటే మన జనాభాకి తరుగుదల ఎప్పుడు? ఎలాగ?— ఇటువంటి ఆలోచనల్తో కాస్సేపు 'ఆమె' ను ఏవగించుకున్నాడు రమణ

కమలకు రమణను చూడటంతోటే ఎందుకో తనకుతెలియకుండానే సిగ్గు ముంచుకొచ్చింది బహుశా అతను తనవైపు పదేపదే చూస్తూం డటంవల్ల గాబోలు ననుకుంది. అయినా అత నంటే ఆమెకి అభిమానం లేకపోలేదు పాపం ఒంట్లో బాగులేదు గాబోలు! ఏం జబ్బో మరి! అని అనుకుంది కమల

ఇంతలో తెర తొలగించుకుని అవతారమూర్తిలా డాక్టరు వరండాలోకి ప్రసన్నమయి కళ్లజోడు చేతబుచ్చుకుని మెడవంచకుండా రీవిగా రోగి పరివారం మీదికి ఓసారి చూపు సారించాడు

''గుడ్‌మార్నింగ్ డాక్టర్, హిహిహి'' అంటూ పాలిపోయిన ముఖాల్లోకి అతిప్రయత్నంతో నవ్వు తెప్పించుకుంటూ 'విష్' చేసి, ఆచారవతో డాక్టరుగారిముందుకు త్రోసుకు పోబోయారు— ప్రతినెలా డాక్టరుగారి ఖాతాలిస్టులోనున్న రోగులు కొందరు రీవిగా కళ్లజోడు తగిలించు కుంటూ, 'మార్నింగ్' అని ముక్తసరిగా సమా ధానం విసిరేసి మళ్లీ తెరలోకి దూసుకుపోయాడు డాక్టరు ముందుకొరుకబోయిన రోగులు ఏమీ ఎరగనట్టు మళ్లీ నీరసంగా వెనక్కి తగ్గారు. మరో క్షణంలో కాంపౌండరు మళ్లీ వరండాలోకి ప్రవేశించి గుమ్మందగ్గర నిలుచుని నోరు మెదప కుండా, చూపుడువ్రేలుతో రోగుల్ని ఒక్కొ క్కర్నే లేవదీసి డాక్టరుగదిలోకి ప్రవేశపెట్టడం మొదలెట్టాడు లోనికెళ్లిన రోగులు తాము తెచ్చుకున్న సీసాలని రంగునీళ్లతో నింపుకొని, గుండెల్ని తేలికపరుచుకుని వెళ్లిపోతున్నారు

''మీ కింకా ఈ ఘోరనిరీక్షణనించి విముక్తి దొరకలేదా, రోగిశిఖామణులారా'' అని పరిహ సిస్తూ ఖంగుమని తొమ్మిదిగంటలు కొట్టింది గోడగడియారం రమణ గుమ్మానికేసి చూస్తూ అలాగే కూర్చొనున్నాడు ఉన్నట్టుండి కమల చంక నున్న పదినెలల పసికందు 'కావ్' మని ఏడుపు లంకించుకున్నాడు అందరికళ్లూ కమలవైపు తిరిగినయ్ అసలే సిగ్గుతో సతమత మవుతూన్న కమలకు, చంటిపిల్లాడు మరింత అవస్థ తెచ్చి పెట్టాడు పిల్లాడిని ప్రక్కనే నిలుచోనున్న ముస లావిడచేతికిచ్చి, చేతి సంచీలో తీసుకొచ్చిన 'బిస్కెట్టు' ముక్కల్ని తీసి కమల, ఇస్తేగాని వాడి ఏడుపు ఆగలేదు మళ్లీ పిల్లాడు కమల చేతుల్లోకి మారాడు ఇంతలో కాంపౌండరు చూపుడువ్రేలు రమణవైపు మ్రొగ్గింది. రమణ వెంటనే లేచి రెండడుగులు ముందుకువేసి కాంపౌండరుకు కమలను చూపిస్తూ ''పాపం ఆమె బిడ్డనెత్తుకుని చాలసేపట్నించీ నిలుచో నుంది ఇప్పుడు ఆమెను పంపించు నేను తరు వాత వెళ్తాను'' అన్నాడు కాంపౌండరు నోరు కదపకుండ వెంటనే కమలను రమ్మని సైగ చేశాడు ముసలావిడ వెంటరాగా, కమల బిడ్డ నెత్తుకుని లోనికెళ్లుతూ మళ్లీ యథాస్థానంలో ఆసీనుడైయున్న రమణకు ఓరచూపుతో తన ధన్యవాదాలను తెలిపింది కాస్సేపటిలో కమల మందుపుచ్చుకుని వెళ్లిపోయింది రమణవంతు కూడ అయిపోయింది

ఇంటి కెళ్లుతున్నప్పుడు దారిలో ముసలావిడ ''అమ్మాయ్, ఏవిటో ఆ అబ్బాయి పుణ్యమా అని యిప్పటికైనా పని తెమిలింది లేకుంటే యింకెంత సేపు అక్కడే పడిగాపులు పడాల్సొచ్చేదో ఎవరే ఆ అబ్బాయి నే నిదివరకెప్పుడో చూసినట్టుంది'' అని అడిగింది కమల ఉత్సాహంతో 'అత నెవరో తెలీదా బామ్మా మన వీధి చివర బట్టల షాపు

## 'దయచేసి'

చైనా దేశంలో నేరస్థుల శిర చ్ఛేదనకోసం 'లిన్' అనే అతన్ని నియమించారు. ఇతను చాలా నేర్పరి. కళ్లకు గంతలు కట్టి అతి చాకచక్యంగా తలను కొట్టేసేవాడు. ఒకరోజు ఒక నేరస్థుడు కొంతసేపు కాచు కుని—''ఓలిన్! ఇంకా ఆలస్యం ఎందుకూ? ఆ పని ఏదో త్వరగా కానీయి! అన్నాడు.

లిన్ చిఱునవ్వుతో సమా ధాన మిచ్చాడు. ''అయ్యా' దయచేసి తలను ఒక్కసారి ఆడించండి!''






## ఆశ్చర్యం–ఆనందం

లేదూ దాని ప్రక్కనున్న రెండంతస్థుల మేడలో ఉంటున్నాడు చాల మంచివాడు బామ్మా" అని, ఆఖరు వాక్యం ఎందుకు చెప్పానా అని నాలుక్కరుచుకుంది ముసలావిడ తొణకకుండ "ఆ మంచివాడే. మనం ఎవరైందీ తెలుసుగాబోలు" అంది. ఆ వాక్యం విని మనస్సులో "నిజమే" ననుకుని ఉప్పొంగిపోయింది కమల

* * *

ఆరోజు ఆదివారం కమల, సాయంత్రం ఆరు గంటలకల్లా వంటపని తెమిల్చి, చంటిపిల్లాడికి వేళప్రకారం మందు ఇవ్వమని బామ్మకు అప్పజెప్పి, చక్కగా ముస్తాబై ప్రక్కింటి సుజాతతో "దీపక్"లో సినిమా చూడటాని కెళ్ళింది

ఆట పూర్తయిం తరువాత జనం చీమల బారుల్లా హాలు బయటపడి ఇంటిముఖం పట్టారు కమల, సుజాతా సినిమాలోని హాస్యసన్నివేశాలను నెమర వేసుకుంటూ, వాటికి తమ సొంత వ్యాఖ్యానాన్ని జోడించి కడుపుబ్బ నవ్వుతూ నడుస్తున్నారు కాస్సేపటికి వాళ్ళసంభాషణ, సినిమానించి, చీరెల రంగుల మీదికీ, ఫాషన్లమీదికీ దాటు వేసింది తమతోబాటు సినిమాకి హాజరయిన యితర సీతాకోకచిలుకలమీది రంగులతోటి తమ చీరెల రంగులను పోల్చుకోవటం మొదలెట్టారు కమల చూపు, వాళ్ళ ముందు ఓ ఇరవై గజాల దూరంలో నడుస్తూన్న అమ్మాయి చీరెమీద పడింది వెంటనే సుజాతా, చూడూ ఆ తెల్లటి చీరెకీ, మామిడి పిందె రంగు చోళీకి ఎంత చక్కగా పొందిక కుదిరిందో" అంది

"ఆ కాంబినేషన్ సాధారణంగానే ఉంది గానీ వాటిని కట్టుకున్న అమ్మాయి చక్కగా ఉంది అందువల్లే ఆ చీరెకీ, చోళీకీ మా రమ్యంగా పొందిక కుదిరింది" అంది సుజాత

కమలలో స్త్రీసహజమైన ఈర్ష్య పుట్టుకొచ్చింది, సుజాత ఆ అమ్మాయి సౌందర్యాన్ని పొగడుతున్నందుకు ఆ అమ్మాయితో సరితూగలేనా అని ఊహించుకుని, తన చీరెకుచ్చెళ్ళనూ, పమిటనూ సర్దుకుంటూ, నడకలో ఒయ్యారం ఒలకబోస్తూ, పదే పదే ఆ అమ్మాయి వైపు చూసుకుంటోంది హాలు కాంపౌండు దాటిన తరువాత జనం పల్చబడి చీలిపోతున్నారు అయినా కమల, సుజాత ఆ తెల్లటి చీర, మామిడిపిందె రంగు చోళీఅమ్మాయి వెంబడే ఓ యాభై గజాల్లో నడుస్తూ ఆ అమ్మాయి నడకమీద, డ్రస్సుమీద వ్యాఖ్యానిస్తున్నారు ఇంతలో ఆ అమ్మాయి ప్రక్కనే భుజాలు రాసుకుంటూ నడుస్తూన్న యువకుడు, ఎందుకో ఉన్నట్టుండి ఆ అమ్మాయి వీపుమీద ఆప్యాయంగా చరిచి, పగలబడి నవ్వుతూ, ఇతరు లెవరైనా గమనిస్తున్నారేమోనన్న బిడియంతో వెనక్కి తిరిగి చూశాడు

అతను రమణ! కమల తనకళ్ళను తానే నమ్మలేకపోయింది. ఇన్నాళ్ళూ అతను ఒంటరివాడనుకుంది అయినా అత నెంత అదృష్టవంతుడు అంత అందమైన అమ్మాయిని భార్యగా పొందటానికి! అని అనుకుందేగాని ఎందుకో అనని మీద యింతకాలంగా ఉంటున్న అనురాగం ఒక్కసారిగా విరిగిపోయింది. సుజాతకూడా వాళ్ళను చూసి "ఈడూ, జోడూ యిద్దరికీ ఎంత రమ్యంగా కుదిరిందో" అని అంటూంటే కమల మనస్సులో ఆ అమ్మాయిపట్ల అదివరకే అంకురించిన ఈర్ష్య ఒక్కుమ్మడిగా ఉబికి బ్రద్దలై "ఏడిసింది ఇంతకన్నా ఎన్నోరెట్లు మెరుగైన వాళ్ళను ఎప్పుడూ చూడలేదేమిటి ?" అంది చులకనగా

'అలాగని కాదే. నే నేమన్నాను. వాళ్ళిద్దరూ చూడటానికి ముచ్చటగా ఉన్నారని అంతేగా ఇంతకన్నా మంచిజోడు లేదని కాదు అయినా వీళ్ళిద్దరినీ చూసి ఎవరైనా తప్పకుండ మెచ్చుకుంటారు'

"పోవే. ఇప్పుడు వాళ్ళనుగురించి, బాగున్నా లేకపోయినా మనకెందుకు వాదన. ఏమో భార్యాభర్తలు కారేమో, ఇద్దరూ దగ్గరబంధువులై ఉండకూడదా ?"

"ఎల్లాగే ఎంత దగ్గర బంధువులైనా, నడివీధిలో ఇం త చ న వు గా ఒకర్నొకరు రాసుకుంటూ, నవ్వుకుంటూ నడుస్తారా నిస్సందేహంగా వాళ్ళు భార్యాభర్తలే" అంది సుజాత పందెం అన్నట్టు

రమణా, ఆ అమ్మాయీ భార్యాభర్తలు కారన్న తన ఊహను సుజాత బలపరుస్తుందనుకుంటే ఆ ఆశ కూడ అడుగంటిపోయింది కమలకు ఇద్దరూ ఏవో విడివిడిగా ఆలోచించుకుంటూ మౌనంగా నడిచి యిళ్ళు చేరుకున్నారు

* * *

ఆరోజు నవరాత్రికొలువులకు ఆఖరు రోజు. రమణ, మరో ఇద్దరు మిత్రులతోటి సినిమాకెళ్ళి, ఆ తరువాత కాస్సేపు హోటలులో బాతాఖానీకొట్టి, బాగా చీకటిపడ్డ తరువాత వాళ్ళిద్దరి దగ్గర సెలవు పుచ్చుకుని సనత్‌నగర్‌లో తన యిల్లు చేరుకోటానికి బస్సు స్టాపువేపు నడుస్తున్నాడు ఇంతలో సనత్‌నగర్ వెళ్ళే బస్సు అల్లంతదూరాన వస్తూండడం చూసి ఒక్క పరుగులో బస్సుస్టాపు చేరుకున్నాడు బస్సు ఆగటంతోటే, అంతసేపూ బుద్ధిగా 'క్యూ' లో నిలుచోనున్న జనం అంతా ఒక్కసారిగా బస్సును చుట్టుముట్టేసి లోపలికెళ్ళటానికి బలప్రయోగం చేస్తున్నారు రమణకూడ ఆ గుంపులో చేరాడు. అదృష్టవశాత్తు తను బస్సులోనికి అడుగెట్టిం తరువాత, మిగతా జనాన్నంతా ఇక ఖాళీలేదని కండక్టరు వెనక్కి నెట్టేసి బస్సును కదిలించాడు బస్సుపెద్దగా రొదచేస్తూ హుస్సేన్‌సాగర్ రోడ్డువెంట గంభీరంగా పోతోంది బస్సులో క్రిక్కిరిసి నిలుచోనున్న జనం అటూయిటూ సర్దుకుంటున్నారు కాస్త విశాలంగా నిలబడటానికి ఇంతలో రమణకళ్ళు బస్సులో ఆఖరువరుసలో కూర్చోనున్న కమలమీద పడ్డాయ్ కమల కూడ క్షణంపాటు రమణకేసి చూసి, ఏదో పరధ్యాన్నంగా ఉంటున్నట్టు చూపును కిటికీద్వారా బయటకు సారించింది రమణకుకూడ ఇప్పుడు కమలను మళ్ళీ చూడాలనే ఆసక్తి లేదు. ఏమీ గమనించనట్టు ఉండిపోయాడు.

కండక్టరు రమణదగ్గరికి కొచ్చాడు "ఎక్కడికి సార్ ?"

"సనత్‌నగర్" అని రమణ పర్సుతీసి ఓ ఐదురూపాయల నోటు బయటికి లాగాడు అది చూసి కండక్టరు వెంటనే తనచేతిలో ఆపాటికే చేరిన రూపాయనోట్లను చూపించి "చిల్లరుంటే ఇవ్వండి లేకుంటే దిగిపొండి" అని బెదిరిస్తున్నట్టు చూశాడు

"చిల్లర లేదు" రమణ పర్సు గాలించి చెప్పాడు.

"హోల్డాన్"

బస్సు ఆగింది రమణ బిక్కమొహంపెట్టి దిగిపోతున్నాడు ఇంతలో ఆఖరు వరుసలోంచి "కండక్టర్, నే నిస్తాను చిల్లర" అని ఓ మృదువైన కంఠం విన్పించింది ఆఖరిమెట్టులో ఉన్న రమణ వెనక్కు తిరిగి కమలను చూసి వెంటనే చిరునవ్వు తెచ్చుకుని "చాల తేంక్సండీ" అంటూ మళ్లీ లోపల కొచ్చాడు బస్సు మళ్లీ కదిలింది కమల కండక్టరుకి చిల్లర అందిస్తూంటే, కండక్టరులో సహా బస్సులోని జనం అంతా "ఏమిటో వీళ్లిద్దరిమధ్యా సంబంధం" అన్నట్టు అదోలా వాళ్లిద్దరివైపూ చూశారు రమణ బస్సులో నిలబడి ఉన్నంతసేపు కిటికీలోంచి బయటికి చూస్తూ "బస్సు దిగిన వెంటనే ఆమెను ఎలా పలుకరించాలి ? ఏమేం మాట్లాడాలి ?" అని ఆలోచించుకుంటున్నాడు కాస్సేపటికి బస్సు మరికొందరితో సహా కమలనూ, రమణనూ సనత్‌నగర్ స్టాపులో దిగబెట్టింది

ఇద్దరూ ఒకరొకరికర వాలుచూపులు చూసుకుంటూ ఓ యాభై గజాల దూరం నడిచారు మాట, పలుకు లేకుండా

కాస్సేపటికి "చాల తేంక్సండీ మీకు" అని కాస్త జంకుతూనే అన్నాడు రమణ

"ఓ, ఫరవాలేదు లెండి" కమల వినయంగా అంది

"మీరు చిల్లర ఇవ్వకుండుంటే నన్ను నడిదారిలోనే దింపేసేవాడు ఈ సిటీ బస్సు సర్వీసులో మళ్లీ బస్సు దొరికేవరకూ నిజంలేదు ఏమంటారు"

"ఆఁ" అంది ముక్తసరిగా కమల

తరువాత సంభాషణ కుంటుపడింది మౌనంగా దిక్కులు చూసుకుంటూ మునిసిపల్ దీపపు కాంతిలో ఇంటివైపు నడుస్తున్నారిద్దరూ రోడ్డు పేవుమెంటు నిర్మానుష్యంగా ఉంది ఆమె అడగకుండానే అంత ఉపకారం చేసినందుకు ఆమెతో అలా ఏమీ మాట్లాడకుండా నడవడం అట్టే సవ్యంగా లేదనుకున్నాడు రమణ అయితే ఆమెను మళ్లీ ఏమడగాలో తోచిందికాదు కాస్సేపు తటపటాయించి,

"ఏవండీ, ఎక్కడినించి యింత పొద్దుబోయి వస్తున్నారు సినిమానించా ?" అని అడిగాడు రమణ

"లేదండీ, మా స్నేహితురాలింటికి. బొమ్మల కొలువు చూట్టానికి వెళ్లాను"

"మీ రొక్కరేనా ?"

"అంటే ?"

"అహ మీ అబ్బాయిని తీసుకురాలేదా అని"

"నాకు పెళ్లి కాలేదండీ" అంది కమల సిగ్గుపడిపోతూ రమణకు ఆ సమాధానం వినటంతోటే క్షణంసేపు ఆశ్చర్యంకలిగి అది వెంటనే ఆనందంగా మారింది

"అయితే ఆరోజు డాక్టరుయింట్లో మీ చేతుల్లో ఉన్న అబ్బాయి . "

"నా తమ్ముడు వాడు పుట్టిన వారం రోజులకల్లా మా అమ్మ చనిపోయింది"

"ప్చ్, ప్చ్ అల్లాగా"

మళ్లీ కొంతసేపు నిశ్శబ్దం

"మీ రెక్కడ నుంచి తె—లు—సు—కో—వ—చ్చా" కమల అడిగింది

"సినిమా కెళ్లాను"

"ఒక్కరే ?"

"లేదు మా స్నేహితులతో కలిసి వెళ్లాను"

"అహ మీ ఆవిడను తీసుకురాలేదా ?"

రమణ ఆ ప్రశ్నకు బిత్తరపోయి "మా ఆవిడెవరు నాకు కూడా పెళ్లికాలేదండోయ్" అన్నాడు

కమల క్షణంపాటు ఆశ్చర్యపోయి, దాన్ని ఆనందంగా మార్చుకుంటూ "నిజమా" అని అడిగింది మందహాసంతో

"తప్పకుండ .... మీ కా అనుమానం ఎలా కలిగిందీ ?"

"క్రిందటి ఆదివారం "దీపక్" టాకీసులోంచి బయటి కొస్తూంటే మీతోటి ఓ అమ్మాయిని చూశాను "

రమణ కాస్సేపు నిలబడి, గుర్తు తెచ్చుకుని "ఓ, అదా, అది మా పెద్దనాన్నగారి కూతురు రాధ ఇక్కడే హాస్టలులో ఉంటూ కాలేజీలో చదువుకుంటోంది అప్పుడప్పుడూ మా యింటి కొస్తూంటుంది" అని పకపక నవ్వాడు అతని నవ్వుతోపాటు కమల కూడా తృప్తిగా శృతి కలిపింది ఇద్దరి మనస్సుల్లోని అనుమానాలూ, అపార్థాలూ ఒక్కసారిగా విడిపోయినందుకు ఉల్లాసంతో గంతులువేశాయి వాళ్లిద్దరి మనస్సులూ. కాస్సేపు విడివిడిగా ఏదో తియ్యగా ఆలోచించుకుంటూ యిద్దరూ నడిచారు

"మీ పేరు తెలుసుకోవచ్చా, అభ్యంతరం లేకపోతే" రమణ అడిగాడు

"కమల మీ పేరూ"

"రమణ"

మళ్లీ ఇద్దరూ మవునందాల్చి ఏదో ఆనందంగా ఆలోచించుకుంటూ క్రీగంటి చూపులు విసురుకుంటూ, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ నడుస్తూండగా రమణయిల్లు వచ్చేసింది

"వస్తాను కమలా" అని చాల పరిచయమున్నట్టు ఏకవచనప్రయోగం చేశాడు రమణ

"మంచిదండీ" అని అతనివేపు చిలిపిగా చూసి నవ్వుతూ ముందుకు సాగిపోయింది కమల. ★

# పిల్ల మొదలు

## పెద్ద వరకూ కుటుంబములో అందరూ చెప్పేది వినండి...

వాటర్‌బరీస్ కాంపౌండ్ యొక్క పేరుగాంచిన ఔషధముల కలయిక యిప్పుడు ఆరోగ్యము చేకూర్చే విటమినులు చేర్చబడి యింకా శక్తివంతము చేయబడినది అందువలన ఇది యిప్పుడు కుటుంబములో అందరికీ పూర్తియైన టానిక్ అయినది ఇది పిల్లలకు ఎంతో మంచిది–స్నాయువులు గట్టి అగుటకు మరియు మళ్లీ పెరుగుటకు యిది కావలసిన ఆహారము అందచేస్తుంది దిట్టమైన ఎముకలు మరియు పళ్లువచ్చేలా చేస్తుంది పనిచేసే పెద్దవారికి వారు కోల్పోయిన శక్తిని మరియు చురుకుదనమును తిరిగి యిస్తుంది మరియు నరములను బలపరుస్తుంది ముసలివారికి వారి బలహీనమైన కండరములను బాగుచేయుటలో, పోయిన ఆకలిని మరల కలిగించుటలో మరియు రక్తమును వృద్ధిచేయుటలో పనిచేస్తుంది జబ్బుపడి లేచిన వారిని త్వరలో ఆరోగ్యమును కోలుకొనేలా చేస్తుంది. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ చిన్నా పెదా అందరికీ బాగుగా గుణము కలిగిస్తుంది



అ త్తా
తా తా
అమ్ !



మా అమ్మ మాకు వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ యిచ్చుట ప్రారంభించిన తరువాత మేము ఒక్క రోజు కూడా జబ్బుపడలేదు



వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండు కారణముగా ఆరోగ్యవంతమైన, చురుకైన జీవనమునకు కావలసిన శక్తి అంతయు మాకు లభిస్తోంది



వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ ఆకలిని వృద్ధిచేస్తుంది ఎంతో ముఖ్యమైన విటమినులను అందచేస్తుంది మరియు జీర్ణము అగుటలో సహకరిస్తుంది.

# వాటర్‌బరీస్

విటమిన్

# కాంపౌండ్

మీకు శక్తి ఉత్సాహముల నిచ్చును

పిల్‌ఫర్-ప్రూఫ్
కేసరి రంగుగల మూత ఉన్నదా అని చూడండి




కేసరి రంగు లేబిలు ఉన్నదా అని చూడండి



ఈ రకముది కూడ లభిస్తోంది: క్రియోసోట్ మరియు గ్లైకారల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్‌గల సీసాలో కూడ లభించుచున్నది ఇది దగ్గుజబ్బులకు ఉత్తమమైన టానిక్

వార్నర్ లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ
(పరిమితమైన బాధ్యతతో యు ఎస్ ఎ లో స్థాపింపబడినది)

[WVC 161]

# నాలుక: శబ్దోచ్చారణ

ప్రాతఃకాలం. సూర్యోదయ మవుతూ ఉంటుంది. ఆకాశం అరుణరాగ శోభితమై పోతుంది. అప్పుడే కొలిమిలోనించి తీసిన లోహగోళంలాగా సూర్యబింబం గగన భూమధ్యరేఖను దాటి, ఉద్గమిస్తూ ఉంటుంది. ఆ సుందరదృశ్యం చూచి "ఎంత బాగుంది ?" అని అనుకోనివారూ, "ప్రక్కన ఎవరయినా ఉంటే "ఎంత బాగుందో చూడు" అని అననివారూ సాధారణంగా ఉండరు. మన అనుభూతులను, మన భావాలనూ, తదితర మానసికవిన్యాసాలను, ఇతరులకు వెల్లడించాలనే కోరిక, ఇతరులతో పంచుకోవాలనే నాంఘ వాటికొక శాశ్వతస్వరూపం యివ్వాలనే ఆశ మానవులకందరికీ విశిష్టములయిన విషయములు. ఏ కోరికా లేక, ఏ అనుభూతినీ ఆశించక, ఏ ఇతర ప్రాణి సాంగత్యాన్నీ, సానుభూతినీ వాంఛించక వేళకు దొరికింది తిని, తిననప్పుడు నిద్రపోయి, జీవితంగడిపే మనుషులు లేకపోలేదు. కాని వారు చాలా అరుదు. వారైనా, అన్నం కావాలని అడగడానికీ నిద్ర వస్తోందని చెప్పడానికీ, మాటలు కావాలి. "నీమీద నాకు యిష్టం" మనో, "నీవు చేసింది నాకు నచ్చలేద" నో వ్రాయకుండా అధునిక జీవితం సాగదు. ఈ నాయకుడి చర్యలు హేయమైనవనో, ప్రజాక్షేమానికి విరుద్ధమనో, ఈ శాసనం రాక్షసమనో వక్తలు ఉపన్యసించక తప్పదు. సూర్యోదయాన్ని చిన్న మాటలలోనూ వర్ణించవచ్చు. లేక ఆ భావసౌందర్యరమణిని అతి మంజుల శబ్దాభరణాలతో అలంకరించి, వివిధ రసాలంకారాలతో విన్యసింపచేయ వచ్చును. ఇదంతా ఎల్లా సాధ్యమవుతున్నది ? మాటలవల్లనే గదా ! కొన్నిశబ్దములను ఒక క్రమంలో ఉచ్చరించినప్పుడు 'మాట' ఏర్పడుతున్నది. ఆ మాటలను కొన్ని సూత్రముల ప్రకారం కలిసి ఉచ్చరించినప్పుడు వాక్యములు ఏర్పడుతున్నవి. ఆ ఉచ్చరించడంలోనే కొన్ని కంఠవిన్యాసముల వల్ల, హేళన ఆశ్చర్యం, ఉద్వాటన ఇల్లా ఎన్నో రకములుగా వాక్యార్థం మారిపోతున్నది. శబ్దములకు లేఖ్యమయిన స్వరూపం కల్పించినప్పుడు అక్షరములు, లిపి ఏర్పడు తున్నవి. లిపి ఏర్పడగానే మాటలు, వాక్యములు, లేఖ్యములుగా భేదం చెందుతున్నవి. నోటితో ఉచ్చరించదగినవి, చేతితో వ్రాయదగినవీ అయిన మాటలసముదాయమే భాష.

భాష—మనం సంభావించి ఉపయోగించుకునే భాష—కేవలం మానవజాతికి మాత్రమే విశిష్టమైనది. "అంబా" అని దూడని పిలిచే ఆవుభాష "అంబా" అనడంతో ఆరంభించి ఆ మాటతోనే అంతం అవుతుంది. కాని మానవుడి భాషకు ఆదివున్నదే గాని అంతం లేదు. ఏమనిషికి ఎన్ని మాటలు వస్తవి, రావాలి, అన్నవిషయం నిర్ణయించడానికి ఏ ఆధారమూ లేదు. కాని ప్రతి మనిషీ — అఖరికి ఆటవికమనుష్యులయినా సరే —ఏవో మాటలు నేర్చుకోక తప్పదు. మాటలు లేకపోతే మానవసంబంధాలూ లేవు—సంఘజీవితమూ లేదు. అంతర్జాతీయ సంబంధములూ ఉండవు. 'ఏమనిషికి ఎన్నిమాటలు వచ్చును. ఆ మాటలను ఏ అర్థంతో, ఎంత శ్రవణపేయంగా, శక్తివంతంగా, నచ్చజెప్పేలాగా వాడుకోగలడు అన్న దానిమీదనే అతని [illegible], సంఘం[illegible] సాటి




మానవులలో అతనికి ఉండే పలుకుబడీ, స్థానమూ వారినుండి అతను పొందే సుఖము, లాభము, కష్టము ఆధారపడి ఉంటవి. 'మాటలచేత భూపతులు మన్ననలిచ్చి సుఖమ్ము లిత్తురున్, మాటల చేత కామినులు మన్ననలిచ్చి సుఖమ్ము లిత్తురున్' అని ఒకపద్యం ప్రచారంలో ఉంది.

ఆరునెలలు రాగానే పసిశిశువు కంఠగతము లయిన, ఏకమాత్ర శబ్దాశబ్దములతో తల్లికీ, తనకు సన్నిహితులయిన యితరులకూ, తన అనుభూతులు తెలియజేస్తుంది. ఏదయినా చూపించాలంటే "ఊ!" అని వేలుతో ఆ వస్తువును చూపిస్తుంది. సంవత్సరం వచ్చేటప్పటికి 'అమ్మ' 'నాన్న', 'అత్త', 'తాత' అనే రెండక్షరముల మాటలు నేర్చుకుంటుంది. అమ్మ, నాన్న అన్న తరవాత, అత్త, తాత అంటుంది. కాని అమ్మమ్మా తాతయ్యా అనదు. రెండు సంవత్సరములు వచ్చే సరికి నిత్యజీవితంలో సన్నిహిత ప్రపంచంలో ఉన్న వస్తువుల పేర్లూ, అనుభూతులపేర్లూ బిడ్డకు వస్తవి. ఆయా శబ్దముల స్వరూపం, తల్లిదండ్రులు పరిసరములలో ఉండే ఇతరులు, ఉచ్చరించే విధానాన్నిబట్టి నిబంధించబడి ఒకేమాదిరిగా ఉంటుంది. ఏవో జన్మలోపములు, అంతర్గతము లయిన శారీరక, మానసిక వ్యాధులు, ఉన్నప్పుడు తప్ప బిడ్డ రెండు సంవత్సరములు దాటినా మాటలాడకపోవడం అంటూ ఉండదు. కనీసం ముద్దుగా నయినా అన్నిమాటలూ వస్తవి. రాకపోతే తల్లిదండ్రులు ఖంగారుపడి డాక్టరుదగ్గిరకు పరిగెత్తుతారు.

'ఎక్కడున్నాడు!' అనడానికి బదులుగా, పసిబిడ్డ 'ఎక్కలున్నాలు'అంటే కొంతకాలంవరకు ముద్దుగానే వుంటుంది. కాని నాలుగేళ్ళయినా అల్లాగే అంటే ఆందోళనకు కారణమవుతుంది. కొన్ని మాటల్లో 'ద'పలకడానికి బదులుగా 'డ' పలికితే అశ్లీలం ధ్వనిస్తుంది. పసిబిడ్డమీద కూడ కోపంవస్తుంది. ఈ పొరపాట్లు పసిబిడ్డలలోనేకాదు. పెద్దవాళ్ళలోనూ అప్పుడప్పుడు జరుగుతూ ఉంటవి. ఒక మాట అనబోయి మరొకమాట అనడం తరుచు జరుగుతూ ఉంటుంది. అందువల్ల చాలా నష్టములు కలుగుతవి కూడా. ఒకమాటు ఒక సినిమా షూటింగులో ఒక తార, "అడుగో హంతకుడు" అనటానికి బదులు 'హడుగో అంతకుడు" అన్నది. ఆ షాటు ఎన్నిమాట్లు తీసినా అల్లానే అన్నది. రిహార్సలులో సరిగా అనేది. కాని లైట్లువేసి, ఏక్షన్‌లోకివచ్చి డైరెక్టర్ 'షూట్' అనగానే 'హడుగో అంతకుడు' అనేది. ఇట్లా తెల్లవారిపోయింది. కొన్ని వందలు నష్టమైంది. ఇంట్లో గంగాప్రవాహంలాగా ఉపన్యాసము లిచ్చేవారు, సభలో గజ గజలాడిపోతారు. వంటయింట్లో పడి ఉండే భార్యలమీద గంయ్ గంయ్‌లాడే భర్తలు, అధికారులముందు నోరు పెగలక, గడగడలాడి, నత్తి కూడా తెచ్చుకుంటారు.

ఒకప్పుడు పెళ్ళిచూపులకు వెళ్ళినప్పుడు బాగా మాట్లాడిన పెళ్ళికొడుకు, బాగా చదువుకున్న పెళ్ళికూతుర్ని చూడ్డానికివచ్చి, బెదిరి, 'మీపేరేమిటి', అనడానికి, 'మీ...మీ...మీ పేరేమిటి" అన్నాడు. ఆపిల్లాడికి నత్తి అని పెళ్ళికూతురు, ఆ సంబంధం తెచ్చిన అన్నగారిని రక రకాలుగా నిరశించింది. అతను ఖిన్నుడై అతని హోటలుకు వెళ్లి మాట్లాడేడు. అక్కడ ఆ కుర్రాడు చక్కగా మాట్లాడేడు. అన్నగారి మనస్సు పరిపరివిధాల పోయింది. పిల్లమీద ఇష్టంలేక నత్తి నటించాడా, లేక ఆనత్తి అప్పుడప్పుడు వచ్చిపోతూ ఉంటుందా అనిపించింది. తనకు స్నేహితుడయిన

# మనమూ-మన దేహస్థితీ

(౯)

డాక్టరుదగ్గరకు వెళ్ళి తన సమస్య వెలిబుచ్చేడూ ఆ డాక్టరు నీ చెల్లెల్ని అతనిమాటలు వినపడేచోట దాచి అతన్ని అక్కడకు ఏదోవిధంగా తీసికెళ్ళి మాట్లాడి చూడు" అని సలహా ఇచ్చేడు పిల్ల పిల్లాడ్ని నచ్చింది పిల్లాడు, అతని చదువు, అందం అమాకి యికి ఘాటుగా నచ్చినవి కాని నత్తిమాత్రమే, ఆటంకమై కూర్చున్నవి సంధానకర్త డాక్టరు యింట్లో యీ ఏర్పాటు చేశాడు కుర్రాడు నత్తి లేకుండా మాట్లాడ్డం పిల్ల విన్నది ఆ సమయంలో ఆనందం పట్టలేక "నన్ను చూస్తేనేనా మీకు నత్తి వచ్చేది" అంటూ ఆ పిల్ల బయటికివచ్చి విరగబడి నవ్వింది ఆశ్చర్యానందాలతో "మిమ్మల్నిచూస్తేభయం వేసింది" అని పెళ్లికొడుకు భయమూ, నత్తి లేకుండా మాట్లాడేడు వాళ్ళు పెళ్లిచేసుకుని ఆనందంగా ఉన్నారు ఇల్లాంటి సంఘటనలెన్నో నిత్య జీవితంలో, అనేకసందర్భాలలో మాటపొరపాటుల వల్ల జరుగుతూ ఉంటవి అప్పుడప్పుడు రోగలక్షణములుగా భావించబడి, వైద్యుడికి సమస్యలవుతూ ఉంటవి

మానవజీవిత మంతా, యింతగా ఆధారపడి ఉన్న ఈ మాటలు, బిడ్డకు ఎల్లా వస్తవి వాటి అర్థములూఅర్థ భేదములు బిడ్డకుఎల్లాగో చరిస్తవి? ఆమాటలను ఉచ్చరించడంలో, వాటి అర్థం తెలుసుకోవడంలో, ఏ ఏ అవయవములు పాల్గొంటవి? వాటిలో, జన్మతఃగాని రోగఫలితంగాగానీ ఏ ఏ మార్పులు జరిగినప్పుడు మాట్లాడ్డం ఏవిధంగా లోపభూయిష్టమవుతుంది?" అన్న ప్రశ్నల చాలా క్లిష్టసమస్యలు శరీర కార్యక్రమమంతా ఆశ్చర్యకరమైనదే కాని అన్నింటిలోకీ మాటలాడడం, అందుకుకారణభూతములయిన అవయవముల నిర్మితీ ధర్మమూ, పరమాశ్చర్యకరమైనది. వాటిని అర్థం చేసుకోడం చాలా కష్టసాధ్యమైన విషయం అది అనంతమూ, అగాధమూ అయిన విషయం భగవచ్ఛక్తి ప్రథమ స్వరూపము శబ్దస్వరూపమేనని కొందరి విశ్వాసం శబ్దబ్రహ్మ, నాదబ్రహ్మ అనే పదములు అందువల్లనే పుట్టినవి

నాలుక లేకపోతే మాటలురావు కాని మాటల, రావడానికి ఒక్క నాలుకమాత్రమే కారణంకాదు. ఎక్కడో పుట్టిన శబ్దాన్ని నాలుక రకరకములుగా మార్చడానికిమాత్రమే సహకరిస్తుంది శబ్దం కంఠంలోఉన్న 'లేరింగ్సు' (Larynx— శబ్ద పేటిక)లో ఏర్పడుతుంది లేరింగ్సులో శబ్దం పుట్టడానికి ఊపిరితిత్తులలోనుంచి గాలి రావాలి ఆ శబ్దం వినడానికి చెవులు కావాలి విని, అర్థం చేసుకుంటానికి మెదడుకావాలి వ్రాయడానికి, ఇతరుల వ్రాసిన దానిని చూడడానికి కళ్లు కావాలి ఇదంతా సంక్లిష్టమైన కార్యక్రమము ఈ అవయవముల నన్నింటిని గురించి సూక్ష్మంగానయినా తెలుసుకుంటేనేగాని మాట్లాడడమును గురించీ, ఆ సందర్భంలోఉండే లోపములను గురించీ, వాటి నివారణను గురించీ తెలుసుకోడం సాధ్యంకాదు ఆ విషయం వచ్చే వారం చర్చిస్తాను





చిగురాకులలో చిలకమ్మ.




సుబ్బారావు చచ్చిపోయాడు.

అతని తండ్రి సూర్యనారాయణశర్మగారు అంత్య క్రియలన్నీ యధావిధిగా జరిపించాడు పోయింది చెట్టంత కొడుకు. నెల నెలా దొసెడు రూపాయిలు తెచ్చి తనచేతుల్లో పోస్తున్నవాడు. అయినా ఆయన ముఖంలో ఏమాత్రం వేదన గోచరించలేదు ఏదో మామూలు క్రతువు చేస్తున్నట్లుగా నిర్లిప్తంగా చేసివేశాడు

అంతా ముగిసి ఆప్తబంధువు లంతా వెళ్లిపోయిన తర్వాత ఒక్కరోజు ఆగి కోడల్ని పిలిచాడాయన.

సుందరివచ్చి తలుపంచుకు నిలబడింది.

"నీతో ఒక్కమాట చెప్పాలమ్మా"

"చెప్పండి"

"మీ ఆయన తాలూకు డబ్బు ఈ అంత్యక్రియలకి ఖర్చయిందిపోను నాలుగువేల ఆరువందలున్నాయి ఆ డబ్బు ఇక నీదీ నీ పిల్లలదీని నువ్విక్కడే ఉంటే ఆ డబ్బు బ్యాంకులోవేసి నీ కూతురు పెళ్లికి కొడుకు చదువుకీ ఖర్చు పెడతాను లేదు పుట్టింటికి వెళ్ళిపోతానంటావా నీకు ఇచ్చేస్తాను నిన్ను అట్టే పెట్టుకోవటం నాకేమీ భారంకాదు. చెప్పటం మంచిది గనక చెబుతున్నాను"

"మీ ఇష్టం!" అన్నది సుందరి కళ్ళు ఒత్తుకుంటూ

"అలాంటి ముసుగులో గుద్దులాటలు నాకు పనికిరావు నువ్వువున్నా నాకిష్టమే. లేకపోయినా వా

కిష్టమే నీకూ అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్లూ బోలెడంత బలగం వున్నారు. వాళ్లతో సంప్రదించాల్సి వుంటే సంప్రదించు. నాలుగయిదు రోజుల్లో ఏ సంగతీ చెబితే నే మిగతా ఏర్పాట్లు చూసుకుంటాను" అన్నాడాయన.

"అలాగే" అన్నది సుందరి.

ఆ సాయంత్రందాకా ఆమె ఆ సంగతే ఆలోచించ సాగింది. మామగారి అభిప్రాయం స్పష్టమే కాని ఎవరి దగ్గరకువెళ్లేట్లు? సుశీ పెద్దదవుతోంది దానికి పెళ్లి చెయ్యాలి. సూర్యం చదువింకా బోలెడుంది. వీటన్నిటికీ డబ్బు కావాలి. ఎవరిస్తారంత డబ్బు? నాలుగువేల ఆరువందలు ఏ మూలకొస్తాయి?

ఆయనే బతికుంటే మామగారి ఆస్తిలో వాటా తీసుకునేవారుకాదా? ఆ వాటా తన కివ్వకూడదూ? ఆయ నివ్వడు తనకు తెలుసు అయినా ఆయన్నను కుని ప్రయోజనం ఏముంది? చచ్చిపోయినాయన్ని అనాలి వేరుగా వుందామంటే వున్నదేదో పెట్టుకు తిందాం అంటే వినిపించుకున్నాడుకాదు తండ్రి మీద ప్రేమ వదులుకోలేకపోయానన్నాడు ఇప్పుడేమయింది? ఆయన అంత్య .

ఆమె కళ్లవెంట నీరు జలజలా రాలింది

ఎవరో వస్తున్న అలికిడి అయి, ఆమె తలెత్తి చూసింది మరిది సత్యం వస్తున్నాడు

"అలా ఉన్నావేమమ్మా?" అన్నాడతను కూర్చుంటూ.

ఆ వదినా మరదుల మధ్య అరమరికలు లేవు పొద్దున్న మామగారు అన్న మాటలన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది సుందరి సత్యం ఆమెమీద ఎంతో సానుభూతితో మాట్లాడాడు. నాలుగువేల ఆరువందలు సేవింగ్సుకదా,ఇన్సూరెన్సు ఆరువేలూ ఏమయినట్లు అన్నాడు

"ఏమో సత్యం! నేను ఆడదానిని చదువుకున్న దాన్నికాదు. నాకివన్నీ ఏం తెలుస్తాయి?" అన్నది సుందరి.

"అలాగని నీ హక్కు వదులుకుంటావా? మీ అన్నయ్య వున్నాడుగదా? ఆయనతో పోయి చెప్పు. ఈయన అంతుతేల్చకపోడు" అన్నాడు సత్యం.

నిజమేననిపించింది సుందరికి.

"ఏళ్ళు ఎగసనా బుద్ధిదిగసనా అని ముసలాయనకి రోజు రోజుకీ డబ్బుకాపీనం ఎక్కువవుతోంది. ఏంచేసుకుంటాడో ఇదంతా?" అన్నాడు సత్యం.

"మన కెందుకులే నాయనా? వూరుకో" అన్నది సుందరి

ఆ మరునాడు సుందరి అన్నగారింటికి వెళ్ళింది. ఆంజనేయులుగారు ఆరోజు ఆఫీసుసెలవుకావటం మూలాన వరండాలో కూర్చుని పేపరు చూసుకుంటున్నాడు. చెల్లెల్నిచూసి "రావే" అన్నాడు. సుందరివెళ్ళి "వదినింట్లోవుందా అన్నయ్యా?" అన్నది.

"పెరట్లో వుంది. వెళ్ళు" అన్నాడాయన

సుందరి పెరట్లోకి వెళ్ళింది. శారదాంబ దొడ్డి

గోడ దగ్గరనుంచుని అవతలింటివాళ్లతో మాట్లాడుతున్నది కాస్తా అలికిడికి వెనక్కి తిరిగిచూసి అవతలింటివాళ్ళతో సెలవు అని చెప్పి వచ్చి ఆడబిడ్డను పలకరించింది ఇద్దరూవచ్చి హాల్లో కూర్చున్నారు ఆంజనేయులుగారు కూడా అప్పటికి పేపరు ముగించి వచ్చి కూర్చున్నాడు

"ఏమంటున్నాడే మీ మావగారు?" అన్నాడాయన గంభీరంగా

సుందరి క్రితం రోజు జరిగిన గ్రంథం అంతా చెప్పింది. "ఆయనపోయి ఇరవయిరోజులయినా కాలేదు నన్నూ, నా పిల్లల్నీ నా దారి చూసుకో మన్నాడు అక్కడ ఏధంచెడివున్నా మర్యాద దక్కుతుందని నమ్మకం లేదన్నయ్యా!" అన్నదామె చివరికి

"చెట్టుక్రింద ఉంటారో, రోడ్డుమీదే ఉంటారో మీ ఇష్టం. కాని రేపుప్రొద్దున మీ మొహాలు ఈ ఇంట్లో కనపడకూడదు." అని ఆంజనేయులు చెల్లెలిమీద కసిగా అన్నాడు. ఇంతకూ ఆమె నేరం......

అన్నగారింట్లో వుండటం నిశ్చయమయినట్టు మామగారితో చెప్పింది సుందరి ఆయన యధాప్రకారం నిర్లిప్తంగా "సరేనమ్మా! బాంకులోంచి డబ్బు తెప్పించిస్తాను రేపో ఎల్లుండో మంచిరోజు

వెళ్ళి బాంకులోవేసి ఆ రశీదూ చెక్కు పుస్తకమూ చెల్లెలి చేతికిచ్చాడు

రోజులు గడుస్తున్నాయి

ఆంజనేయులు బాగా వున్న కుటుంబంలోంచి



అయినా ఆదేం పోయేకాలం ఆయనకి బతికుంటే వచ్చిన జీతం అంతా పుచ్చుకునేవాడు కదూ? అలాంటి బుద్ధులుండబట్టే చెట్టంత కొడుకూ మట్టిలో కలిసిపోయాడు" అన్నది శారదాంబ కసిగా

"ఇక్కడికి కొచ్చెయ్యి సుందరీ! కలో గంజో తాగి వుందువుగాని ఎలాగూ నాకు పిల్లలులేరు నీ పిల్లలే నా పిల్లలనుకుంటాను" అన్నాడు ఆంజనేయులు గారు

"ఆ డబ్బు సంగతి ఏం చేస్తారు?" అన్నది శారదాంబ

"ఆయన ఇచ్చింది తీసుకుందాం ఇన్సూరెన్సు ఆయనకు దఖలు రాసినట్టున్నాడు బావ దానిమీద మనకొచ్చేదేమీ వుండదు" అన్నాడు ఆంజనేయులు గారు

చూసుకువెళ్దువుగాని" అన్నాడు

సుందరి వూరుకోలేక "ఆయన ఇన్సూరెన్సు వుండాలనుకుంటాను" అన్నది

"అది నా పేర పెట్టాడువాడు" అన్నాడు శర్మ గారు

ఆ ఆశలు వదులుకుంది సుందరి మర్నాడు డబ్బు తెప్పించి ఆంజనేయులుగార్ని రప్పించి సుందరి సంతకంతో ఆంజనేయులు సాక్షి సంతకంతో రశీదు తీసుకుని ఆ డబ్బు సుందరి చేతికిచ్చాడు సూర్యనారాయణశర్మగారు సుశీలకి, రాముడికి చెరో అయిదు రూపాయలూ ఇచ్చి ఏవన్నా కొనుక్కోమన్నాడు ఆయనలోవున్న పీనాసి తనాన్ని మనస్సులోనే అభిశంసించుకున్నారు అంతా

సుందరి అన్నగారింటికివచ్చి కాపురం పెట్టింది ఆంజనేయులుగారు ఆరోజే వెళ్లి డబ్బు తీసుకు

వచ్చినవాడు దర్జాగా బ్రతికినవాడు కాని ఆ రోజులు వెళ్ళిపోయాయి రోజులు గడవటానికి భార్య మెళ్ళో మిగిలిన చివరినగ కూడా కుదువబెట్టలేక అతడు ఏనాడో విలాసార్థం చదివిన చదువుని ఆధారం చేసుకుని చిన్న మెడికల్ కంపెనీలో గుమాస్తాగా జేరాడు ఆ నూట యాభయి రూపాయలూ వారికి చాలేవికావు. పైగా వున్నా లేకపోయినా చదరంగం అనేసరికి అప్పు చేసయినా పందేలు కట్టేవాడు, ఆంజనేయులు అది ఆయన వ్యసనం అందరూ తాను లేనివాడనుకుని పోతారేమోనని బెంగతో అప్పులుచేసి పండగలు జరిపించాడు ఘనంగా

ఆయనకు సుందరి అంటే విపరీతమయిన ఆపేక్ష. ఆమె మావగారు సింగరాజు లింగరాజులాంటివాడు. చచ్చిపోయిన సుబ్బారావు తండ్రి గీచినగీటు దాటక సంపాదనంతా ఆయన చేతుల్లోపోసి ఆయనకింద

# స్వయంకృత

తాబేదారుగా జీవించాడు అది చెల్లెల్ని (తన) అన్యాయం చెయ్యటమేనని భావించాడాయన ఈనాడు దిక్కులేని వాళ్లయిపోవటానికి వీల్లేదు వాళ్ళు తనకువున్నా లేక పోయినా వాళ్లను చేరదీశాడు వాళ్ళ భవిష్యత్తును గురించిన పూర్తి బాధ్యత తీసుకున్నాడు

అయితే మనం రాకూడదు జరగకూడదు అనుకునే వన్నీ వస్తూనే వుంటాయి జరుగుతూనే వుంటాయి అలాగే ఒకరోజు వచ్చింది ఆతగాడి జీవితంలో

చెల్లెలు ఎచ్చాక మొదటి పండుగని అయితే నేమి తనకు పిల్లలు లేనందువల్లనయితేనేమి సుశీ లకూ రాముడికీ వంద రూపాయల్దాకా ఖర్చుపెట్టి బట్టలు కుట్టించాడాయన, సంక్రాంతికి స్కూలు, దూరమయి కుర్రాడు అవస్థపడుతున్నాడని సెకండ్ హేండ్ సైకిలొకటి అమ్మకాని కొస్తే కొనిపెట్టాడు వీటన్నింటికీ ఆయన దగ్గర డబ్బులేదు, కనక అప్పు చేశాడు ఆ అప్పు తీర్చాలి.

ఇదివరకు అయితే ఏవో ఖర్చులు తగ్గించుకుని ఆ అప్పు ఎలాగోసర్దుబాటు చేసుకోగలిగేవాడు ఇప్పుడు ఖర్చు పెరిగింది ప్రతినెలా పిల్లలిద్దరికీ స్కూలు జీతం కట్టాలి రోజూ అణో బేడో వాళ్ల సాదరుకి ఇవ్వాలి పొద్దున్న మధ్యాహ్నం టిఫెన్లు ఇవన్నీ చెయ్యక పోతే సుందరి బాధపడుతుంది అది తనకు పరువు తక్కువ

అందువల్ల సమయానికి ఆదుకుని డబ్బిచ్చిన స్నేహితుడు తన అప్పు తిరిగిచ్చెయ్యమని కోరటంతో ఆంజనేయులుగారు ఆట్టేట్టయ్యారు

ప్రతిచోటా ప్రయత్నించాడు నెలాఖరు ఎవరి దగ్గర ఉంటుంది అంత డబ్బు పైగా తాను ఆ అప్పు వెంటనే తీర్చగలడని గ్యారంటీ ఏముంది? టికాణాలేనివాడికి ఎవరిస్తారు అప్పు

ఆతడి మస్తిష్కం వేడెక్కిపోయింది ఆలోచించగా ఆలోచించగా అతడి కొక్కటే ఆలోచన తోచింది శారదాంబమెళ్లో చంద్రహారంవుంది అది తాకట్టు పెడితే ఈ అవసరం గడవకపోదు ఆ తరువాత తానెలాగో దాన్ని విడిపించుకోలేకపోడు

భార్యతో చెప్పాడు విషయం

ఆమెకు చాలాకాలంనుంచీ భర్త చేస్తున్న ఖర్చు చూస్తుంటే ఇలాంటిదేదో జరుగుతుందనే అనుమానం కలుగుతోంది అది ఇవాళ రూపం దాల్చింది ఇలాగే ఎన్నో నగలు వెళ్ళిపోయాయి వాటితోబాటే ఇదీ కాని

కాని ఆమె స్త్రీ హృదయం తనకు అన్యాయం జరుగుతోందని విలవిల్లాడింది ఆపేక్షలు,అభిమానాలు ఉండవలసిందే కాని అవి ఇంత దారుణంగా పరిణమించే లాగునా? అయితే ఆమాట పైకి అనలేదు తాను ఆమె ఆడబిడ్డ తన ఉద్దేశ్యంపైకి తెలుస్తే ఆయన ఏమనుకుంటారు? ఆడబిడ్డను ఇంట్లోంచి తరమబోయిందని లోకం అనదూ?

అయితే తనకు మిగిలిం దీ ఒక్క హారమూనూ. అదికూడాపోతే తనకుమిగిలేదేమిటి? ఆయన అవసరం తీరటానికి రెండు వందలు చాలు ఆ రెండు వందలూ సుందరినే అడిగితే ?

ఆ విషయం ఆంజనేయులికి తెలిస్తే అతను ఒప్పుకోడు అందువల్ల భర్తతో "సరేలెండి! రేపుగా! తీసుకువెళ్దురుగాని" అని వెళ్ళి రహస్యంగా ఆడబిడ్డ నడిగింది

"అంతా బాంక్‌లో వుంది కదా ఒదినా?" అన్నది సుందరి

"తెప్పించు వదినా! ఆయన ఎంత విల విల్లాడి పోతున్నారో చూస్తున్నావుగా?" అన్నది దీనంగా శారదాంబ

సుందరి నిటారుగా కూర్చుంది "ఒక్కమాట చెబుతాను వింటావా వదినా?" అన్నది

శారదాంబ ఆడబడుచు లాకేత్యం ఇవ్వబోతోందని చూచాయగా గ్రహించింది చేసేదిలేదు గనక "చెప్పు వదినా?" అన్నది

"ఆ డబ్బు మీరు తిరిగి ఎలా తీరుస్తారు?"

చెంపమీద ఛెళ్ళుమని కొట్టినట్లయింది శారదాంబకు. నోట మాటరాలేదామెకు

"కోపం వస్తుందని తెలుసు వదినా? కాని పక్షపాతం లేకుండా ఆలోచించు రెండు వందల రూపాయల అప్పు తీర్చే స్థితిలో వున్నారా మీరు? నాకున్నదీ ఈ కాస్తేగా? ఇది కాస్తా దానధర్మాలు చేస్తే నేనూ నా పిల్లలూ ఏమయిపోతాం?" అన్నది సుందరి తిరిగి శారదాంబ మ్రాన్పడి పోయింది

"జాగా ఎరిగి బైటో అన్నారు. అందని పరుగులికి పోవడం ఎందుకు? అవస్థ పడటం ఎందుకు" శారదాంబ దెబ్బ తిన్న మనస్సుతో అక్కడినుంచి లేచి వెళ్లిపోయింది

ఆంజనేయులు ఆ మరునాడు వెళ్లబోతూ భార్యను పిలిచి హారం ఇమ్మన్నాడు అశ్రువులు తుడుచుకుంటూ మెళ్ళో హారంతీసి యిచ్చింది, శారదాంబ ఆయన అది తీసుకుని మెట్లు దిగబోతూండగా సూర్యనారాయణశర్మగారు, ఆంజనేయులుకు అప్పు ఇచ్చిన మిత్రుడు ఎదురు వచ్చారు

"రండి రండి" అన్నాడు ఆంజనేయులు వెనుదిరుగుతూ

ముగ్గురూ కూర్చున్నారు

"ఎలావుంది మా కోడలు?" అన్నాడు సూర్యనారాయణశర్మగారు

"కులాసాగానే వుంది" అన్నాడు ఆంజనేయులు.

"పిల్లలు బళ్ళోకి వెళ్లారా?"

"ఊఁ!"

సూర్యనారాయణశర్మగారు ఒక్క క్షణం ఆగి "ఒక ముఖ్యమయిన సంగతి ఒడిగిపోదామని వచ్చాను ఆంజనేయులూ!" అన్నాడు

"అడగండి"

"కోడలికీ నీకూ అభ్యంతరం లేకపోతే సుశీని మా ఇంటికి తీసుకువెళతాను మీకూ కొంత భారం తగ్గుతుంది నాకూ కొంత ఉపశాంతి లభిస్తుంది'

"నాదేముంది? అంతా దాని ఇష్టం"

"కనుక్కో"

ఆయన లోపలికి వచ్చాడు గుమ్మంపక్కనే నుంచుని అంతా వింటున్న సుందరి "ఏమీ అక్కర్లేదులే అన్నయ్యా! కడుపున పుట్టిన బిడ్డలకి ఆమాత్రం చేసుకోలేకపోను" అన్నది గట్టిగా మామగారికి వినపడేలా.

"అదేమిటమ్మా? పెద్ద వాడికి అలాగేనా సమాధానం చెప్పటం?" అన్నాడు ఆంజనేయులు మంద్ర స్వరంలో మందలింపుగా

"ఆయన పెద్దరికం నా పెద్దరికం మండినట్లే వుంది" అన్నది కర్కశంగా సుందరి

ఆంజనేయులుకు మనస్సు కష్టం తోచింది ఆయన సుందరి యెడల దుర్మార్గంగా ప్రవర్తించి వుండవచ్చు అయినా అట్లా ఆయన్ని అవమానించడం ఏం మర్యాద? పైగా మరో అపరిచితుడు వెంట వుండగా

నోరు తెరిచి ఏదో అనబోయాడు కాని అందువల్ల జరిగేదేమీ వుండదు అనవసరంగా స్పర్థలు పెరగడం తప్ప

కోపాన్ని తమాయించుకుని "సరేనమ్మా" అని వరండాలోకి వచ్చాడాయన సూర్యనారాయణశర్మగారు "విన్నాను ఇందులో ఒలవంతం ఏముంది గనక ఇహ మేం వెళ్ళొస్తాం" అన్నాడు లేచి

ఆంజనేయులుగారి మిత్రుడూ లేచాడు నారిద్దరివెంటా వీధిదాకా వచ్చాడు, ఆంజనేయులు "సుందరి మాటలు గురించి మరేమీ పట్టించుకోకు ఆంజనేయులూ! దాని తీరే అంత" అన్నాడు సూర్యనారాయణశర్మగారు ఆయనన్నదేమిటో అర్థంకాలేదు ఆంజనేయులికి

"దెబ్బ తింది దాని మనస్సు ఆ కోపం కక్కేస్తోంది" అన్నాడాయన తిరిగి

ఆంజనేయులు అప్రయత్నంగా చేతులు జోడించాడు

వాళ్ళిద్దరూ కదిలారు కొంతదూరం పోయాక ఆంజనేయులుగారి స్నేహితుడు తిరిగివచ్చి "డబ్బు కోసం ఇబ్బంది పడకు ఆంజనేయులూ! నా అవసరం తీరింది నీ చేతికి అందాక ఇద్దుగానిలే" అన్నాడు

"జాలి తలుస్తున్నావా మూర్తీ?" అన్నాడు ఆంజనేయులుగారు రోషంగా

"లేదు భాయీ! నేనంతటి వాడినికాదు కూడా! కాని ఎడ్జస్ట్ అవమంటున్నాను అంతే వస్తాను" అని వెళ్ళిపోయాడు స్నేహితుడు

అయోమయంగా ఇంటికి తిరిగాడు ఆంజనేయులు జరిగిందంతా కొత్త రకంగా వుంది సూర్యనారాయణశర్మగారు వచ్చి అడగటమేమిటి? సుందరి కాదనడమేమిటి?

సుందరి

ఛీ! ఈ ఆడజాతే అంత కాస్తంత ఆసరా దొరికితే విశ్వం మరిచిపోతారు ఉత్తధనియాల జాతి

భార్యగంకేనా చూడకుండా హారం ఆమె చేతిలో పెట్టాడు ఆంజనేయులుగారు ఆమె అడిగిన ప్రశ్న అయనకు వినపడలేదు

సుబ్బారావు బతికుండగా పిల్లల్ని అమితమయిన గారాబం చేసేవాడు ఆ విషయంలో సూర్యనారాయణశర్మగారు ఒకటి రెండుసార్లు మందలించాడు, కూడా అయినా అతడా పద్ధతి విడిచి పెట్టలేదు తూచినట్లుగా (దానికి తోడు) అతనికి ఒక్క ఆడపిల్ల, ఒక్క మగపిల్లవాడూ కలిగారు రెండోవాడయిన రామానికి పదమూడు సంవత్సరాలు వచ్చిందాకా సంతానం లేకపోవటంతో మరింక పిల్లలు పుట్టరని, వాళ్ళే తమ సర్వస్వమనీ అనుకుని అదృష్టితోటే పిల్లల్ని చూసేవాడు. సుందరి కూడా భర్తతో కలిసిపోయేది ఈ విషయంలో

ఏతావతా సుశీల, రామం ఆడింది ఆటగా పాడింది పాటగా పెరిగారు ఏది కావల్సినా మరుక్షణాన అమరించుకోవటం అలవాటయిపోయింది వాళ్ళకు వాళ్ళకు (ఇందుకుతోడు) తండ్రి అంటే ఒక రకమయిన ప్రేమాతిశయమూ, తల్లిఅంటే ఒక విధమయిన తేలిక భావమూ మనస్సులో పాతుకుపోయాయి తాతగారిమీద, తండ్రిపోయేవరకూ వాళ్ల కేటువంటి అభిప్రాయాలులేవు

కాని తండ్రి చనిపోయి తాతగారు ఉద్వాసన చెప్పడంతో పరిస్థితులు తారుమారయినాయి ఇదివరకిలా విలాసాలు సమకూడవని తేలిపోయింది అందుకు కారణం తాతగారేనని నూరిపోసింది సుందరి వాళ్ళకి

దాంతో వాళ్ళు తాతగార్ని ద్వేషించసాగేరు

కాని ఒక్క తమాషా జరిగింది పిల్లల్ని మరింత దగ్గరకు తీసుకుందామనే ఆత్రంలో సుందరి వాళ్లతో చెప్పినవన్నీ అందుకేమాత్రం ఉపకరించలేకపోయాయి పదహారేడులోవున్న సుశీల చాలాదూరం ఆలోచించ గలిగింది •

తాతగారు తమకు నాలుగువేల ఆరువందలు చేతిలోపెట్టి బయటకు పంపించాడు నిజమే అయితే న్యాయశాస్త్ర రీత్యా తన తమ్ముడికి ఆయన ఆస్తిలో హక్కు వుంది అందువల్ల ఈ నాలుగువేల ఆరువందలూ అయిపోయినా తమ్ముడి చదువుకి ఏమంత ఆటంకం జరగదు

తాము గర్భదరిద్రుల్లా గడపక్కర్లేదు

ఆ అమ్మాయి అనిశ్చయానికివచ్చి తన అభిప్రాయాన్ని తమ్ముడి చెవిలో కాస్తా వేసేసింది

రామం ఎగిరి గంతేశాడు

వాడికి చాలా రోజుల్నుంచి రిస్టువాచీ కొనుక్కోవాలని వుంది పైపెచ్చు ఈ మధ్య అలవాటయిన సిగరెట్లకు ఏదన్నా మామూలుకేసయినా వుండకపోతే పరువు నష్టం నూటయాభై రూపాయలయితే ఈ రెంటికీ సరిపోతాయి

సుశీలకు ఓ యాభై చాలు కొత్త బట్టలు కుట్టించుకోవాలి లేకపోతే ఆ తలంపు ఆమెను పులకరింపజేసింది ఆ కుర్రాడు అన్నది గుర్తుకొచ్చిందామెకు

ఇద్దరూ కలిసివెళ్ళి తల్లిని అడిగారు తమ కోర్కెల అత్యవసరాన్ని వివరించారు

సుందరికి నిజమేననిపించింది ఆ కిందటిరోజే మామగారు వచ్చి ఏదో దయాదాక్షిణ్యాలు చూపించబోయాడు తన పిల్లలు ఎంత దర్జాగా జీవించగలరో ఆయన చూడాలి అప్పుడయినా బుద్ధి వస్తుంది

కొడుకు పెట్టమన్నచోట చెక్కుమీద సంతకం పెట్టిందామె పాస్ బుక్కు రహస్యంగా చేతిలో పెట్టి వెళ్ళి రమ్మంది

రామం తెలివయినవాడు అందుకే ఖాళీ చెక్కుమీద సంతకం పెట్టించాడు బయటికివచ్చి అంకెను మూడు వందలు చేశాడు వంద రూపాయలన్నా లేకపోతే తనకు మంచి బట్టలేం వస్తాయి గనక?

డబ్బు తియ్యటం ఖర్చు చెయ్యటం జరిగిపోయింది ఆంజనేయులుగారు ఈ విషయం గమనించకపోలేదు అయినా ఆయన ఏమీ అనలేకపోయాడు

తన్ను దరిద్రం అనుభవిస్తున్నాడు. అందరూ అలాగే ఎందుకుంటారు?

అయితే శారదాంబ అలా అనుకోలేకపోయింది తన భర్త ఒక దుర్మార్గురాలికి సహాయం చేస్తున్నాడనుకుంది కాని ఆ విషయం బయటకు చెప్పగాని కామెకు దమ్ములులేవు ఈవా ఆలేదో ఆయన గుండెకే నాటితేకాని ఈ పీడ విరగడకాదు

ఆ రోజూ వచ్చింది.

# స్వయంకృతం

ఆంజనేయులుగారు ఆ రోజున ఇంటికి వచ్చినప్పటి తీరుచూస్తే ఆడవాళ్లిద్దరికీ భయం వేసింది రుద్రుడిలా వున్నాడాయన గుమ్మంలోకి అడుగు బెడుతూనే చెల్లెల్ని పొలికేక పెట్టాడు.

సుందరి నిబ్బరం తెచ్చుకుంటూ "ఏమిటన్నయ్యా" అంటూ వచ్చింది

"ఏం చేసిందో విన్నావా నీ కూతురు?"

సుందరి గుండె గుభేలు మంది రామం సంగతి కాదు ఆయన చెబుతున్నది సుశీల సంగతి ఏం చేసింది భగవంతుడా అది?

ఆమె అడక్కుండానే సుశి ఏం చేసిందో చెప్పాడు,

ఆంజనేయులుగారు "వాళ్ల క్లాసులో చదువుతున్న సాయిబులు కుర్రాడితో తిరుగుతోంది చాలా?"

సుందరి ప్రాణాలు అలిసిపోయాయి కాని ఆమె ఆ విషయాన్ని వెంటనే ఒప్పేసుకోవటం ఇష్టంలేక పోయింది

"పొరబాటేమోనన్నయ్యా!" అన్నదామె మెల్లగా

ఆయనలో సహనం నశించింది "నా కళ్లతో చూశాను దాన్నీ, వాణ్నీ ఛఛ! ఏనాడూలేదిలాంటిది మన కొంపల్లో తల్లీ! నీకూ నీ పిల్లలకీ పోదండం ఇలా నేను పోషించలేను దయచెయ్యండి" అన్నాడాయన

బంధం తెగిపోయింది

ఇంటికి రాగానే సుశీల నడిగింది సుందరి ఆ పిల్ల నిజమేనని ఒప్పుకుని "ఆ అబ్బాయి నన్ను పెళ్లి చేసుకుంటానన్నాడమ్మా" అన్నది అదేదో ఘనకార్యం కాదన్నట్లు

సుందరి సాచి లెంపకాయ కొట్టింది కూతుర్ని

నిప్పులో వేయాల్సిన చివరి పుల్ల మరి కాస్త సేపటికి పడింది శారదాంబ వంటింటి గూట్లో పెట్టుకున్న రెండు రూపాయల చిల్లరా మాయమయింది ఆ అభియోగం రామంమీద పడింది

"చెట్టుకింద వుంటారో రోడ్డుమీదే వుంటారో మీ ఇష్టం కాని రేపు ప్రొద్దున ఏడింటి తరవాత మీ మొహాలు ఈ ఇంట్లో కనపడకూడదు మొండికేస్తే మెడబట్టి బయటకు గెంటుతాను" అన్నాడు ఆంజనేయులుగారు కసితో

సుందరి ఆత్మాభిమానం దెబ్బ తిన్నది ఆ రాత్రికి రాత్రే రామాన్ని వెంటపెట్టుకువెళ్ళి మరో ఇల్లు కుదుర్చుకుంది అడ్వాన్సుకి చెక్కు రాసిచ్చి సామాన్లక్కడికి చేరవేసింది

ఆంజనేయులుగారు నిట్టూర్చాడు

వేరింటికాపురంపెట్టినా సుందరికి మనశ్శాంతి లేకుండా పోయింది అర్థంకాని, లేని కచ్చ ఆమెలో పెరిగిపోసాగింది రామం పూర్తిగా మారిపోయాడు షోకులు చేసుకు తిరగటంతప్ప చదువు మానేశాడు పదమూడు పధ్నాలుగేళ్ళ కుర్రవాడికుండవలసిన అణకువ పూర్తిగాలేదు వాడిలో రవీంద్రుడు చెప్పినట్లు పధ్నాలుగేళ్లకుర్రాడికి ఆత్మాభిమానం, పెద్దవాడిననుకునే అహంభావం ఎక్కువ దానికి స్వైరత్వం కూడా తోడయితే ఇహ అడగాలా?

సుశీల కొన్నాళ్ళు చాలా బుద్ధిమంతురాలల్లే ప్రవర్తించింది పొరపాటు తెలుసుకుని బుద్ధి తెచ్చుకుందనుకున్నది సుందరి కోపంలో ఆ రోజున కొట్టినందుకు పరిహారంగా తన తాలూకు చంద్రహారాన్ని చేతి గాజుల్ని ఇచ్చింది అలంకరించుకోమని ఆఅమ్మాయి తల్లిన్ని కావలించుకొని బావురుమంది

ఆ సాయంత్రం ఆ అమ్మాయి ఇంటికి రాలేదు!

దడదడ కొట్టుకుంటున్నాయి గుండెలు సుందరికి వంటిమీద బంగారంతోవున్న బంగారంలాంటి పిల్ల ...యిపోయిందో? ఎవర్ని సాయం చెయ్యమనేట్లు పోలీసు రిపోర్టిస్తే పరువు(!) పోదూ?

"ఎందుకమ్మా అంత గాభరా? వాడూ అదీ కలిసి వెళ్లివుంటారు?" అన్నాడు రామం సిగరెట్ వాసన అమ్మకు రాకుండా నోటికి గుడ్డ అడ్డం పెట్టుకుని

వాడంటే? ఆ సాయిబుల కుర్రాడా?

ఆమె మనస్సు మొద్దుబారిపోయింది తన ప్రేమనూ, వాత్సల్యాన్ని కదనిపోయిన కూతురు తనకేం కావాలి?

నాలుగయిదు రోజులు గడిచాయి సుశీల జాడా జాబూ లేదు ఎంతకాదనుకున్నా తల్లి మనస్సు దానికోసం ఆత్రపడుతోంది వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంటోంది

ఆ సాయంత్రం ఆమె మరిది సత్యం వచ్చాడు సుందరి కళ్ళు ఒత్తుకుంది అతడిని చూసి

"నీ కూతురూ అల్లుడూ కనపడ్డారమ్మా!" అన్నాడు సత్యం

ఉలిక్కిపడి మరిదివంక చూసింది సుందరి అతని పెదిమెల చివర సన్నటి నవ్వులాంటిదేదో లాస్యం చేస్తోంది తనను వేళాకోళం చేస్తున్నాడా?

"ఎక్కడ?" లన్నది బలికి సిద్ధపడ్డ పశువులా సుందరి

"తిరపతిలో! మొత్తానికి నీ కూతురనిపించుకుంది వాడ్ని ఒప్పించి వెంకన్నగుళ్ళో పెళ్లి చేసుకుంది అలా వుండాలి తెలివితేటలంటే!" అన్నాడు సత్యం

"నువ్వు చూశావా సత్యం" అన్నది సుందరి గద్గదికంగా

"ఆ పెళ్లి చూసిన వాళ్లల్లో నేనూ ఒకడిని వదినా! పోనీలే! పెళ్లి ఖర్చు తప్పింది ఆ కుర్రాడూ బాగానే వున్నాడు. బాగుండకేంచేస్తాడు ఎంతయినా ముస్లిముల కుర్రాడుగదా?"

ఇహ వినలేకపోయింది సుందరి "చాల్లే బాబూ! వెళ్లిరా!" అన్నది

సత్యం లేచి "కనీసం రామం పెళ్లికయినా పిలు వదినా? నాన్నగారు వచ్చినా రాకపోయినా నేను మాత్రం వస్తాను ఆయనంటే ఏదో కులాలూ గోత్రాలూ అంటాడుగాని మనకేమిటి? వస్తాను" అని వెళ్ళిపోయాడు

ఆ రాత్రి అన్నం ముట్టలేదు సుందరి రామం సుఖంగా భోంచేసి ఏం జరిగిందో తెలుసుకుందామని ప్రయత్నంలాంటిదిచేసి ఈలవేసుకుంటూ సెకండ్ షోకి వెళ్లిపోయాడు

* * *

ఆ తరువాత రెండు సంవత్సరాలు గడిచాయి

ఈ రెండేళ్లలోనూ సుందరి నిల్వలు కాస్తా హరించిపోయాయి రామం చదువు క్షవరమయిపోయింది అలవాటయిన జీవితాన్ని మానుకోలేక వాడు ఆకసి తల్లిమీద ప్రదర్శించేవాడు ఆమె చెవులకున్న దుద్దులూ, ఆంజనేయులుగారు కొనిపెట్టిన సైకిలూ అనవసరంగా పడివున్న (అంతవరకూ అవి అలా కనబడలేదుమరి) పాత సామాను చేతికందిందంతా అమ్మకు తిన్నారు

అవి మాత్రం ఎన్నాళ్లొస్తాయి గనక?

ఆ తరువాత గడిచే మార్గం కనబడలేదు సుందరికి పౌరుషం రామానికి అవసరం ఎక్కువయ్యాయి.

పాశ్చాత్యదేశస్థుడు — ఏమండీ, మీ హిందూదేశంలో కొందరు ఎర్రగాను, కొందరు నల్లగాను ఉంటారే?

హిందూదేశస్థుడు—గుర్రాలు వివిధరంగులలో ఉంటాయి; గాడిదలుమాత్రం ఒకేరంగులో ఉంటాయి.

—ఎమ్ మోహనరావు (హైదరాబాదు)

తెలివిలోపంలేని రామం ఒక మార్గం ఆలోచించాడు సూర్యనారాయణశర్మగారు ఎంతయినా తన పితామహుడు తన తండ్రికి ఆయన ఎంతో ఆస్తి ముట్టచెప్పేవాడు, బతుకుంటే ఇప్పుడు మాత్రం మించిపోయిందేముంది? తాను వెళ్ళి ఆయన్ను అడిగితే

అడిగాడు

"స్కూలు ఫైనలు పాసవ్వు! ఆ తరువాత మిగతా విషయాలు మాట్లాడదాం" అన్నాడాయన

రామం ఫీజు కావాలన్నాడు

ఆయన తానే కడతానన్నాడు

మొత్తానికి రామం మళ్లీ పరీక్షలో కూర్చున్నాడు ఈసారి కష్టపడి చదివాడు ఫలితం సాధించాడు.

"ఉద్యోగం వేయిస్తాను చేస్తావా?" అన్నాడు సూర్యనారాయణశర్మగారు ఆ తదుపరి

"ఊ" అన్నాడు రామం వాడికావల్సింది డబ్బు అది ఎలా వస్తేనేం

వాళ్లనీ వీళ్ళనీ పట్టుకుని రామానికి ఉద్యోగం వేయించాడు సూర్యనారాయణశర్మగారు. రామం మొదట కొన్నాళ్లు గిజాటుపడ్డా కొన్నాళ్ళకు అలవాటయిపోయాడు అతనికి పని చేయటం అలవాటయింది తాతగారిమీద అభిమానం పెరిగింది ఆయన్ను కాదనడం దుర్మార్గం అని పించింది

ఆ సంగతి సుందరి గ్రహించకపోలేదు కూతురు శాశ్వతంగా దూరమయిపోయింది కొడుకూ దూరమవుతున్నాడు

ఒకరోజు సాయంత్రం ఆఫీసునుంచి కోపంగా తిరిగి వచ్చాడు రామం సుందరి ఫ్లాస్కులో కాఫీ గ్లాసులోపోసి ఇచ్చి "ఏమిటిరా?" అన్నది

"మామయ్య ఇంట్లో వుంటున్నప్పుడు ఒకసారి ఆయన డబ్బు కావాలంటే ఇయ్యనన్నావు గుర్తుందా" అన్నాడు రామం

"వూ"

"ఆ డబ్బు తాతయ్యగారు ఇచ్చారట" అన్నాడు రామం

సుందరి మొహం పాలిపోయింది

"అయితే ఏం చెయ్యమంటావు!"

"బుద్ధి మార్చుకోమంటాను"

సుందరి మాట్లాడలేదు

"నిండా పది హేడు సంవత్సరాలులేని నాకు ఉద్యోగం ఇప్పించాడు నీ అన్నగారికి నువ్వు చేయని సహాయం చేసినవాడు. ఆయన్ను కాదనటం మహాపాపం తన వ్యవహారాలు చూట్టానికి వీలుగా వుంటుందని నన్ను కూడా తనతో వుండమన్నాడు నీ కిష్టమయితే రా!"

సుందరి మాట్లాడలేదు

ఆ మర్నాడు తన బట్టలన్నీ వో సూట్ కేసులో సర్దుకుని తల్లివంకైనా చూడకుండా వెళ్లిపోయాడు రామం సుందరి అచేతనంగా అయోమయంగా చూస్తూ ఊరుకుంది

ఆ సాయంత్రమే సూర్యనారాయణశర్మగారు రామం ఆ ఇంటికి వచ్చారు తలుపులు బార్లా తీసివున్నాయి వంటింటి గుమ్మానికి చేరబడి తలవంచుకు నిద్రపోతోంది సుందరి

ఆమెను ముట్టుకున్నాకగాని అది దీర్ఘనిద్ర అని .

"చేతులారా ఇంత చేసుకున్నావా అమ్మా" అని గొణుక్కున్నాడు సూర్యనారాయణశర్మగారు కళ్ళు తుడుచుకుంటూ.






దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

12-4-1961 బుధవారము మొదలు
18-4-1961 మంగళవారము వరకు

**మేషం :**

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

ప్రస్తుతం పరిస్థితుల ననుసరించి కొన్ని పనులలో నిష్కర్షగా మాట్లాడవలసి వస్తుంది డబ్బు చేతికిరాకముందే ఖర్చులు ఎదురు చూస్తూ ఉంటవి స్నేహితులతో మాట్లాడే సమయంలో అవతలివారికి విపరీతమైన భావాలు కలుగగల అవకాశాలున్నవి మీ ఆరోగ్యం ఇంతకు ముందుకన్నా మేలుగా ఉంటుంది ఆదాయవృద్ధి ప్రయత్నాలు అనుకూలిస్తవి వృత్తి వ్యాపారాలలో మీర కోరుకునే మార్పులు సులభంగా అనుకూలిస్తవి శుభ వార్తలు తెలుస్తవి వ్యవహార రంగంలో మనశ్శాంతి, గౌరవము లభిస్తవి ఇంతకుముందు మిమ్ములను భయపెడుతున్న సందేహ వార్తలు నిరాధారాలు అవే విషయం తెలుస్తుంది 13, 14 తేదులలో ఆందోళన, త్రిప్పట, ప్రారంభించిన పనులకు విఘ్నం

*    *    *

**వృషభం :**

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

అనేక సందర్భాలలో తటస్థ భావంతో ఉండటం వల్ల మీ గౌరవాన్ని నిలుపుకోగలుగుతారు ఫలితం ఇప్పుడే చేతికి రాలేదని విచారపడవద్దు ప్రయాణాలు సుఖంగానూ, అనుకూలంగాను జరుగుతవి స్త్రీరాస్తులకు సంబంధించిన వ్యవహారాలు, కార్యకూపాలు జయప్రదంగా జరుగుతవి పెద్ద మనుష్యులతో స్నేహ సంబంధాల ఏర్పడుతవి. కుటుంబంలో తాత్కాలికంగా అభిప్రాయ భేదాలు రాగల అవకాశాలున్నవి పడమర దిక్కు నుంచి లాభ వార్తలు తెలుస్తవి స్నేహితుల సలహాలు ప్రస్తుతం విశేషంగా అనుకూలించవు వారం రెండవ భాగంలో శుభ కార్యాలలో పాల్గొంటారు ధర్మ కార్యాల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి 12, 13 తేదులలో పనుల తొందరవల్ల శ్రమ, నిష్ఠుర ప్రసంగాలు ఖర్చులు.

*    *    *

**మిధునం :**

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

వృత్తి ఉద్యోగాలలో నెమ్మదిగా ఉంటుంది ఆదాయము, మనశ్శాంతి బాగుంటవి మిమ్ములన ఇబ్బంది పెట్టగల రనుకున్న మనుషులు మిమ్ములను గౌరవించి మీ పనులలో సహాయం చేస్తారు పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి భూములు, యంత్రాలు మొదలయిన వాటిమీద డబ్బు పెట్టుబడి పెట్టటంవంటి పనులలో తొందరపడటం మంచిది కాదు శుభ కార్యప్రయత్నాలలో తాత్కాలికంగా ఆటంకాలు వచ్చినా, అందువల్ల ముందు ముందు క్షేమం పొందగలుగుతారు వృత్తిలో ఆదాయంకన్నా బాధ్యతలు, కార్యభారము బాగా పెరుగుతవి ఉద్దే కొన్ని అణచుకుని పనులు కొనసాగించుకొనటంవల్ల సంఘంలో గౌరవ ప్రతిపత్తులు, వ్యవహార విజయము పొందగలుగుతారు 17, 18 లలో ధన లాభము, అధికారులవల్ల కార్యసిద్ధి, గౌరవము.

**గ్రహస్థితి**

మిధునంలో అంగారకుడు, సింహంలో రాహువు, మకరంలో గురు, శనులు, కుంభంలో కేతువు, మీనంలో బుధ, శుక్రులు, మీన, మేషాలలో సూర్యుడు కుంభ, మీన, మేష, వృషభాలలో చంద్రుడు

*    *    *

**కర్కాటకం :**

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

అన్ని హంగులు, అవకాశాలు కనుపిస్తున్నా మరొకరు మిమ్ములను ప్రోత్సాహపరిస్తేగాని కార్యరంగంలో దిగలేకపోతారు. ఈవారం మొదటిభాగమంతా ఇతరులతో పోటీ, ఆందోళన, ధన సంబంధమైన చిక్కులు కనుపిస్తూ ఉంటవి ఇతరులను గురించి మీ ఎదుట చూపిస్తూ, మీ అభిమానము సహాయము పొందటానికి ప్రయత్నించేవారు ఉంటారు మీ వృత్తిలో ఆ యా సమయాలలో పనులు సరిగా జరుగకపోవటం వల్ల విసుగుదల కనిపిస్తుంది పదిమందికి సంబంధించిన పనులలో మీ శక్తికిమించి పాటుపడగలుగుతారు కుటుంబంలో శాంతి, సుఖము లభిస్తవి హాస్య ప్రసంగాలు పాకం ముదరకుండా చూచుకొనవలసిన సమయం 14, 15 తేదులలో నిరుత్సాహము, అపవాదులు, ధననష్టం.

*    *    *

**సింహం :**

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

అవతలివారివల్ల తప్పు కనుపిస్తున్నా ఎవ్వరినీ ఏమీఅనటానికిపీలుఉండదు ధనసంబంధమైన ఫలితం బాగుంటుంది అయితే కొన్ని మార్గాలలో దండగ ఖర్చులు ఎదురు అవుతవి అధికారులవల్ల ఆదరాభిమానాలు లభిస్తవి మీరు చేసిన శ్రమకు, పెట్టుబడికి తగినంత ప్రతిఫలం పొందగలుగుతారు మీ ఆలోచనలు, సలహాలు ఇతరులకు బాగా అనుకూలిస్తవి నౌకరులు మొదలయినవారితో అభిప్రాయ భేదాలు రాగల అవకాశాలున్నవి ఇంతకుముందు మిమ్ములను నిర్లక్ష్యంగా చూచినవారే ప్రస్తుతం మీ మాటను గౌరవించి, సహాయం చేస్తారు ఇతరుల పనులయందుండే శ్రద్ధ మీ స్వవిషయంలో చూపలేకపోతారు గౌరవార్థం ఖర్చులు భరించవలసిన సమయం 15, 16 తేదులలో ధనలాభం, ప్రయాణాలు

*    *    *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా**

మీ కోర్కెను కాదనకుండా, నెరవేర్చకుండా కాలయాపన చేసేవారుంటారు ఒకటి రెండు సందర్భాలలో "దూరపు కొండలు నునుపు" అన్నట్లుగా పొరపాటు పడటము జరుగుతుంది వృత్తికి సంబంధించిన ప్రతి విషయము రహస్యంగాను, నిరాడంబరంగాను జరుపుకొనవలసిన సమయం శుభ సంబంధమైన ఖర్చులు పెరుగుత ... దృష్టం అందబోతున్నట్లు తోస్తు ఉంటుంది ... నుకొనే సమయంలో దూరం అవుతూ ఉ... బంధువుల వల్ల సహాయం పొందగలుగుతారు రాజకీయాలలో మీ మాట చలామణి అవుతుంది ఇంతకుముందు ఏర్పడిన వ్యవహార చిక్కులకు ఒక పరిష్కారమార్గం లభిస్తుంది క్రొత్త వారితో పరిచయం లభిస్తుంది దైవిక విషయాలయందు ఆసక్తి కలుగుతుంది 17, 18 తేదులలో వృత్తిలో అభివృద్ధి, క్రొత్త వారితో స్నేహ సంబంధము, ప్రయాణ సూచనలు

*    *    *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు,స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఈవారం మీరు కావలయునని ప్రయత్నించిన పనులలో అనుకున్నంత ఉపయోగం పొందలేక

పోతారు దేహసౌఖ్యం సంతృప్తికరంగా ఉండదు కుటుంబంలో శుభ సంబంధమైన ఖర్చులు విశేషంగా జరుగుతవి ప్రయాణాలు నిలుపుకోవలసివస్తుంది బంధువులవద్దనుంచి సంతోషకరమైన వార్తలు తెలుస్తవి కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండవలసిన సమయం వృత్తిలో ఇతరులు మిమ్ములను మంచిమాటలతో వంచన చేస్తున్నారనే విషయాన్ని ముందుగా గ్రహించి తప్పుకో గలుగుతారు విలువగల వస్తువులు కొంటారు ఇంతకు ముందు జరుగుతున్న దండుగ ఖర్చులనుంచి బయట పడగలుగుతారు ఆదాయం మామూలుగా ఉంటుంది 15, 16 తేదులలో ఇష్ట వస్తు ప్రాప్తి, సంఘంలో గౌరవము

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ప్రతిపని ఆరంభంలో భయంకరంగా తోస్తుంది మనస్సుకు చికాకు, అసంతృప్తి అధిక మవుతవి ఆదాయం పెరిగినా ధనసంబంధమైన లోపం ఏదో ఒక రూపంలో కనిపిస్తూ ఉంటుంది మీ శ్రమను, మీవల్ల ఉపయోగాన్ని ఎదటివారు గమనించక పోవటంవల్ల మీ నిత్యకృత్యవిషయాలమీద శ్రద్ధ, ఆసక్తి తగ్గిపోతవి అయితే పాటివారివల్ల అన్ని విధాలా సహాయం లభిస్తుంది కుటుంబంలోనివారి ఆదరణ, సహాయము లభిస్తవి తొందరపాటువల్ల వస్తునష్టం కలిగే అవకాశాలున్నవి దూరమందున్న బంధుమిత్రులవద్దనుంచి శుభ వార్తలు తెలుస్తవి పిల్లల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి ఈ వారం మొత్తంమీద మధ్య మధ్య మనశ్శాంతి లోపిస్తూ ఉంటుంది 12, 13 తేదులలో కార్య భంగం, ధర్మ కార్యాలు

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

బాహ్య విషయాలలో గొప్పదనం పెరుగుతుంది మీ శక్తి సామర్థ్యాలను ప్రదర్శించి ఫలితం పొంద గలుగుతారు వృత్తిలో ఇంతకుముందు కనుపిస్తున్న ఆటంకాలు తొలగిపోయి ఉన్నత స్థానాన్ని పొంద గలుగుతారు మిమ్ములను ధనసహాయంకోరేవారు ఉంటారు సంఘ కార్యాలలో మీ మాటను చెల్లించు కుంటారు కుటుంబంలోనివారి అనారోగ్య కారణాలవల్ల ఖర్చులు క్రమంగా పెరిగే అవకాశాలున్నవి మీకు ఇష్టంలేని పనులలో దిగవలసి వస్తుంది అయినా అందువల్ల ఇబ్బంది ఎంతమాత్రము ఉండదు. వారం రెండవ భాగంలో విలాసవినోదాలకై ఖర్చులు పెరుగుతవి బంధువుల రాకపోకలు అధికం స్వల్ప కారణాలతో అభిప్రాయ భేదాలు వస్తవి 14, 15 తేదులలో అసౌఖ్యం, బంధు విరోధం, వృత్తిలో శ్రమ.

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)**

మీరు ఎంత తాపత్రయపడినా ఆ యా సమయం వస్తేనేగాని ఏ పని జరుగదు వృత్తికి సంబంధించిన ఉత్తరాలు మొదలయినవి సకాలంలో అందవు ధనసంబంధమైన చిక్కులనుంచి విముక్తిపొంద గలుగుతారు మీ కార్యక్రమాలలో కొన్ని ఎదురు తిరిగి మొదటికివచ్చే సూచనలు కనుపిస్తవి కాని మీ జాగ్రత్తవల్ల అటువంటి పరిస్థితులను తొలగించుకో గలుగుతారు ఇతరుల మాటలు నమ్ముకుని మీ ప్రయత్నాలను విరమించుకోవద్దు. ఇతరుల కలహాలలో మీ మధ్యవర్తిత్వం అవసరం అవుతుంది కుటుంబఖర్చులు విశేషంగాఉన్నా దైవానుగ్రహంవల్ల చల్లగా నెరవేర్చ గలుగుతారు వారాంతంలో బంధు విరోధం రావచ్చు జాగ్రత్త 17, 18 తేదులలో పుణ్యకార్యాలు, వృత్తిలో అకస్మాద్ధనలాభం.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఒకప్రక్క ఆరాటము ఆందోళన పడుతూ ఉంటారు తలవని తలంపుగా లభించిన అవకాశాన్ని వినియోగించుకొని ఫలితము, సంఘంలో గౌరవము పొందగలుగుతారు అయితే నిమిత్తమాత్రంగా ప్రతిబంధకాలు తోచవచ్చు కాని, మీ అంతస్సుకు మాత్ర లోపం రాదు ఈ సమయంలో పెట్టుబడి రూపంలో ఖర్చులు పెరుగుతవి దేహశ్రమ అధికంగా ఉంటుంది బంధు మిత్రులలో ఒకరిద్దరు మిమ్ములను తేలికగా మాట్లాడగల అవకాశాలున్నవి కుటుంబ విషయాలలో మనశ్శాంతి, సుఖము బాగుంటవి వారాంతంలో దొంగతనంగా వస్తువులుగాని, డబ్బుకాని పోయే అవకాశా లున్నవి తలపెట్టిన పుణ్యకార్యాలు జరుగక పోవచ్చు 16, 17 తేదులలో కలహ ప్రసంగాలు, యత్న కార్యసిద్ధి, శుభవార్తలు.

బంగారు ధర కొద్దిగాతగ్గి 15 నుంచి బాగా పెరుగుతుంది. వెండి ధర నిలకడగా ఉంటుంది నూలు ధర బాగా పెరుగుతుంది. ప్రత్తి ధర సాధారణంగానే ఉంటుంది. పసుపు ధర వారం మొదటిభాగంలో తగ్గి 16 నుంచి పెరుగుతుంది. మినుములకు గిరాకీ వస్తుంది. మాపులనూనె ధర కొద్దిగా తగ్గుతుంది. వేరు శనగనూనె ధర తగ్గి కొద్దిగా పెరుగుతుంది. పప్పు ధర మందీవచ్చి నిలుస్తుంది. మిర్చి ధరలో గిరాకి ఎదురు చూడవచ్చు. బెల్లం ధరలో మంది సూచన ఉన్నవి

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ఏ పని ఏ సమయంలో చేయుటమో ముందు నిర్ణయం ఉండదు అన్ని రకాల బాధ్యతలు పెరుగుతవి మీవల్ల పని తీర్చుకుని నిరాదరణగా మాట్లాడే వ్యక్తులు ఉంటారు చేతికందినా నోటికందకపోవటం వల్ల ఆరాటం అధికమవుతుంది వృత్తి, ఉద్యోగాలలో మీ బాధ్యతలు చాలావరకు తగ్గుతవి. పాటివారివల్ల మంచిపేరుమాత్రం లభిస్తుంది. మిమ్ములను గురించి మీ స్నేహితులు చాటున దూషణగా మాట్లాడు తున్నట్లు తెలుస్తుంది. ప్రయాణకార్యక్రమాలు విలువుబట్టి మార్చుకొనవలసినఅవసరం కనుపిస్తుంది. ఉత్తర దిక్కునుంచి ధనలాభం ఉంటుంది కుటుంబ విషయాలలో ఇంతకుముందుకన్నా సుఖశాంతులు లభిస్తవి 15, 16, 17 లలో క్రొత్తవారి స్నేహం, ధనాదాయంలో పెరుగుదల. ★



ఇదిగో...ఆ కోతి చేష్టలు మాన్తావా ? లేదా ?

ఎ. మునీశ్వర్ కుమార్ (కొందులూరు)



# బ్రహ్మచారి

శ్రీరంగరాజు

**స్త్రీ జాతి ప్రతినిధి సావిత్రి మోహన రూపానికి ముగ్ధుడై పోతున్న బ్రహ్మచారి శర్మ ఈ లోకంలో పడి సిగ్గుపడ్డాడు. ఆడపిల్లని-అందులోనూ అంత అందమైనదాన్ని - అంతదగ్గర నుంచి చూడటం అతనికదే మొదటిసారి !**

భగవాన్లు బాచిలర్స్ లాడ్జిలోకి రివ్వున దూసుకు వచ్చాడు

"ఒరేయ్, కొంప మునిగింది—మన అవధాన్లు పెళ్ళి చేసుకుంటున్నాడు రోయ్" అంటూ గావుకేక పెట్టి, "బై ది బై—మా మావయ్యకూతురు నన్ను చేసుకుందుకు ఒప్పుకుందిరా!" అన్నాడు సిగ్గుతో వంకర్లు తిరుగుతూ తాజాకలంగా!

చలపతిమట్టుకు చలించలేదు ఒక్కసారి అతని వంక చూసి "మీరందరూ వెళ్ళిపోయినా ఆశయం కోసం నిలబడతాం నేనూ శర్మాను" అన్నాడు గోడ మీద వేసిన బొమ్మను చూస్తూ

* * *

"నువ్వు పద బాబాయ్, వరండాలోఉన్న కుడి పై పుగదిలో ఉంటాడు శర్మ" అని ఎవడో సుబ్బారావొకడు సందర్భపడితే నాలుగు ముక్కలు మాట్లాడేందుకు దిగబడ్డాడు శంకరం

బాబాయిగారుమట్టుకు ఎదురుగా ఉన్న ఆఫీసు లోకిపోయి "శర్మ" అనే కుర్రాడిని పిలవమని అక్కడఉన్న ప్యూనుతోచెప్పి వీధివంక చూస్తూ నిలబడ్డాడు, శంకరం రాకకోసం

"వారే మీకోసం వచ్చింది" అంటూ చూపించి వెళ్ళిపోయాడు ప్యూను

శర్మ నేరుగా ఆయన దగ్గరకొచ్చి కళ్ళు మూసుకుని—"నాపేరు శర్మ మా నాన్నగారిపేరు వెంకటరావుగారు మాది బందరు నలభై ఎకరాల మాగాణి—ఇద్దరం అన్నదమ్ములం అన్నయ్య ఇంజనీరు ఇక నా స్వంతఅభిప్రాయం అడిగి మన్నింతదలుచుకుంటే—నాకు పెండ్లిచేసుకోవాలని లేదు. కాదుకూడదంటే మీ ఇష్టం ఇదుగో మా నాన్నగారి అడ్రసు " అంటూ పారం అప్పచెప్పాడు

బాబాయిగారు గుడ్లప్పగించి తెల్లబోతున్నాడు.

పారం చివరిభాగాలు వింటూ లోపలికివచ్చిన శంకరం పరిస్థితిని ఆకళింపుచేసుకుని నవ్వాపుకోలేక పైకి నవ్వేశాడు!

శర్మ కళ్ళుతెరిచి కొయ్యబారిపోయాడు

"ఏరా శంకరం—ఇదివరుకు వీడు బాగానే ఉండేవాడుగా—ఈమధ్యనేమయినా ." మాట పూర్తి చేయకుండానే నాన్చేశాడు బాబాయిగారు

సిగ్గుపడిపోయాడు శర్మ తన తప్పు తెలుసుకుని

శంకరం నవ్వు సశేషంతో ఆపి "నువ్వేదో పెండ్లి సంబంధం బాపతనుకున్నాడు బాబాయి తన వీర బ్రహ్మచర్యానికి ఆటంకం కలుగుతుందని!" అంటూ నవ్వు పూర్తిచేశాడు

"నువ్వా బాబాయ్! అటు తిరిగిఉంటే ఎవరో అనుకున్నాను!" అని కాసేపాగి "మరీ రోజూ ఇదొక భాగవతం అయిపోయిందన్నయ్యా—రోజుకి ఇద్దరు ముగ్గురు రావడం, నా తలవెంట్రుకలతోసహా అన్నీ లెక్కపెట్టడం! వీళ్ళతో రెండు మూడు గంటలు బైట కాలక్షేపం "

"ఏవోయ్ శర్మా, పాపం నువ్వు పనేం చేస్తావులే గాని సంతకంపెట్టి బైట కూర్చో—వచ్చే పోయే

వాళ్ళకి వీలుగా ఉంటుంది. నిన్ను పిలవలేక మా ప్రాణాలు పోతున్నాయి అంటాడు మా ఆఫీసరు" అన్నాడు బాధగా శర్మ.

"అందుకేరా ఒక ఇంటివాడివయితే...' అంటూ ప్రతిపాదించాడు శంకరానికి శర్మకి జాయింటు బాబాయిగారు.

"సరేగాని శర్మా—కొన్నాళ్ళపాటు హోటల్లో మానేసి మనింట్లో ఉండు నేను కాంపులకి పోతూ ఉంటాను ఇంటిని కనిపెట్టుకుని వదినకి తోడుగా ఉండు ఆవిడకి ఏమీ తోచటంలేదుట వెధవ్వేషాలు వేయక సాయంత్రానికి మకాం మార్చేయాలి" అని హోటలుకి లాక్కుపోయాడు శంకరం— బాబాయిని, మరో బాబాయి కొడుకు శర్మని

"ఒరేయ్ శర్మా, అలా స్టేషనుకి పోదాం రా!" అన్నాడు వచ్చిన రెండవరోజున శంకరం

"ఎందుకన్నయ్యా, ఎవరయినా వస్తానన్నారా?"

"మరే—మీ వదిన వాళ్ళ బామ్మగారు వస్తుందిట ఇద్దరం కలిసి ఆవిడని ఇంటికి జేర్చాలి—పద" అంటూ సైకిలనబడే సాధనాన్ని బయటికిలాగి, చక్రాలురెండూ ఉన్నాయో లేదో చూసి మరీ ఎక్కాడు శంకరం శర్మ వెనక కూర్చున్నాడు

ఇద్దరూ కలిసి స్టేషనుకి చేరేసరికి బండికి సిగ్నలు ఇచ్చేశారు కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకుంటూ సిగిరెట్లు కాల్చుకుంటూ ప్లాటుఫారము పొడుగు వగైరా కొలిచేంతలో బండి గావుకేకపెట్టి వచ్చి ఆగింది రొప్పుకుంటూ

పెద్ద వయసులోఉండే బామ్మగార్లకోసం కళ్ళతో వెతుకుతున్నాడు శర్మ తనే ముందు ఆవిడని ఊహించి గుర్తుపట్టి శంకరానికి చూపించి పైపై పోవాలని అతని సదుద్దేశం!

సెకండుక్లాసు పెట్టెలోంచి గ్లాస్కో పంచతో ఒక పెద్దసైజావిడ దిగుతుంటే శర్మకి ప్రాణం లేచివచ్చింది "అదుగో అన్నయ్యా బామ్మగారు" అంటూ ఆ పెట్టెవైపు చూపించాడు శర్మ

"ఎసెస్, కరెక్ట్ హాల్లోవ్!! అటుకేసి పరుగెత్తాడు శంకరం జనాన్ని తప్పించుకుంటూ

తన విజయానికి ఉబ్బి తబ్బిబ్బవుతూ అతన్ని అనుసరించాడు శర్మ

"మాట తప్పకుండా వచ్చావే!" అని నవ్వాడు అప్పుడే బండి దిగుతున్న అమ్మాయిని ఉద్దేశించి శంకరం

శర్మకూడా "నమస్కారం బామ్మగారూ—మిమ్మల్ని మొదట గుర్తుపట్టింది నేనేనండి—నేను శంకరం తమ్ముణ్ణిలెండి" అని కలుపుగోలుగా నవ్వుతూ దగ్గరగా పోయాడు

కోపంతో నాసికాపుటాలు అదరగా అతనివంక సీరియస్‌గా చూసి "ఎవరు బావా ఈయన—దృష్టి సరిగా ఆనదులా ఉందే!" అంది హేళనగా అమ్మాయి.

అప్పటికిగాని తన తప్పు తెలియలేదు శర్మకి. ఇందాక తనకంటికి కనబడిన బామ్మగారికి బదులు మెరుపులాంటి ఒక కాలేజీఅమ్మాయి కనబడింది,

బంగారుగా బొమ్మగారికోసం వెతుకుతున్నాయి అతనికళ్ళు

శంకరానికి జాలి కలిగింది తమ్ముడి పరిస్థితికి "మరేం అనుకోకు సావిత్రీ, వీడు మా బాబాయి కొడుకు శర్మ ఈ అమ్మాయి మా మరదలు పిల్ల మీ వదినకి పింతల్లి కూతురు శలవలు మనవూళ్ళో గడపాలని " పరిచయంచేశాడు శంకరం

శర్మ తనతప్పిదానికి సిగ్గుపడిపోయి "క్షమించండి ఇదంతా మా అన్నయ్య " అని మధ్యలోనే ఆగిపోయాడు శంకరంముఖం చూసి

సావిత్రికి రిక్షా కట్టించి అంతా కలిసి ఇంటికి చేరుకున్నారు వాళ్ళవెంట వచ్చిన చెల్లెల్నిచూసి ఆశ్చర్యపోయింది వసంత!

"ఇదేమిటే—ఉత్తరం ముక్కయినా రాయకుండా వచ్చేశావు! వీళ్ళిద్దరూ ఎక్కడ తగిలారు నీకు?" అంటూ వీధిలో నిలబెట్టే విస్తుపోయింది

"ఉత్తరం రాయకపోవడమేమిటే? ఏం బావా అందకపోతే స్టేషను కెలా వచ్చావు?" అని ఆశ్చర్యంగా అడిగింది సావిత్రి శంకరాన్ని

అటు భార్యచూపులు, ఇటు సావిత్రి ప్రశ్నలు తట్టుకోలేక "ముందు కాళ్ళకి నీళ్ళు వగైరా ఇవ్వటం అనేది ఉందా లేక ఈ ఆశ్చర్యాలూ, నిడ్డూరాలు వీధిలోనే అవాలా?" అని చికాకుపడి ఆసన్నివేశాన్ని మార్చాడు!

"భలే గడుసువారండీ మీరు!" అంది వంటింట్లో వసంత శంకరంవంక గోముగా చూస్తూ.

ఛాతీ అయిదారంగుళాలు పెంచాడు శంకరం!

"ఇన్నాళ్ళకి తెలిసిందన్నమాట!" అన్నాడు గంభీరంగా నవ్వి

"అయితే ఇంతకీ సావిత్రి వస్తుందని మీకు తెలుసునన్న మాట"

"అయిదురోజులక్రితం రాసిందిలే!"

"మరి ఆ విషయం నాతో చెప్పకపోగా పనివేళా మీ తమ్ముడిని ఇంటికి తేవడంలో ఉద్దేశం ఏమిటో?" చిలిపిగా నవ్వుతూ అడిగింది

"ఉద్దేశం ఏముంటుంది మాడమ్! హిందూదేశం! హోం పార్లమెంటులో నిబలం ఒక్క ఓటు పెరిగిందని హడావుడిగా బలాన్ని పోగుచేసుకున్నాను అంతే!"

"మరే పాపం—నాకుటండీ చెపుతారు" అంది వాసంతి మనస్సులోనే భర్తఉద్దేశాన్ని మనసారా మెచ్చుకుంటూ

నలుగురూ కలిసి కారమ్స్ ఆడుతున్నారు శర్మ, వసంత ఒక పార్టీ, సావిత్రీ, శంకరం ఒక పార్టీగా పందెంకాసి మరీ ఆడుతున్నారు

"మగాళ్ళు ఉట్టి మోసగాళ్ళు" అంది హఠాత్తుగా సావిత్రి

కారమ్స్ ఆడుతున్న శర్మ ఉలిక్కిపడ్డాడు

"ఏమిటో ఉండుండి అంత అమూల్యాభిప్రాయం వెలిబుచ్చావు?" అనడిగాడు శంకరం

"మా ఫ్రెండు అరవిందని కాలేజీలో ఒకబ్బాయి ప్రేమించాడు బావా! నువ్వే నాకు దేవతవన్నాడు నువ్వు లేకపోతే చావడం ఖాయమన్నాడు పెండ్లి చేసుకుతీరతానన్నాడు మొత్తానికి దాన్ని నమ్మించాడు కాలేజీ అంతా అరవింద అతగాడిని చేసుకోబోతోందని బాహాటంగా చెప్పుకున్నారు ఇంతలో మంచికట్నంతో ఒక సంబంధం వచ్చేసరికి గప్‌చిప్‌గా ఒప్పుకుని ఆ అమ్మాయిని పెండ్లాడాడు కాలేజీలో తలెత్తుకోలేక చదువు మానేసింది అరవింద!" స్నేహితురాలిమీద సానుభూతి—మగజాతిమీద కోపం ప్రతిబింబించాయి ఆమె ముఖంలో

శంకరం మాట్లాడలేదు

తన ఎదుటే తప్పంతా మగాడిదే నన్నట్టు మాటాడటం శర్మకేమీ నచ్చలేదు దానికితోడు ఆ అభియోగాన్ని ఒప్పుకున్నవాడిలా శంకరం మాట్లాడకపోవడం

"ఆ అమ్మాయి అంగీకరించబట్టేకదా ఇంతవరకు వచ్చింది ఆ ప్రేమని తెలివిగా మొదట్లోనే తుంచేసిఉంటే మీరన్నంతవరకు వచ్చేదికాదుగా కథ' అన్నాడు శర్మ తెగించి

"మాటతప్పి మరొకరిని పెండ్లి చేసుకోవడం తప్పుకాదన్న మాట" నిప్పులు కక్కుతూ అడిగింది సావిత్రి

"తప్పే—కాదనను కాని ఆడవాళ్ళ జీవితాలు పాడుచేసేవాళ్ళు ఆడవాళ్ళేకాని మగాళ్ళుకారు ప్రతి ఆడపిల్లకి అన్ని విధాలా తనకన్న అధికుడే భర్తకావాలనుకోవడం ఈ చిక్కులన్నిటికీ హేతువు! పిల్లల తండ్రులు వేలంపాటలాగా అయిదువేలిస్తాం, ఆరు వేలిస్తాం అంటూ పెంచుకుంటూ పోతుంటే—మగపిల్లాడుకూడా మామూలు మనిషేగా అతనికీ కోరికలంటూ ఉంటాయి డబ్బు ఎవ్వరికీ చేదు కాదు?" అన్నాడు శర్మ

వాదనాంశం కొంచెం గాడితప్పినట్లనిపించింది శంకరానికి వెంటనే పుంజుకుని "ఇదుగో సావిత్రీ—మా శర్మ 'నెపోలియన్ ఆఫ్ ఆంటీ మారేజెస్'—'కాసబ్యాంకా ఆఫ్ బ్యాచిలర్‌షిప్'తెలుసా"అని పెళ్ళున నవ్వి "ఏరా శర్మా, మనలో మనమాట-నువ్వెందుకు పెళ్ళంటే భయపడతావు" అనడిగాడు

కొంచెంసేపు సిగ్గుపడ్డాడు శర్మ తన ఉద్దేశాలు బయటపెట్టేందుకు కాని ఈసారి వసంత కూడా అదే ప్రశ్న అడగడంతో చెప్పక తప్పలేదు

"నాకు ఆడవాళ్ళంటే భయం వదినా! మగవాడు ఉన్నతికిపోకుండా చేసేవాళ్ళు ఆడవాళ్ళు పురాణ కాలంనుంచి కూడా యుద్ధాలు ' కాంతా కనకాల' కోసం జరిగాయి ఇకపోతే చదువుకుంటున్న రోజుల్లో చూస్తూండేవాడిని ఈ కాలేజి అమ్మాయిల లక్షణాలు కుర్రాళ్ళు తమవంక చూడాలని, తమ అందాన్ని ఆరాధించాలని—ఒకరినిమించి ఒకరు మేకప్ అవడం, తీరా వాళ్ళ అందానికి ముగ్ధుడయి వాళ్ళవెంటబడితే వాడిని ఒక చవటకింద, రౌడీకింద ప్రచారంచేసి రిపోర్టు లివ్వడం—దాంతో వాడిచదువు నాశనం కావడం నిజానికి తమవంక ఎవ్వరూ చూడని రోజున వాళ్ళకి నిద్దర కూడా పట్టదనుకుంటా! ఇవన్నీ చూసి ఈ కృత్రిమాకర్షణలకి విసిగిపోయి జీవితంలో పెళ్ళి చేసుకోకూడదని తీర్మానించుకున్నాను హాయిగా హోటల్లో ఎంతో గౌరవంగా పెడతారు నిశ్చింతగా సినిమాకువెళ్ళి ఎప్పుడు గదికి వెళ్ళినా అడేమిటని అడిగే వారుండరు పుస్తకాలు చదువుకుంటూ స్వేచ్ఛగా కాలం గడపక ఎందుకీ రొంపిలో దిగబడతారో నాకు అర్థంకాదు"

సావిత్రి అతనిమాటలకి ఆశ్చర్యపోయింది ఆమె కళ్ళు ఆలోచనలతో మిలమిల్లాడాయి!

శంకరం గబుక్కునలేచి అర్జెంటు పనున్నవాడిలాగా ఇంట్లోకి వెళ్ళి "వాసంతీ, ఒక్కసారి ఇటురా—పనుంది వాళ్ళు సింగిల్స్ ఆడుకుంటారులే!" అని పిలిచాడు

"మీ రిద్దరూ ఆడుతుండండే!" అని వసంత లోపలికి వెళ్ళింది

, శర్మ కాయిన్స్ పేరుస్తుంటే అతని వంకనే చూస్తూ కూర్చుంది సావిత్రి

"అయితే మీమీదకూడా, ఎప్పుడయినా రిపోర్టులు వెళ్ళాయా?" అనడిగింది నవ్వుతూ

"అంతవరుకు రాలేదు లెండి మా స్నేహితులకి ఇద్దరికి జరిగింది నామట్టుకు నేను అసలు వాళ్ళవంక చూసేవాడినికాదు" అన్నాడు ఆమెవంక చూడకుండా

కాయిన్స్ పేర్చటం అయిపోయి అతను స్ట్రయిక్ చేయబోతుంటే "నేను చేస్తానాగండి" అంటూ చేతిలోంచి లాక్కుంది స్ట్రయికరుని

ఆమె వేళ్ళు అతని చేతికి తగిలి ఏదో తెలియని అనుభూతి కలిగి ఆమెవంక చూశాడు ఆడపిల్లని—అందులోనూ అంత అందమయిన దాన్ని—అంత దగ్గరనుంచి చూడటం అతనికదే మొదటిసారి!

"తెల్లనిపాలరాతిమీద నల్లటితుమ్మెదలు దోబూచులాడుతున్నాయి ఆ పాలరాతికి కిందుగా రెండు చేపపిల్లలు, వాటిని కప్పుతూ రెండు కలువరేకులు, వీటికి మధ్యగా సన్నని పొగరబోతు ముక్కు, ఆ కింద మన్మథుడిబాణం అనదగిన సన్నని చిన్నని ఎర్రని పెదిమలు—వాటి కటు ఇటు పాలబుడగల్లాంటి బుగ్గలు, చిన్నగడ్డందగ్గర కలుసుకున్నాయి ఆకిందుగా శంఖం వంటి మెడ, గుండ్రటి బుజాలు "

"ఏమిటి ఆడటం అంటూ ఉందా లేక " అని మల్లెలు కుమ్మరించినట్టు నవ్వింది సావిత్రి

స్త్రీజాతిప్రతినిధి సావిత్రి మోహనరూపానికి ముగ్ధుడయిపోతున్న బ్రహ్మచారి శర్మ ఈ లోకంలో పడి సిగ్గుపడ్డాడు!

"వెధవాయ్! ఆడదాన్ని ముట్టుకోవడంమాట అలా ఉంచి కనీసం జన్మలో ఒక్కసారయినా దగ్గరసా చూసిఉండడు బ్రహ్మచారిగాఉంటాడుట జీవితాంతం అటుమూడు వాడిబాధ" అని నవ్వాడు శంకరం వసంతతో గదిలో

"మగాళ్ళంటే మండిపడే మా సావిత్రికూడా మారిపోతోంది సుమండీ! ఇదే మరొకరు అలా చూసి ఉంటే ఈ పాటికి ఎడందవడ ఎర్రబారేది "

"నీకు సైకాలజీ తెలియదు వాసంతీ—మామూలు పగటు కాలేజీకుర్రాడయితే సావిత్రిని చూసినది మొదలు ఆమెవెంటపడేవాడు, ఆరాధించేవాడు దాంతో ఆ అమ్మాయికి వాడు తేలికయిపోయి కుక్క కింద చూసి ఆడించేది ఇక్కడి కేసు అది కాదుగా మన ప్లాన్ప్రకారం అంతా సవ్యంగాఉంటే ఒక్క వారంలోపల "మదర్పిత చందనతాంబూలాది. " అంటూ వేయించేయనూ!" అన్నాడు శంకరం

ఆ రాత్రి కలలో పాలరాళ్ళు, నల్లటి కొలనుల్లో ఈదులాడే చేపలు, సంపెంగపూలు, తుమ్మెదలూ-కన బడ్డాయి శర్మకి

మర్నాడు సినిమాకి బయలుదేరారంతా శర్మ సావిత్రికి సాధ్యమయినంత ఎడంగా ఉంటున్నాడు అంతా కలిసి హడావుడిగా సిటీ బస్ ఎక్కారు సీట్లు

# భామిని-బ్రహ్మచారి

ఖాళీగాలేక నలుగురు నిలబడటంవలన బస్సు ఆగి బయలుదేరినప్పుడల్లా సావిత్రి శర్మమీద పడటం—ఆమెశరీరం అతనికి తగిలినప్పుడల్లా మతి పోగొడుతోంది

అన్నగారి పక్కన కూర్చుందామనుకున్న శర్మ పక్కన సావిత్రి కూర్చుంది సినిమాహాల్లో అతను కొంత ఖంగారుపడబోయినా అతని మనస్సు అంతరాంతరాల్లో మట్టుకు ఆనందపడ్డాడు

సినిమాలో నిమగ్నమవాలని శతవిధాల ప్రయత్నిస్తున్న శర్మచేతికి సావిత్రి మెత్తటిచేయి తగలటంతో ఉలిక్కిపడి చేయి ఇవతలికి లాక్కున్నాడు

అతని పరిస్థితికి జాలిపడుతున్నట్టు కనుకొనల నుంచి అతన్ని చూసి కర్చీఫు చాటుచేసుకుని నవ్వింది సావిత్రి అది గమనించిన శర్మకి పౌరుషం విజృంభించి ఆమె చేయిమీద చేయివేసి మరీ కూర్చున్నాడు ఈసారి!

ఆరాత్రి అస్సలు నిద్రపోలేదతను తరువాత ఉదయాన—"సావిత్రీ, మీ అక్కయ్య శలవు—ఈ మూడురోజులూ నువ్వు చేయి కాల్చుకుంటావా లేక పోతే హోటలునుంచి తెప్పించమంటావా?" అనడిగాడు శంకరం

"చంపేశావక్కయ్యా-ఈ సంగతితెలిస్తే ఈకాస్త అయ్యాక వచ్చేదాన్నినుమా ఆల్ రైట్, తప్పుతుందా మరి ఒక్కదాన్నీ చేయలేనుకాని బావా, నువ్వు

> ఒక పెద్ద ఆఫీసులో పని చేస్తున్న మేనేజరును కలుసుకోవడానికి తన స్నేహితుడు వచ్చాడు:
>
> "వాట్ మిస్టర్, పెదవులకు 'లిప్‌స్టిక్' కూడా వేసేటట్లున్నావు. చాల బావున్నది ఏకంపెనీదో చెప్తావా?" అన్నాడు ఆ మిత్రుడు.
>
> మేనేజరు కొంచెము తొట్రుపాటు చెంది, పెదవులు తుడుచుకొని
>
> "లిప్‌స్టిక్కా? ఆఁ; అది మా సెక్రటరీని అడిగి చెప్తాను" అన్నాడు.
>
> —సి. కామాక్షమ్మ (నెల్లూరు)

సాయంచేస్తానంటే సై" అంది సావిత్రి కొంగు రొంటిన దోపుకుంటూ

"ఏమయ్యా శర్మా, నీకు ఇవ్వాళా, రేపు శలవలే కాబట్టి వంటింటి డ్యూటీ మీ ఇద్దరికీ వేశాం! మీ అన్నయ్య వంటింట్లోకి ప్రవేశించారంటే పూర గాయలన్నీ బూజుపట్టించేస్తారు!" అంది వసంత శంకరంవంక చూసి

"నేనా!" అన్నాడు శర్మ భయంగా కాసేపాగి "పోనీ వదినా—కాలేజీలో చదువుకునే పిల్ల ఆవిడేం చేస్తారుగాని ఇవతలకు రమ్మను నాకు వంట చేత నవునులే!" అన్నాడు ధైర్యంగా

"అదేమిటిరా—ఆడపిల్లని ఇంట్లో ఉంచుకుని అలాగంటావు? రేపు ఆ రాబోయేవాడి గతేంకాను నేర్చుకోనీ వెళ్ళండి, వెళ్ళండి" అని ఇద్దరిని తోలేసి "అని శ్రీనెహ్రూ ఉద్ఘాటించారు "అంటూ పేపరు ఘడామడా చదవసాగాడు శంకరం నిజ భార్యకి ప్రపంచ రాజకీయాలు పరిచయంచేసే సదుద్దేశంతో

మధ్యలో వసంత అడ్డుపడింది- "ఏమండీ తెలియకడుగుతాను— "ఉద్ఘాటించారు, ఉద్బోధించారు అనందే వీళ్ళకి మాటలు రావా"

"వెనకటికి నీలాటివాడొకడు—ఐ మీన్—ఒకతె అడిగిందిట పురాణం విని నావుడు, అనవుడు ఎవ రండీ—ఏమవుతారు ఒకరి కొకరు అని" తన విట్టుకి తనే పగలబడి నవ్వేడు

నవ్వుకుంటూ సావిత్రి, ఆ వెనక బెరుగ్గా,భయంగా శర్మ ప్రవేశించారు వంటింట్లోకి

"నేను కుంపటి రాజేసి ఇస్తాను—మీరు విసురుతూ కూర్చోండి" అంది సావిత్రి

"అలాగే" అన్నాడు శర్మ తలవంచుకునే

వంటకాల టోర్నమెంటు హోరాహోరీగా సాగి పోతోంది వారు వేయలేదని వీరు, వీరు వేయలేదని వారూ ఉప్పులూ, కారాలూ ధారాళంగా వేసేస్తున్నారు అన్నంగిన్నెలో అన్నం ఉడికిపోయినా నీళ్ళు బోలెడు మిగలటంవలన పొంగు లొస్తున్నాయి

"అయ్యో, అయ్యో అన్నం దింపండి" అని జనాంతికంగా ఒక కేకేసి మళ్ళీ తనే ఆపని చేద్దామని పమిటచెంగు రెండుచేతుల్తో పుచ్చుకుని వంగ బోయింది సావిత్రి

కాని ఆమె కోరికప్రకారం ఆపని తనే జరుపుదామన్న ఉద్దేశంతో పైమీది టవలును పట్టుకుని అదే సమయానికి వంగాడు శర్మ

ఇద్దరి తలలు 'డేఢీక్కి' తగిలాయి "అబ్బ" అంటూ తలలెత్తారు ఇద్దరూ

గుమ్మంలోంచి ఈ సన్నివేశంచూసి మురిసిపోయిన శంకరం "నోనో—ఒక్కసారి కొట్టుకుంటే జన్మాంతం విరోధులవుతారట మరొక్కసారి కొట్టుకుంటే ఆ ప్రమాదం తీరిపోతుంది" అని—మళ్ళీ వాళ్ళాపని చేస్తారు చేయబోతారన్న బెంగతో తనే స్వయంగా ఇద్దరి తలలూ పట్టుకుని 'ఢీకిక్కి' అంటూ మళ్ళీ ఆనించి "హమ్మయ్య" అన్నాడు

"ఏమిటి బావా నువ్వు మరీనూ" అంది చిరు కోపంతో నుదురుమీద రుద్దుకుంటూ సావిత్రి

"చూశావూ మరదలూ-ఇంకో విషయం ఎల్లాగో కష్టపడి అన్నపుజావ కాచారుకాబట్టి అందులో బెల్లం కూడా వేశారంటే అమోఘంగా పరమాన్నం అయి పోతుంది" అన్నాడు నవ్వుతూ శంకరం

ఇద్దరూ నవ్వేశారు.

అన్నాలదగ్గర తెలిసింది ప్రతి ఆధరవులో జోడు ఉప్పులు, జోడు కారాలు పడ్డాయని!

"మీవంట దొంగల్దోలా—ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకోవడం భయమా ఏమిట్రా?" అంది వసంత.

"కాదూ మరి—నేనంటే ఆయనకి బోలెడు భయంగా. శత్రుపక్షప్రతినిధినాయిరి!" అంది బుంగ మూతిపెట్టి సావిత్రి.

ఆమెవంక చూస్తేనే మతిపోతోంది శర్మకి. "అయిపోతోంది తను వోడిపోతున్నాడు" అనుకుంటూనే ఆమెవంక చూశాడు. "సున్నా చుట్టి పట్టున్న ఆమె మూతి, నిండుగాఉన్న బుగ్గలు...." ఖలవంతాన ఆలోచనలు మార్చుకుని,

"అందుకే వదినా నేనంది, పాపం మీ చెల్లెల్ని కష్టపెట్టడం ఎందుకు నేనొక్కడినే కానిచ్చేస్తాను అని"

"మళ్ళీ అదేమాట! అదేం కుదరదుకాని అబ్బాయి రాత్రికి ఉప్పుకారాల సెక్షన్ నువ్వుపుచ్చుకో, మిగిలిన పనులు అది చేస్తుంది" అని సమాధానపరిచింది వసంత.

వద్దన్నకొద్దీ అతని మనస్సు ఆమె వైపే పరుగెత్తడం అతనికేమీ బావుండలేదు. ఏదో ఆనందం—ఏదో దిగులు!

"రాత్రి వంట చేస్తున్నప్పుడు ఆమెవంక చూడకూడదు—ఆమెతో మాట్లాడకూడదు" అని తీర్మానించుకున్నాడు.

వంటింట్లో ప్రవేశించినది మొదలు అతని బలహీనతని గ్రహించి మరీ రెచ్చిపోయింది సావిత్రి. మాట మాటకి సెలయేరు ప్రవహించినట్టు గలగల నవ్వటం, అతన్ని కవ్వించి మరీ మాటల్లోకిదింపటం—ఎంత స్వాధీనంలో ఉంచుకుందామనుకున్నా మనస్సు పరుగెడుతోంది శర్మకి!

భోజనాలదగ్గర మళ్ళీ గోల!

"ఇదేమిటయ్యా శర్మా, అసలు ఉప్పు కారం వేయటం మర్చిపోయావు" అంది వసంత. ముద్ద నోట్లో పెట్టుకుని.

సావిత్రి పకపక నవ్వుతోంది.

శంకరం తమ్ముడివంక చూసి జాలిపడ్డాడు! శర్మ తెల్లబోయాడు. "మనస్సు బాగాలేదు వదినా" అని మెల్లిగా గొణిగాడు.

వసంతకు దగ్గరసాజేరి ఎవ్వరికీ వినబడకుండా అన్నాడు శంకరం "వాసంతీ—మావాడిలో ఇంక ఎదిరించేశక్తి లేదు. లొంగిపోతాడు!" అన్నాడు.

రాత్రి పదిదాకా రేడియో వింటూ కబుర్లల్లో కాలం గడిపేశారు.

పడుకోబోయేముందు "సావిత్రీ—పాలల్లో తోడు పెట్టావా?" అనడిగింది వసతం.

"అరెరె, మర్చిపోయా నక్కయ్యా—ఇప్పుడు నాకు వంటింట్లోకి వెళ్ళటం భయం బాబూ! అందులోనూ మీ వంటిల్లు వెడంగా ఉంటుంది. పైగా ఇంటినిండా ఎలుకలు" అని శర్మ వంక చూసింది సాయంవస్తారా అన్నట్టు.

అతనిగుండె దడదడలాడుతోంది.

"కాస్త సాయం వెళ్ళిరారా శర్మా!" అన్నాడు శంకరం. యాంత్రికంగా లేచాడు శర్మ.

వంటింటి తలుపు తాళంతీసి లోపలికి వెళ్ళారిద్దరూ. ఒక్క నిమిషం పోయాక హఠాత్తుగా ఇంటి మొత్తం దీపాలు ఆరిపోయాయి.

చీకటంటే ఎలుకలికి హుషారు.

ఒక ఎలుకమ్మ, మరో ఎలుక బావా సరదాగా సరసాలాడుకుంటూ బయటికివచ్చి పచ్చటి అందమయిన పాదాలు రెండు చూసి, ముచ్చటపడి—తలో కాలుమీదికి ఎగబాకి మోకాలుదాకా ప్రయాణం సాగించి, "నువ్వికాలుమీదికి రా. నేను ఆకాలుమీదికి వెడతా"ననుకుని కాళ్ళు మార్చుకుని దిగిపోయాయి.

అసలే చీకటి—అందులోనూ ఎలుకలంటే హడిలిపోయే సావిత్రి ఈ మూషిక ప్రేమికుల విహారానికి బెదిరి చిన్న సైజు కేక ఒకటివేసి వెనకగా నిలబడ్డ శర్మని వాటేసుకుంది.

తరతరాలుగా వస్తున్న స్త్రీల అశక్తత—వాళ్ళకి అండగా నిలబడాలన్న పురుషత్వం విజృంభించింది శర్మలో!

"నేనుండగా నిన్ను ఎవ్వరూ ఏమీ చేయలేరు సావిత్రీ—నీమీద ఈగని వాలనివ్వను" అంటూ ఆమె చుట్టూ తన చేతులు చుట్టేశాడు.

ఆడదాని శరీరస్పర్శ ఇచ్చే పూర్తి ఆనందం మొదటిసారి, అనుభవించాడు శర్మ.

ఊగిసలాడుతున్న మనస్సు ఒక్కసారిగా ఒక నిశ్చయానికి వచ్చేసింది.

ఆవేశంతో ఆమెని ఇంకా దగ్గరకు లాక్కుంటూ "నువ్వు నా దానివి సావిత్రీ" అన్నాడు శర్మ.

మెయిన్ స్విచ్చి మళ్ళీవేసి తనప్రయత్నం ఎంతవరకు నెరవేరిందోనన్న ఆతృతతో వచ్చిన శంకరం లోపలిదృశ్యం చూసి ఒక్కసారి ఎగిరి గంతేశాడు.

"వెరీగుడ్, రేపే అటు బొబాయికి, ఇటు పిన్నత్తగారికి ఉత్తరాలు రాసేస్తాను" అన్నాడు నవ్వుతూ.

అతని మాటలతో ఈ ప్రపంచంలోపడి ఇద్దరూ విడిపోయి వెడంగా నిలబడ్డారు సిగ్గుపడుతూ.

హడావుడిగా లోపలికి వెళ్ళాడు శంకరం. "వసంతా—మదర్పిత శ్రీశ్రీశ్రీ చందన తాంబూలాలా లేక మదర్పిత చందన తాంబూలాలయాక శ్రీశ్రీశ్రీ ఉండాలా?

ముసిముసినవ్వులు నవ్వింది వాసంతి. "చేశారు కాని మహలావు పెళ్ళి రెండూ తప్పే!.ముందు పిన మావగారికి మా పిన్నికి ఉత్తరాలు రాయండి. ఇద్దరికి కూర్చోపెట్టి మీప్లాను వివరించితే మెచ్చుకుంటారు. సావిత్రీ......ఏమయ్యా శర్మా ఇకరండి బయటికి—ఇంతకీ పాలలో తోడు వేశారా లేదా?" అంది నవ్వుతూ.

*  *  *

సావిత్రితో రిక్షాలో సినిమాకి వెడుతున్నవాడల్లా రిక్షా ఒకసారి ఆపించి "ఇప్పుడే వస్తాను సావిత్రీ—మా బాచెలర్సు లాడ్జికి గుడ్‌బై చెప్పి!" అన్నాడు శర్మ.

"జాగర్తండోయ్, మళ్ళీ బ్రహ్మచారి జండా పట్టేరు!" అంది నవ్వుతూ.

గబగబ లోపలికి వెళ్ళాడు శర్మ. "చలపతీ క్షమించాలిరా. నేను కూడా....."

"ఆఁ, ఆఁ విన్నానులే.... మా ఇంటిపక్క తాసిల్దారుగారమ్మాయి నన్ను చేసుకుంటానంది. నీకు చెప్పి వెడదామని నే వచ్చాను" అన్నాడు నవ్వుతూ.

బాచిలర్స్ లాడ్జికి తాళంవేసి ఇద్దరూ బయటకు నడిచారు.

శర్మ రిక్షాఎక్కి సావిత్రిపక్కన కూర్చున్నాడు. అతనివంక చూసి తృప్తిగా నవ్వింది సావిత్రి! రిక్షా ఝామ్మంటూ పరుగెత్తింది. ★



చిత్రకారుడు: ఎం. వి. అప్పారావు (రాజమండ్రి)



జూల్స్ వెర్న్ నవల

# ౮౦ రోజులలో భూప్రదక్షిణం

క్రాలంకాని కాలంలో, అంత చిన్న పడవమీద ఎనిమిదివందలమైళ్ళ ప్రయాణం చేయబోవడమనేది నిజంగా దుస్సాహసం ముఖ్యంగా ఇట్టే పెనుగాలి వీచి అట్టే తుఫాను విరుచుకుపడే చైనా సముద్రంపై మరీ ప్రమాదం సూర్యుడు సరిగా భూమధ్యరేఖపైకి వచ్చి నిలచే కాలంలో ఆ సముద్రం మహా ఉద్ధృతంగా ఉంటుంది

ఫాగ్ అడిగిన ప్రకారం, అతన్ని సరాసరి యోకహామాకు తీసుకు వెళ్లడమే పైలట్‌లకు లాభసాటి. రోజుకు ఇంత అని కేవు మాట్లాడుకున్నారు కాబట్టి యాత్ర ఎన్నాళ్ళు సాగితే అంత మంచిది. కాని ఇటువంటి పరిస్థితులలో డబ్బుకు ఆశించి అందుకు వడిగట్టడం పొగరుమోతుదనం అనిపించుకుంటుంది తల తిక్కపని అవుతుంది. యోకహామాకే కాదు షాంగ్‌హై ప్రయాణం కూడా అంతే అయితే పైలట్ బన్స్‌బీకి తన చేతిలో ఓడమీద అంతటి గురి ఉంది ఆ పడవ కూడా అతని నమ్మకానికి తగినట్టే నడుచుకుంది ఉవ్వెత్తున ఎగిరిపడే కెరటాలమీద అది ఎంతో విడుపుగా లేస్తూ వయ్యారంగా జలచరంలా సులువుగా దిగుతూ ముందుకు సాగిపోయింది ఆరోజు మధ్యాహ్నం అంతా ప్రయాణం హాంగ్‌కాంగ్ తీరస్థంగా సాగింది ఎట్నుంచి ఎప్పుడు ఏ గాలి వచ్చి పడుతుందో చెప్పడం కష్టమైన ఆ ప్రాంతంలో 'టాంక డియర్' అతి నేర్పుగా నడిచింది

జలసంధులు వదలి నడి కడలి ప్రవేశించగానే ఫిలియస్‌ఫాగ్, పైలట్ బన్స్‌బీని పిలిచి లాంఛనంగా హెచ్చరించాడు

"సాధ్యమైనంతవరకూ కృషి లోపం లేకుండా చూడాలని వేరే చెప్పనక్కరలే దనుకుంటాను" అన్నాడు.

"ఎంతమాట నా విషయంలో అలాటి సందేహాలు పెట్టుకోకండి గాలి వాలును బట్టి వీలు ఉన్నన్ని తెరచాపలు ఎత్తాము మిగతా చాప కొయ్యలు ఎత్తక పోవడానికి కారణం, అవి ఎదురు తెడ్లల్లా అడ్డుపడతాయనే"

"సరిసరి నీ విద్య నీకు తెలీదని కాదు ఆ సుళువు బలువులన్నీ నీకే తెలియాలి నీమీదే భారం వేశాను" అన్నాడు ఫాగ్

నావికుల తీరులో కాళ్ళు ఎడంగా తన్నిపెట్టి, రొమ్ము విరుచుకొని స్థిరంగా నిలబడి, నిశ్చలంగా

అనువాదం :

## ఎస్. పార్థసారథి

సముద్రంకేసి చూడసాగాడు ఫాగ్ కొంచెం అవతలగా అయూదా కూర్చుంది ఎదర సముద్రం లాగే ఎదలో ఆలోచనలు కల్లోలంగా ఉన్నాయి పైన తెరచాపలు, బారజాచిన రెక్కలలా ఉన్నాయి గాలి ధాటికి జోరుగా పోతున్న టాంకడియర్, నీటిమీద తేలుతున్నట్టు లేదు రెక్కలు విప్పార్చి ఎగిరిపోతున్న పెద్ద విహంగంలా ఉంది

పొద్దు వాలింది చంద్రుడు ఉదయించాడు గాని కొద్దిసేపటిలోనే తూర్పునుంచి మబ్బులు మూసుకు వచ్చాయి వెలుతురు మసకబారింది కొద్దిసేపటిలో పైలట్ దీపాలు వేయించాడు ఈ ప్రాంతంలో దీపాలు చాలా ముఖ్యం కోస్తాకి పోతూ ఎదురొచ్చే ఓడలు ఇటుపోయే వాటికి తరచు గుద్దుకోవడం కద్దు. ఇపుడు టాంకడియర్ వెళ్తున్న జోరుకి, చిన్న ఎదురుదెబ్బ తగిలినా చాలు—పడవ తునా తునకలై పోతుంది

డిటెక్టివ్ ఫిక్స్ ఓ పూాల కూర్చుని భవిష్యత్తుగురించి పగటికలలు కంటున్నాడు ఫిలియాస్‌ఫాగ్ అపరిమిత మితభాషి అని తెలిసి, ఇతనూ మూభావంగానే ఉంటున్నాడు దానికి తోడు ఫాగ్ పట్ల ఫిక్స్‌కు విపరీతమైన ద్వేషం ఇంత ధూర్తుడు, దొంగ లయిన వాడితో మాట్లాడడానికే అతనికి మన సొప్పటం లేదు పైగా ఇపుడు అతని దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి, అతనివల్ల ఉపకారం పొందుతూ, అతని ఉప్పు తినాల్సి వచ్చింది ఫిలియాస్‌ఫాగ్ యోకహామాలో ఎలాగ ఆగబోవటం లేదు అక్కడ దిగగానే శాన్‌ఫ్రాన్సిస్కో స్టీమరు ఎక్కి అమెరికా చేరుకుంటాడు విశాలమైన ఆ దేశంలో ఇతను అడుగు పెడితే ఇక పట్టుపడడం కల్ల ఆచూకీ పట్టుకోడం చాలా కష్టం అవుతుంది అంటే ఫాగ్ చాలా పెద్ద ఎత్తే వేశాడన్నమాట

మామూలు దొంగల్లా, ఇంగ్లాండులో ఓడ ఎక్కి సరాసరి అమెరికా పారిపోకుండా, చుట్టూ తిరుగుడు దారిన బయల్దేరి భూగోళానికి ముప్పాతిక వంతు ప్రదక్షిణం చేసి, పోలీసుల్ని తికమక పెట్టి, తప్పుదారిన పెట్టి, అట్నుంచి అమెరికా ప్రవేశిస్తున్నాడు అక్కడ స్థిమితంగా కూర్చుని, ఎత్తుకొచ్చిన ముల్లెనంతా తీరికగా అనుభవిస్తాడు కాబోలు ఇపుడు ఇతగాడు అమెరికా వెళ్తే తను ఏంచేసేటట్టు ? వదలిపెట్టి తనదారిన వెనక్కి పోవాలా ? కుదరదు ముమ్మాటికీ అది కుదరదు అమెరికాలో అతన్ని బంధించడానికి అవసరమైన "ఎక్స్‌ట్రాడిషన్ ఆర్డర్లు" తెప్పించి మరీ

పట్టుకోవాలి అది తన విధి దాని అంతు కనుక్కొ తీరాలి

మొత్తానికి ఈ వ్యవహారంలో గుడ్డిలో మెల్ల అన్నట్టు తలచుకు తలచుకు సంతోషించడానికో చిన్న విషయం దొరికింది ఫిక్స్‌కు—పాస్పోర్టు వెనక దిగబడిపోవడం తను తీరా గుట్టు మట్లన్నీ అతనికి చెప్పేశాడు ఇపుడు అతను ఫాగ్‌ని కలుసుకుంటే తనకి ఆచూకుండదు అందువల్ల వాళ్లిద్దరికీ భేటీపడకుండా చూడడం చాలా అవసరం

ఫిలియాస్‌ఫాగ్ పాస్పోర్టును పదేపదే తలచుకుంటున్నాడు అంత చిత్రంగా మాయం కావడానికి కారణం ఏమిటో అతనికి బోధపడటం లేదు చాలా ఆలోచించి చివరకు ఒక తీర్మానానికి వచ్చాడు ఫాగ్ బహుశా పాస్పోర్టు ఎక్కడో దారి తప్పిపోయి, రేవుకు ఆలస్యంగా వచ్చి తన కోసం వెదకి, 'కర్నాటిక్' స్టీమర్లో ఉండవచ్చునన్న అపోహతో అందులో ఎక్కి బయల్దేరి ఉంటాడని అయూదా కూడా ఈ వూహనే బలపరచింది తనకు మహోపకారం చేసిన పాస్పోర్టు గురించి ఆమెకూడా అనేకవిధాల మధనపడింది పాస్పోర్టు కనక 'కర్నాటిక్' ఎక్కివుంటే యోకహామా వచ్చిఉంటాడు అక్కడ కనుక్కొని వెతకవచ్చు అదేమంత కష్టంకాదు

రాత్రి పదిగంటలవేళ, గాలి జోరు హెచ్చింది తెరచాపలు ఒకటి దించితే బాగానే ఉండేదేమో కాని పైలట్ ఉన్నవాటి నన్నిటినీ పరిశీలించాడు వీస్తున్న గాలిని పూటుగా పోసుకుపోతోంది పడవ గాలి పుంజుకుంటే, పడవ పుంజుకుందికి అన్నీ సిద్ధంగా ఉన్నాయి అందువల్ల పైలట్ మార్పులేం చెయ్యలేదు

పన్నెండు గంటలకి ఫాగ్, అయూదాలు కాబిన్‌లోకి దిగారు డిటెక్టివ్ ఫిక్స్ లంతకుముందే దిగివెళ్లి ఒక మంచంమీద నడ్డి వాల్చాడు

పైలట్ బన్స్‌బీ, పడవమీది సిబ్బందీ, ఆ రాత్రి అంతా డెక్ మీదనే ఉండిపోయారు

మర్నాడు నవంబరు 8 సూర్యోదయం అయేసరికి టాంకడియర్' నూరుమైళ్ల పైచిలుకు ప్రయాణం చేసింది అడపా దడపా దూరం, కాలం చూచి వేసిన లెక్కల ఫలితంగా సగటున గంటకి ఎనిమిది, తొమ్మిది 'నాట్' ల వేగంతో పోతున్నట్టు తేలింది తెరచాపలన్నీ ఎత్తుకుని, వాలును బట్టి వీలు అయినంత వేగంగానూ పోతూంది పడవ గాలి జోరు, వాలు ఇలాగే ఉంటే, గడువు దాటకుండా పడవ అడంగి చేరడానికి సావకాశం ఉన్నట్టే అనుకోవచ్చు

ఆరోజు పగలంతా 'టాంకడియర్' కోస్తా వెంబడినే ప్రయాణం చేసింది కోస్తాకు ఐదు మైళ్ల దూరంలో ఉన్నందువల్ల తీరంనుండి వచ్చే గాలి ఉధృతంగా తగలలేదు అదే జరిగితే, కెరటాలు విసురుగా లేచి ఇలాటి చిన్న ఓడల్ని చాలా అల్లరి పెడతాయి నావికుల పరిభాషలో—"చంపేస్తాయి" అన్నమాట

ఫాగ్, అయూదాలకు, సముద్రంవల్ల, వూపువల్ల చేసే పైత్యం, తిప్పుడు ఏమీ వచ్చిపడలేదు ఇద్దరూ సుష్టుగా కడుపారా భోజనం చేశారు ఫిక్స్‌ని కూడా సహపంక్తికి పిలిచారు.

ఫాగ్ పంక్తిన తినడం ఫిక్స్‌కి సుతరామూ ఇష్టంలేదు రోత కలిగింది కాని తప్పనిసరి. గత్యంతరంలేదు అటూ యిటూ వూగి తూగి ఒరిగిపోకుండా ఉండాలని ఓడలో బరువు వేసినట్టే కడుపులోనూ కాస్త వడేయకపోతే లాభం లేదు అందుకని బలవంతాన కాస్త ఎంగిలిపడ్డాడు. కాస్తయితేనేం కూస్తయితేనేం ఇష్టంలేని తిండి కతకక తప్పిందికాదు

భోజనం కాగానే, ఫాగ్‌ని పక్కకు తీసుకువెళ్లాడు ఒక గుటక మింగి "సార్"—అన్నాడు నోరు భగ్గుమంది. దొంగ అని తెలిసి తెలిసి సార్ అని,'మీరనీ సంబోధించడం అతనికి చాలా బాధగా ఉంది కాని, ఆ దొంగనే పట్టుకు బంధించాలంటే ఈ యాతన తప్పదు

"అయ్యా మీరెంతో దయతో, అభిమానంతో నన్ను ఈ ఓడమీద ఎక్కించి తీసుకు వెళ్తున్నారు అయినంతా యిచ్చుకునేటంత తాహతు లేనివాణ్ణి అయినా, ఓపినంతవరకూ ఇందులో నా వాటా ఇచ్చుకుందామని ఉంది దయఉంచి—"

"అబ్బెబ్బే అదేం వల్లకాదు ఆ విషయం మాత్రం ఎత్తవద్దు" అన్నాడు ఫాగ్

"నేను ఒప్పుకోక బలవంత పెడితే—"

"అబ్బే కుదరదు ఇదంతా మామూలు ఖర్చులోనే ఎత్తుకుని పోతుంది వద్దు" అన్నాడు ఫాగ్ ఖచ్చితంగా—ఇంక ఫిక్స్ మారు మాట్లాడడానికి ఆస్కారం ఇవ్వనంత ఖచ్చితంగా

ఫిక్స్ మారు మాట్లాడలేదు తలవంచి వందనం చేశాడు ముచ్చటలూ పోశాయి తిన్నగా వెళ్లి మంచంమీద పడుకున్నాడు ఆరోజంతా మరి మాటా మంతీ లేకుండా పడుకున్నాడు

పడవ జోరుగా పోతోంది పైలట్ బన్స్‌బీ హుషారుగా ఉన్నాడు షాంగ్‌హైకి అనుకున్న వేళకి చేరిపోతామని పదేపదే ఫాగ్‌కు ధైర్యం చెప్పాడు దిమాగా చేరతామనే నేనూ నమ్ముతున్నాను అన్నాడు ఫాగ్ ముక్తసరిగా వేళ తప్పక అడంగి చేరితే వచ్చే బహుమతి తలుచుకుంటూ బన్స్‌బీ అతని సిబ్బందీ అంతా ఒళ్లు దాచుకోకుండా ఉత్సాహంతో పని చేస్తున్నారు రాయల్‌క్లబ్ ప్రపంచ పోటీలో కూడా ఎవరూ అంత ఉత్సాహంగా, శక్తివంతంగా పనిచేసి ఉండరు

ఆ సాయంకాలానికి, పైలట్ తన "లాగ్" పుస్తకంలో (ఓడల దైనందినీయం), ప్రయాణం రెండు వందల ఇరవై మైళ్లు సాగినట్టు వ్రాసుకున్నాడు ఈ లెక్కన సాగితే యోకహామా చేరేసరికి ఆలస్యం అయిందని ఫాగ్ తన పుస్తకంలో రాసుకోవలసిన అగత్యం ఉండదన్నమాటే లండన్ నించి బయల్దేరిన తరవాత ఇన్నాళ్లకు తొలిసారిగా కొండల్లే వచ్చిన ఈ ఉత్పాతం మంచల్లే కరిగిపోయినట్టే నన్నమాట

ఆ రాత్రి 'టాంకడియర్', చైనా కోస్తాకీ, ఫార్మోజా దీవికీ మధ్య ఉన్న ఫోకియన్ జలసంధి ప్రవేశించి ప్రయాణం సాగించింది కల్లోలిని ఆ ప్రాంతంలో మహా కల్లోలంగా ఉంది ఎదురు బొదురుగా వచ్చే ప్రవాహాలలో సుడులు తిరుగుతోంది. పడవ ముందుకు జరగడానికి ఎంతో

## జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెం వేసి సేవకుడు పాస్పార్టుతో బయలుదేరుతాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ ఫాగ్ దొరికాడని, అరెస్టుకు బొంబాయికి వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్ వెంట సూయజునుంచి బొంబాయికి చేరతాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరలేదు. బొంబాయినుంచి కలకత్తాకు రైలుబండిలో ప్రయాణం అవుతాడు ఫాగ్. రోథాల్ వద్ద బండి ఆగిపోగా గత్యంతరం లేక ఏనుగుని అలహాబాదు తీసుకెళ్తారు. దారిలో బలవంతంగా సహగమనానికి పోతూఉన్న అయూదాను రక్షించి ఆమెతో కలకత్తా చేరుకొంటాడు ఫాగ్. అక్కడ వారిని నిలపడానికి ఫిక్స్ చేసిన యత్నం విఫలమైంది. ఫాగ్ ప్రభృతులు 'రంగూన్' ఓడలో పయనం ప్రారంభించారు. ఆ ఓడలో వే ఉన్నాడు ఫిక్స్. ఫాగ్‌ను అరెస్టుచేయడానికి భోగట్టా సేకరించాలని పాస్పార్టును చేరదీశాడు. కాని అంతు చిక్కలేదు. లండన్ విడిచిన36రోజులకు హాంకాంగ్ చేరుకొని, అయూదాతో 'కర్నాటిక్' లో యోకహామా ప్రయాణానికి ఏర్పాటు చేసుకొన్నారు. కాని ఆ ఓడ తప్పిపోయింది. దానిని షాంగ్‌హైలో అందుకునేందుకు ఫాగ్ "టాంకడియర్" అనే పడవను కుదుర్చుకొని బయలుదేరాడు.

ప్రయాస పడవలసి వచ్చింది చిన్నవైనా బలమైన కెరటాలు ఎదురొచ్చి ఉధృతంగా కొట్టి అడ్డు తగులుతున్నాయి డెక్‌మీద స్థిరంగా నిలబడడం అసాధ్యం అయిపోయింది

తెల్లవారు ఝామున కల్లా గాలి మరింత పుంజుకుంది. పెనుగాలి వీచేలా తోచింది వాతావరణంలో అకస్మాత్తుగా మార్పులు వస్తున్నట్లు బరామీటరు సూచించింది అందులో పాదరసం, ప్రమాదసూచకంగా ఎగిరెగిరి పడసాగింది సముద్రం ఆగ్నేయాభిముఖంగా విజృంభిస్తున్నట్టు కనపడింది పెను తుఫాను విరుచుకుపడే వాతావరణం ప్రవర్తిల్లింది క్రితం పాయంత్రం వరకూ అంతా మామూలుగానే ఉంది సూర్యుడు మామూలుగా అస్తమించాడు ఎఱ్ఱటి బింబం

(61 వ పేజీ చూడండి)



# గృహజీవితంలో పురుషుడు

సంసారం జోడు గుర్రాలు పూన్చిన రథం వంటిది. భార్యా-భర్తలు అన్యోన్యం అర్థంచేసుకొని, సహకరించి వ్యవహరిస్తేనే గృహ జీవితం ఆనందదాయకం అవుతుంది. అట్లాకాక ఒకరిమీద ఒకరు విసుగు, చిరాకుచూపితే ఆ సంసారం నరకతుల్యం కాక ఏమవుతుంది? ఈ విషయాన్నే రచయిత్రి తమ వ్యాసంలో చక్కగా వివరించారు.

సి. కృష్ణకుమారి

"ఏమిటాగోల! పొద్దున లేచినప్పటినుండీ, రాత్రి పడుకోబోయేదాకా పిల్లలమీద అరుస్తూనే వుంటావ్! ఆమాత్రం పిల్లల్ని సముదాయించుకోవటం చేతకాదా? మళ్ళీ ఆడపుట్టుక " అంటూ దూర్వాసుడులాగా శపిస్తున్నాడు మా 'బాబాయి' 'పిన్ని' మీద

"అవును! మీకంతా గోలగానే వుంటుంది ఒక్కసారి ఈ బాధ్యత మీరు వహిస్తే నా బాధ తెలుస్తుంది మీకు ఎంతకీ మీ ఆఫీసు, రేడియో తప్ప, ఇతర విషయా లేమీ పట్టవ్! ఇంటెడు చాకిరీతోను, పిల్లల్తోను నేను సతమతమయిపోతుంటే నా బాధని అర్థంచేసుకునే దెవరు? ఇంత చేసినా సంతోషించే దెవరు? విసుక్కోవటం తప్ప మీకేమీ తెలియదు" అంటూ సమాధానమిస్తోంది పిన్ని

"అవునవును! ఆఫీసు పనిగాక, మగవాళ్ళిక వంట కూడ చేస్తే పాపం! మీ ఆడవాళ్ళు రాణీల్లాగాకూర్చుంటారు కాబోలు చాల్లే! ఆఫీసుపని అంటే అంత తేలికనుకున్నావా? అయినా నన్ను అంట్లు తోమమంటావా? ఇళ్ళు చిమ్మమంటావా? సంసారాన్ని సరిదిద్దుకోవటం చేతకాకపోతే సరి! ఎదురింటి సరోజ చూడు ఎంత తెలివిగలదో? అటు ఉద్యోగమూ, ఇటు సంసారమూ ఎంత నేర్పుగా, ఎంత ఓర్పుగా నిర్వహిస్తున్నదో?" అంటూ కళ్ళెర్రచేసి హుంకరించాడు మా బాబాయి

ఇంతలో మూడేళ్ళ పిల్లాడు ఏడుస్తూ తండ్రి కాళ్ళకు చుట్టేసుకుని తల్లి కొట్టిందని ఫిర్యాదు చెయ్యబోయాడు 'నోర్మూసుకో గాడిదా!' అంటూ అవతలికి నెట్టేసి వెనక్కు తిరిగాడు మా బాబాయి

పిన్నినీ,పిల్లల్ని చూసిపోదామని వాళ్ళింట్లో అడుగు పెట్టిన నేను దంపతుల వాగ్వివాదాలువిని ముందుకూ వెళ్ళలేక, తిరిగి వెనక్కూ వెళ్ళలేక యేం చెయ్యాలో తోచని పరిస్థితుల్లో నిలబడి పోయాను.

మా బాబాయి నన్ను చూసి నిర్ఘాంతపోయాడు మా పిన్ని కూడ తెల్లబోయింది. ఆతర్వాత తమాయించుకుని నన్నాహ్వానించా రాదంపతులు.

రాత్రికి నెమ్మదిగా పిన్నిని కదిపాను మధ్యాహ్నం జరిగిన గొడవ గురించి. అందుకావిడ సమాధానం ఇది. "ఈ గొడవలు మా ఇంట్లో మామూలేలేమ్మా! అసలు ఆడదాని బాధలు మగవాడు అర్థం చేసుకుంటే గాని సంసారంలో శాంతి లభించదు. ఇటు పిల్లల్తో, అటు పనితోను సతమతమయిపోతుంటానుకదా! ఆయన ఆఫీసుకెళ్ళేవాళ్ళకి వంటవ్వాలి. ఈ లోపల పెద్దపిల్లల్ని తయారుచేసి బడికి పంపాలి. ఒక్క క్షణం తీరదు. ఈ సందట్లో చిన్నపిల్లలిద్దరూ వంటఇంట్లోజేరి నానా అల్లరి చెయ్యటం, ఆపైన ఏదో వంకతో యేడుపులు లంకించుకోవటం జరుగుతుంది. ఈ గోలంతా వింటూ ఆయన విసుక్కుంటారు నాపైన. అంతేగాని, నేను పనిలో ఉన్నప్పుడు ఆ పిల్లల్ని కనిపెట్టి చూడరు. నా బాధ యెవరికి చెప్పుకునేది! నేనేం ఆయన్ని అంట్లుతోమమనిగాని, ఇళ్ళు చిమ్మమనిగాని అనేటంతటి హీనురాలినిగాను నేను ఒక్క క్షణం తీరిక లేకుండా పనిలో ఉన్నప్పుడు పిల్లల్ని ఆ మాత్రం కనిపెట్టివుండి, పలకరించ కూడదా? ఇదే నా బాధ. పైగా పిల్లలు గోల చేస్తుంటే కోప్పడకుండా, కొట్టకుండా ఎట్లా జరుగుతుంది? అందుకే ఆయన ఇల్లంటే నరకమని విసుక్కుంటారు పైగా" అంటూ బాధపడ్డది

నిజంగా మా పిన్ని పరిస్థితికి నాకు జాలేసింది ఆవిడకు ఐదుగురు పిల్లలు. అంతా ఏడాది, ఏణ్ణర్థం వారతోవున్న చిన్న పిల్లలే! వాళ్ళ పనన్నా వాళ్ళు చేసుకోలేరు పోనీ అంతా పని యెట్లాగో నెమ్మదిమీద తెముల్చుకోవచ్చని అనుకుంటే, బాబాయి ఆమె చేసిన ప్రతిపనిని వంకపెట్టటం,'ఇల్లు నరకం'అంటూ గోల పెట్టటం జరుగుతోంది

పిన్ని బాధని అర్థం చేసుకోని బాబాయిని చూస్తుంటే నాకు చాలా బాధనిపించింది

మగవారంతా మా బాబాయిలాంటివాళ్ళే అనను గాని, అంతాలో కొంతమంది మాత్రం అంతే ఇటువంటి వాళ్ళకు ఆఫీసు పని మాత్రమే తమ బాధ్యత అయినట్టు,అంతకన్నా సంసారంలో తమకు ఎటువంటి బాధ్యతలు లేవని వాదిస్తారు పైగా ఆడవాళ్ళ వంట పని చాలా తేలిక అయినట్లు, అందుచేత ఇంటి విషయాల్లో తాము కలగజేసుకోవలసిన అవసరం లేనట్లు మాట్లాడుతుంటారు

"మేం మగవాళ్ళం! కుర్చీలో కాలుమీద కాలేసుకుని కూర్చుంటేనే మా దర్జా!" అనుకుని కొందరు మగవారు బజారెళ్ళి కూరలు, వెచ్చాలు కూడ తేవటానికి ఇష్టపడరు అటువంటి సందర్భాలలో ఆడదే బజారు వెళ్ళవలసి వస్తుంది లేకపోతే ఎక్కువ ధరలతో ఇంటిదగ్గరే చిల్లరకొట్లలో కొనవలసి వస్తుంది లేదా వాకిలిముందుకు అమ్మవచ్చే వస్తువుల్నే కొనవలసివస్తుంది ఈ పద్ధతివల్ల (ఇళ్ళదగ్గర కొనేపద్ధతి) డబ్బు ఖర్చూ అధికం పైగా మంచిసరకూ లభించదు పోనీ ఆ ఇల్లాలే బజారెళ్ళి తెద్దామా అంటే అది పల్లెటూరుకాని బస్తీయే అవచ్చు స్త్రీలు బజారెళ్ళి వస్తువులు కొనే అలవాటు ఆ ప్రాంతాల్లో లేకపోవచ్చు అదీగాకపోతే ఇంట్లో పనితో తీరిక వుండకపోవచ్చు అందుచేతే మగవారు కొంచెం 'నామోషీ'ని, ఆపైన బద్ధకాన్ని కూడ వదులుకొని బజారెళ్ళి సరుకులుతెస్తే, ఇటు ఇల్లాలికి పని తప్పించిన వారవుతారు ఆపైన డబ్బును ఆదా చెయ్యటమేగాకుండా మంచి సరకూ లభిస్తుంది

ఇంటి బాధ్యత వహించటం అంటే, 'అంట్లు తోమమంటావా? ఇల్లు చిమ్మమంటావా?' అన్న బాబాయి మాటలు చాలా విపరీతంగా వున్నాయి భర్త ఇంటిబాధ్యత వహించటం అంటే అంట్లు తోమటంకాదు అర్థం ఆ పనిని భర్తకు పురమాయించటానికి యే భార్యా ఒప్పుకోదు కూడ ఇంట్లో తీరిగ్గా వున్నప్పుడు శలవు రోజుల్లో, భార్య పని హడావుడిలో వున్నప్పుడు కొంచెం పిల్లల్ని పట్టుకుందాం, వాళ్ళని పలకరించి ఆడిద్దాం! అనుకోవాలి

అంత మందమరుపవుతే ఎలాగండీ– మురనూ–
ఇదిగో ఇక్కడుంది–




పనిలోవున్న భార్య వచ్చి నీళ్ళుతోడితేనే స్నానం చేద్దాం అని పంతంపట్టే బదులు, వీలున్నంతమటుకు తమే స్నానాదులు పూర్తిచేస్తే బాగుంటుంది మీకొక చిన్న తోటే వుందనుకోండి! రోజూ ఆమే చెట్లకు నీళ్ళు పోస్తుంది ఒక్కొరోజు బద్ధకించవచ్చు చెయ్యి తీరిక లేక పోవచ్చు ఆవని తీరికుంటే మీరు చెయ్యకూడదు టండీ! మీ ఇంట్లో పనిమనిషిలేదు అనుకోండి! అప్పుడు మీ ఆవిడకు పనికూడ అధికంగా వుంటుంది అటువంటప్పుడు ఆమె ఖర్మానికి ఆమెను వదిలెయ్యక పోతే, నీళ్ళు తోడటంలాంటి ఘరానాపనులే మీరు చెయ్యొచ్చుగా!

పోనీ ఇంట్లో పనులు చెయ్యటం 'నామోషీ'యే అవొచ్చు మీ దృక్పథంలో అటువంటప్పుడు భార్య చేసే పనుల్లో అతిగా లోపాలు యెంచకండి! భార్య భర్తని ఎంతగా ప్రేమించి, భర్తకోసం, పిల్లలకోసం యెంతగా పాటుపడుతుందో, ఆమె భర్తనుండి కూడ అటువంటి ప్రేమనే కోరుతుంది ఆ సంద ర్భాలలో భర్త భార్యకి పనిలో సహాయపడనక్కరలేదు కేవలం సానుభూతితో, ప్రేమతో ప్రవర్తిస్తే చాలు అంతేగాని, చిటికీ మాటికీ భార్యపనిని ఈసడించు కుంటూ, 'ఇల్లు నరకం' అంటూ సాధిస్తుంటే ఆ ఇల్లాలి మనస్సెంతగా క్షోభిస్తుందో ఆలోచిస్తేతెలు స్తుంది అందుచేతే భార్యా—భర్తలమధ్య మన స్పర్థలు విపరీతంగా ప్రబలిపోతుంటవి

కొందరు మగ ... తమదేగాని ఇంట్లో పెళ్ళాం—బిడ్డల సంగతి అసలు పట్టించుకోరు ఎంతకీ ఆ వున్న డబ్బుతో తమ హోటలు ఖర్చులు, సినిమాఖర్చులే చూసుకుంటారుగాని భార్య మాట ఆలోచించరు ఆమె రెండే రెండు చీరెల్తో బాధ పడ్తూ వుంటుంది పిల్లల బట్టలు చిరిగిపోతయ్యి స్కూళ్ళకు జీతాలు కట్టాలి అయితే, ఈయనగారు మాత్రం నోట్లో కిళ్లీ బిటాయించి దర్జాగా తిరుగు తాడేగాని తనఖర్చు లేమాత్రం తగ్గించుకోడు ఒక వేళ ఆ భార్య కొంచెం గడుసరిదేఅయి ఆయనమీద ఎదురు తిరిగితే, ఆబాధ పడలేక యే అప్పో—సొప్పో చేసి ఇంట్లో అవసరాలు గడుపుతాడు ఆతర్వాత గండం కూడ భార్యకే ఆయన అప్పులు తీర్చకపోతే, అప్పులవాళ్ళంతా ఆవిడమీదకే దండయాత్రచేస్తారు వాళ్ళకు సమాధానం చెప్పేటప్పటికి ఆమెఅవస్థ దేవుడికే తెలియాలి అందుచేత మగవారు తమ ఆదా యాన్నిబట్టికూడ ఖర్చులు పెట్టాలి ఒకవేళ భార్యవల్లే దుబారా జరుగుతుంటే ఆమెను సరిదిద్ద వలసిందే!

ఒక అల్లుడు అనుకుంటాడు ఇకనుంచీ తన బాధ్యతా, తన భార్య బాధ్యత కూడ మామగారే వహిం చాలని భార్యకు కావలసిన బట్టలూ—అవీ కూడ మామగారే యేళ్ళతరబడిగా కొనివ్వాలి అట్లా కాకపోతే, భార్యని బాధిస్తాడు కాని! ఒక చిన్న మాట మగవారు భార్యనీ, పిల్లల్నీ పోషించుకునే శక్తి లేన ప్పుడు పెళ్ళిళ్ళుచేసుకోవటం మానుకోవటమే ఉత్తమం అంతేగాని, పెళ్ళయ్యాక కూతురి బాధ్య తతోపాటు అల్లుడి బాధ్యత కూడ మామగారే వహిం చాలి అనుకోవటం కేవలం ఆ అల్లుడి నీచత్వానికి నిద ర్శనం

మరికొందరు మగవారి మనస్తత్వం చాలా విచిత్రం. పిల్లల్ని ఉత్తప్పుడు చాలా ప్రేమగా చూస్తారు కాని వాళ్ళు యేడ్చినప్పుడు దగ్గరికైనా రానివ్వరు జబ్బు చేసినప్పుడు మందన్నా తెచ్చివ్వరు ఆ బాధ్యతంతా 'స్త్రీ'దే అని వాదిస్తారు పిల్లలు సరిగ్గా చదువు కుంటున్నదీ, లేనిదీ, బడికి క్రమంగా వెళ్తున్నదీ లేనిదీ కూడ కనుక్కోని సందర్భాలలో పిల్లల భవి ష్యత్తు నాశనమవుతుంది తండ్రిభయంలేని పిల్లలు తల్లిని లెక్కచెయ్యరు

అందుచేతే సంసారంలో ఒక్క డబ్బు సంపాదిం చటమేకాదు, సంసారం యొక్క మంచీ—చెడులు కూడ పరిశీలించే బాధ్యత కూడా భర్తది భార్య నిర్వహించే బాధ్యతను అజమాయిషీచేసి ఆ బాధ్యత భార్య సక్ర మంగా నిర్వహించేటట్లు చెయ్యటం కూడ భర్త బాధ్యతే సంసారశకటానికి స్త్రీ పురుషు లిద్దరూ రెండు చక్రాలు ఏ ఒక్క చక్రానికి బాధ్యత ఎక్కువైనా, బీటవారినా ఆ బండి నడవటం కష్టం అందుచేతే 'స్త్రీ' అయినా తలకుమించిన బాధ్యతను నిర్వ హిస్తే జబ్బులపాలవుతుంది

కాలంతోపాటు మన పద్ధతుల్లోను కొంత మార్పు అవసరం ఇందిరాగాంధి ఏమని చెప్పారు! పురు షులు కూడా వంట నేర్చుకుని వుండాలని చెప్పలేదూ! (భయపడకండి! ఆడవాళ్ళు మగవారిచేత వంట చేయించేటంతటి పరిస్థితులు రాకూడదనే నా ఉద్దే

# గృహ జీవితంలో పురుషుడు

శం.) కొంతమంది మగవారికి తమ భార్య ఉద్యోగం చెయ్యాలని వుంటుంది నానా శ్రమపడి భార్యకు ఒక ఉద్యోగం సంపాదించిపెడ్తాడు భర్త అంతటితోనే అతని బాధ్యత తీరిపోతుంది అంతూ దరీలేని ఇంటిపనితోను, ఆఫీసుపనితోను ఆమె హైరాన పడుతుంది. ఆ భర్త మాత్రం బొత్తిగా కలగజేసుకోడు అట్లాగాకుండా భర్తకూడ ఇంట్లో వున్నప్పుడు 'సరదా' క్రిందే తీసుకుని చిన్న చిన్న పనులు చేసిపెడ్తే బాగుంటుంది అట్లా ఆలుమగలు పరస్పరాభిప్రాయాల్ని అర్థంచేసుకుని ప్రవర్తిస్తే దంపతులమధ్య విభేదాలకు తావుండదు అట్లా గాకపోయినప్పుడు యేనాడో ఒకనాడు వారి మధ్య అగాధాలు యేర్పడుతవి

మా స్నేహితురాలు సరోజ, ఆమె భర్తా ఇద్దరూ వుద్యోగాలు చేస్తున్నారు ఆయన సరోజకు ఇంట్లో అంతో—ఇంతో సహాయం చేస్తాడు సరోజవంటపనిలో వున్నప్పుడు పిల్లల్ని వంటఇంట్లోకి పోనివ్వకుండా కబుర్లుచెప్పి నవ్విస్తాడు తను స్నానం చేస్తూ, పిల్లల్ని కూడా స్నానం చేయిస్తాడు తను ఆఫీసుకెళ్తూ, పిల్లల్ని బడిదాకా దింపి వెళ్తాడు ఇట్లా ఇంటా—బయట కూడ బాధ్యతతో ప్రవర్తించి 'మగవాడు' లేకపోతే ఆడదానికి ఒక్క నిమిషంకూడ జరగదు అనిపించేటట్లు ప్రవర్తించే మగవారు యెంతోమంది ఉన్నారు లటువంటివాళ్ళకు నాజోహార్లు అర్పిస్తున్నాను 'మగవాడు' అంటే 'ఆఫీసు మనిషి మాత్రమే' అనుకునే మగవారి ధృక్పథంలో రవ్వంత మార్పు గోచరిస్తుందేమోననే సత్సంకల్పంతోనే ఈ వ్యాసం వ్రాశాను. యేమీ అనుకోరుగా!

ఆఫీసు పనులు యెక్కువగా వున్నప్పుడూ, తీరిక లేనప్పుడూ మగవాళ్ళు ఇంట్లో బొత్తిగా బాధ్యత వహించటంలేదని స్త్రీలు వాపోకూడదు. సమయా సమయాలనెరిగి భార్య, భర్తకి అధికమైన బాధ్యత (అంటే ఆఫీసు పనిగాక, ఇంటి బాధ్యత)ను వప్పగించాలి విశ్రాంతి సమయాల్లో భర్త కూడ ఇంట్లో తనకుగల ఇతర బాధ్యతలను నిర్వహిస్తుండాలి. ఉదా — పిల్లల చదువునుగురించి శ్రద్ధ తీసుకోవటంలాంటివి అప్పుడే, 'సంసారం అంటే నరకం' గాకుండా 'గృహమేకదా స్వర్గసీమ' అని హాయిగా పాడుకోవచ్చు ★

సుశీల:- రాధా రాత్రి ఎంత వరకు చదివినావు.

రాధ:- నిద్రవచ్చేంతవరకు.

దేశాయి వెంకటేశం (హైదరాబాదు)



## శిరోజాలంకరణ

1



2



3





దిండుగలీబులకు డిజైనులు

బి. పద్మావతి (నెల్లూరు)

సి. రాధ (హైదరాబాదు)

# మగవారి వ్యసనాలు : మగువల పాట్లు

**"పిల్లలకు పుస్తకాలు లేకపోయినా భార్యా ఒక్క చీరతో అవస్థపడుతున్నా ఇస్త్రీగుడ్డల మడత రేగకూడదు; రోజుకు అర డజను కప్పులకాఫీ, అరడజను సిగరెట్ పెట్టెలు మాత్రం తప్పవు" అంటారు రచయిత్రి వ్యసనాలకు బానిసలైన కొందరి విషయం ప్రస్తావించి. ఇల్లు, ఒళ్లు గుల్లచేస్తాయి వ్యసనాలు. వ్యసనలోలుడైన వ్యక్తి ఆత్మగౌరవాన్ని కూడా సరకుచేయడు.**

"మగవారికేనా ఏమిటి వ్యసనాలు, ఆడవారికి మాత్రం లేవా?" అంటాడు మా వాసు.

కాని నేను ఒప్పుకోను. మగువలకు వ్యసనాలు ఉన్నా అవి మగవారి వ్యసనాల వంటి తీవ్రమైనవీ కావు, ప్రమాదకరమైనవీ కావు.

చీట్లపేక, త్రాగుడు, జూదం, సిగరెట్లు కాల్చడం నవనాగరీకుల లక్షణం. వీటిని వ్యసనాలన్నవాళ్లు శుద్ధ తెలివితక్కువవా రన్నమాట."

విందులలో, మీటింగులలో సిగరెట్లు అందివ్వడము ఒక ఫేషన్ అయిపోయింది. సిగరెట్లు కాల్చనివాడు పాతకాలపు వాడి క్రింద జమే నన్నమాట. విదేశీ సిగరెట్ పాకెట్లు రోజుకి అర డజను తగులబెట్టే మహానుభావులు 'ఆడవాళ్ళ ఉత్త దుబారా' అంటారు. అక్కడికి వెళ్లేదో మహా పొదుపుచేసి వెలగబెట్టినట్లు. ఆ కాల్చి పారేసేవి కూడ విదేశాలవైతే గౌరవ మెక్కువ. ఇంట్లో పెళ్లాం ఒక్క చీరతో అవస్థపడుతూ ఉన్నా, పిల్లలకు పుస్తకాలు లేకపోయినా సరే, ఇస్త్రీ గుడ్డల మడత రేగకూడదు, రోజుకు అర డజను కప్పుల కాఫీ, అరడజను సిగరెట్ పెట్టెలు మాత్రం తప్పదు.

పేకాట ఆడటం ఇంకా కొంచెం నాగరీకం. పేకాట నిషేధంలో ఉన్నా క్రియ మాత్రం శూన్యం. అసలు పేకాట ఆడేవారిని పట్టుకొనేదెవరు? పట్టుకోవలసిన పోలీసులు చెట్లక్రింద ఆడితే, శిక్ష విధించవలసిన జడ్జీలు క్లబ్‌లలో ఆడుతూ ఉంటారు. అందులో ఈ క్లబ్‌లలో ఆడే మహాశయులంతా సంఘంలో పెద్ద మనుష్యులు. ఒకరు లాయరైతే, మరొకరు డాక్టరు.

'నీ పెళ్లాం చచ్చిందిరా' అంటే 'మా బావమరిది ఉన్నాడుగా కొరివి పెడతాడులే' అన్నాడట ఒక మహా పేకాటగాడు. ఇట్లా ఉంటాయి వీళ్ల పెడబుద్ధులు. ఇటువంటివారు పెళ్లాం బిడ్డలను గురించి కొంచమైనా ఆలోచించరా? వాళ్లకూ హృదయమంటూ ఒకటి ఉంటుందని ఎందుకనుకోరు? ఏ స్త్రీ తన భర్త రాత్రింబవళ్లు పేకాట ఆడుతూ కూర్చుంటే సహిస్తుంది?

చదువుకొని కొంచెం తెలివిగలవారైతే భర్తను అడ్డుపెడతారు. ఇక ఇంట్లో రోజా కీచులాటలు. దెబ్బలాటలే. సంసారము నరకంలా తయారవుతుంది. చదువుకొనని స్త్రీ అయితే భర్తను ఎదిరించలేక ఇటు సహించలేక కుళ్లి కుళ్లి తనలో తానే

## కె. లీలాశంకర్

ఏడుస్తుంటుంది. కాని ఏమి లాభం? వాళ్ల పని వాళ్లదే. ఇటువంటివారంతా సంఘానికి చీడ పురుగులంటి వారు. ఈ పాడు వ్యసనాల మూలంగా ఎన్ని పచ్చని సంసారములు మంట కలుస్తున్నాయో చెప్పలేము. ఇంటి ఖర్చులకు పెళ్లాం డబ్బులడిగితే విసుక్కునే మహానుభావులు తమ వ్యసనాలకు వందలు ఖర్చు పెడతారు.

ఇక త్రాగుడు సరేసరి. "ఏవ రానందం వారిది. మాకు దీంట్లోనే ఆనందం ఉంటుంది. అదీ తప్పేనా! ధర్మరాజంతటివాడే పిచ్చిలో పడిపోయాడు. ఇక మన మొక లెక్కా" అంటూ మెట్టవేదాంతాలు చెబుతారు. అవును, ఆ నిషా మహత్యం అటువంటిదే. కాని మనం సంఘజీవులం. సంఘానికి కట్టుబడి ఉండాలి. మన ఆనందం కొరకు ఇంకొకరిని బలిచేయడం న్యాయం

(46 వ పేజీ చూడండి)

శాస్త్రిగారు 5 వేల రూపాయలకు ఇన్సూరెన్సు చేయడానికి అంగీకరించారు. వెంటనే ఏజంటు, దరఖాస్తు ఫారము చేతికిచ్చి పూర్తి చేయమన్నారు.

శాస్త్రి కొంచెము ఆలోచించి "ఈరోజు మంచిరోజు కాదండి అష్టమి", అన్నారు.

"అలాగైతే మీరు యీ రోజే చేయవలసిన అవసరము ఎంతైనా వుంది" అన్నాడు ఏజంటు.

—పి. కామాక్షమ్మ (నెల్లూరు)

## చోళీ డిజైనులు





బొమ్మలు : దేవకి.



' చిన్నమాట సెలవీవమ్మా

ఫోటో . ఎన్. రామకృష్ణ

కాదు. అటువంటివారు పెళ్లి చేసుకోకుండా ఉంటేనే బావుంటుంది. ఇష్ట మొచ్చినట్లు ఆడినా అడ్డుపడేవా రుండరు.

అంతా ఇటువంటివారేనా, మంచివారు లేరా ? అని అంటారేమో. లేరని నేను అనడంలేదు. స్త్రీలూ మనుష్యులేనని వారి భావాలను,

## మగవారి వ్యసనాలు ...

(44 వ పేజీ తరవాయి)

ఆదర్శాలను అర్థం చేసుకుని సంసారాలను స్వర్గ తుల్యం చేసుకొనే మహానుభావులు లేకపోలేదు. అటువంటి వారికి చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

'ఎప్పుడూ వనితా లోకంలో మగవారిని దుయ్య బట్టడమేనా ?' అని విసుక్కునే మగువలు లేక పోలేదు. "విసరగా విసరగా ఒక్క రాయున్నా తగలక పోతుందా !" అన్నట్లు చదవగా, చదవగా ఒక్కరి మనసన్నా మారక పోతుందా ! అనే ఉద్దేశ్యంతో రాస్తున్నాను. ★



# వనితా వాణి

## ఆడవారు-ఆడంబరాలు

29—3—61 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో మోచర్ల సుబ్బలక్ష్మిగారు వ్రాసిన 'వివాహాలలో ఆడవారూ—ఆడంబరాలూ' అను వ్యాసం చాల బాగున్నది. రచయిత్రి చెప్పినట్లు వివాహం ఆడంబరంగా జరుగుతున్నంతసేపూ ఆహా ... ఇటువంటి పెండ్లి ఎక్కడ చూడలేదని కొనియాడిన వారే, పెండ్లి అంత ఘనంగా చేసినవారు కష్టపడుతున్నప్పుడు అంత ఒళ్ళు తెలియకుండా ఖర్చుచేయడ మెందుకని హేళన చేస్తారు. అసలు ఈ రోజులలో వరకట్నమే మనుష్యుల్ని పీక్కుతింటుంటే పైగా ఈ ఆడంబరాలకు పోయి, ఇల్లు గుల్ల చేసుకోవడమే గాని మరేమి లాభముండదు.

కుమారి సౌదామిని (దర్శి)

* * *

మోచర్ల సుబ్బలక్ష్మిగారు వ్రాసిన "వివాహాలలో ఆడవారూ—ఆడంబరాలు" వ్యాసం చాల బాగుంది. వివాహ సందర్భంలో మగవారి కంటె ఆడవారే చాల అడంబరం చేస్తారు ప్రస్తుతం జరిగే వివాహాల గురించి చక్కగా వ్రాసినారు. ధనవంతులు ఎంత ఆడంబరం చేసినా ఫరవాలేదు. గాని, ఎటొచ్చి మధ్య తరగతి వారికే కష్టము. రచయిత్రికి నా ధన్యవాదాలు.

వి. లీలావతి (బళ్ళారి—2)

* * *

నేటి వివాహాలలో స్త్రీల ఆడంబరాలను కొన్నింటిని ఒకటొకటిగా పేర్కొని విమర్శించిన మోచర్ల సుబ్బలక్ష్మిగారి వ్యాసం నన్నెంతో ఆకర్షించింది. వివాహాలలో అమితంగా ధనవ్యయ మయ్యే ఈ ఆడంబరాలను, లేనిపోని గొప్పలను విధిగా స్త్రీ, పురుషులు మానుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

జి. ఎల్. కుమారి (భువనేశ్వరం)

* * *

## స్త్రీ ధర్మం-స్వాతంత్ర్యం

శ్రీమతి మతుకుమల్లి సుశీలగారు 22—3—61 ఆంధ్ర వారపత్రికలో వ్రాసిన స్త్రీ ధర్మం, స్వాతంత్ర్యం అను వ్యాసము చాలా చక్కగా ఉన్నది. తల్లి బాధ్యతలను బాగా వివరించారు. కొందరు భర్తలు భార్యలు చదువుకొనివారైతే, వారితో ఏమి మాట్లాడవలెనని బయటికి వెళ్ళిపోతారని వ్రాసారు. కాని చదువుకున్న భార్య యున్నవారు కూడా ఇంటి పట్టున ఉండకుండా ఎప్పుడూ స్నేహితులనే పట్టుకుని తిరిగి తిరిగి రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చే వారిని నేను నా కళ్ళారా చూచాను, చూస్తున్నాను. వీరికి పెళ్ళైనా తమ కార్యక్రమం తప్పదు.

అలాగే చదువురాని భార్యలున్నా వెళ్ళి ఆఫీసు పని చూచుకొని కొంతసేపు స్నేహితులతో గడిపి, కొంతసేపు భార్య, పిల్లలతో గడిపేవారిని కూడా చూస్తున్నాను. ఇది వారివారి స్వభావాలను బట్టి ఉంటుంది గాని, విద్యవల్ల వచ్చేది గాదని నా అభిప్రాయం.

ఇంకొక సంగతి. "తీరిక సమయాలలో కుట్లు, చేతిపనులు మొదలయినవి చేసుకుంటూ కాలం గడపాలనే దృక్పథం మారితే కొంతవరకూ పురోగమించా మనుకోవచ్చు" అని వ్రాశారు. దీనివల్ల వారికి ఈ పనులలో ఎక్కువ ఆసక్తి లేదేమోనని నేను అనుకుంటున్నాను కాని యివి మన చేతితో మనము తయారుచేసినవి చూచినప్పుడు కలిగే ఆనందం ఎవరికి వారు అనుభవించవలసినే గాని చెప్పుటకు వీలులేదు.

అ. శకుంతలాబాయ్ (సికింద్రాబాదు)

* * *

## 'అయినవారూ-కానివారూ'

వనితాలోకం శీర్షిక రానురాను మరీ ఆకర్షణీయంగా ఉంటోందంటే, ఆ ఘనత (మా) వనిత లదే అని చెప్పుటలో అతిశయోక్తి లేదు. 15—3—61 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని "పద్మ" గారి వ్యాసం ఏమాత్రం బాగా లేదు. అందుకు చాలా విచారిస్తున్నాను కూడా. ఆడపిల్లలు ఉద్యోగం చేయుడం (అంత) మంచిది కాదన్న మాచన మాటకి మారుపోళ్ళ నిజం. కాని పద్మగారి జవాబులేని అర్థమేమిటో వారు పత్రిక ద్వారా తెలుపుతారని ఆశిస్తాను.

భారతదేశ స్త్రీలు ఎన్నివిధాల అభివృద్ధిలోకి వచ్చినా, ఎంత స్వాతంత్ర్యము గడించినా, పాశ్చాత్య దేశపు స్త్రీలు మాదిరి మెలగుట (ఉద్యోగం చేయుటం కానివ్వండి, మరి యింకా ఆడవారు చేయరానివి ఏమైనా కానివ్వండి) ఎంత కష్టమో అన్న సూక్తిని మనస్సులో ఉంచుకుని మరి వారి ఉద్దేశ్యము పత్రిక ద్వారా తెలుపగలరని ఆశిస్తూ ఉన్నాను.

కె. సి. లక్ష్మి (హైదరాబాదు)

* * *

## పసుపునూనె ప్రభావం

1—2—61 వారపత్రికలో నారి సూర్యరత్నంగారు నిత్యము పసుపు నూనె వాడుటవలన మొఖము మెరుగుగా ఉంటుందని వ్రాశారు. ఆ ప్రకారము నేను 20 రోజులు చేసేటప్పటికే విపరీతమైన వేడిచేసి కళ్ళ మంటలు, నీరు కారటం, ఎర్రబడి జ్యోతుల్లాగా అయినవి. డాక్టరుగారికి చూపించాల్సిన పరిస్థితి ఏర్పడింది. 4 రోజులు జాగ్రత్తగా మందు వాడిన తరువాత ఇప్పుడు కొంచెము తగ్గినవి.

వి. కమల (వరహాపురం)

★

## అన్నపూర్ణను వచ్చిన తిప్పలు

ఒక వూరిలో ఒక పండితుడు వుండేవాడు. ఆయనకు ఒక కుమార్తె వుండేది. ఆమె పేరు అన్నపూర్ణ. అయితే పండితుడు ముద్దుగా "అన్నం" అని పిలిచేవాడు. ఒకరోజున ఒక బాటసారి ఆకలి గొనివచ్చి అయ్యా! 'అన్నం పెడ్తారా' అని అడిగాడు. పండితుడు జాలి గొని వెంటనే ఏమే "అన్నం వుందా" అని అడిగేడు. వంట యింట్లో వున్న ఆమె అల వాటులో పొరబాటు అన్నట్లు లేదండీ ఇప్పుడే బడికి వెళ్లింది అని జవాబు చెప్పింది. ఈ మాటలు వింటున్న బాటసారి నిర్ఘాంతపోయాడు.

జి. వి. సరోజనీదేవి (కొత్తపేట)

వంరి! పూర్వకాలంలో రాజులుండే వారుకదా! వారి దగ్గర మంత్రులు, సామంతులు, సేనానాయకులు, అందరూ వుండేవారు.

అంతే కాదు! కవులు, గాయకులు, కూడా వుండేవారు. భోజరాజు ఆస్థానంలో కూడా ఎంతో మంది కవులు, గాయకులు బోల్డు బోల్డు మంది వుండేవారు.

భోజరాజు కూడా పండితుడు. కవులను సన్మానించే వాడు. పద్యం చెప్పిన ప్రతికవికీ అక్షర లక్షలిచ్చి గౌరవించేవాడు. అప్పుడప్పుడూ తను సమస్యల నిచ్చి ఇతరులను పూరించమనేవాడు. పూరించినవారికి అగ్రహారముల నిచ్చి సత్కరించేవాడు.

అతని ఆస్థానములో రత్నాల వంటి కవు లుండేవారు. ఆరోజు సభా మండపం కిట కిట లాడుతూంది.

వారివారి స్థానాలలో మంత్రులు, సామంతులు, సేనానాయకులు, మొదలగు వారు కూర్చుని ఉన్నారు. సభామంటపం కన్నులపండుగగా అలంకరించబడి ఉంది.

ఎత్తుగా వున్న వేదికపై రత్నఖచిత సింహాసనము ఖాళీగా వుంది. వజ్రాలతో వైడూర్యాలతో ధగ, ధగ, మెరిసి పోతూంది. దానికిరు ప్రక్కలా వింజామరలు పట్టుకుని ఇద్దరు పరిచారికలు నిలబడి వున్నారు.

ఇంకా రాజు రాలేదు.

అందరూ భోజరాజుకోసం నిరీక్షిస్తున్నారు.

ఇంతలో మంగళవాద్యాలు వినవచ్చాయి. వంది మాగధులు రాజును పొగుడుతూ రాగా, భోజరాజు ఆ సభామంటపంలోకి ప్రవేశించాడు.

"శ్రీ శ్రీ శ్రీ భోజమహారాజులకు జై" అన్న కేకలతో సభామంటపం గోడలు ప్రతిధ్వనించాయి.

భోజరాజు ఠీవిగా కత్తిపై చేయుంచి, చరాచరా రత్నకంబళిపై నడుచుకుంటూ వచ్చి, వేదిక నెక్కి, సింహాసనాన్ని అలంకరించాడు.

అందరూ కూర్చున్నారు.

భోజరాజు సభ నంతటిని కలయ చూచాడు. అతని కళ్ళు దేనో్న వెతుకుతున్నాయి. చిరునవ్వుతో అమాత్యులవైపు తిరిగి "మంత్రి

## ఆమంచర్ల కృపానిధి

వర్యా! కవి కాళిదాసుగారు రాలేదా?" అని ప్రశ్నించాడు.

"ఇంకా రాలేదు ప్రభూ. వర్తమానం పంపాము. రావచ్చు." అని మంత్రిగారు జవాబు చెప్పారు.

కొంత సేపు ఆలోచనలో పడ్డాడు రాజు.

తర్వాత సభ నంతటిని కలయ చూచి, చిరునవ్వుతో ఇట్లన్నాడు - "అందరూ వచ్చారు. కానీ కాళిదాసుగారు మాత్రం రాలేదు. ఆయన వచ్చేంతలో మీకో సమస్య నిస్తాను. జవాబు చెప్పండి చెప్పగలరా?"

"చెప్పండి ప్రభూ!" అన్నారు అందరూ.




భోజరాజు ఏం సమస్య ఇస్తాడో అందరి మనస్సులు ఉరకలు వేస్తున్నాయి. అందరూ ఆత్రుతతో వున్నారు.

"చెప్తాను" అంటూ ఈ విధంగా రాజు వారిని ప్రశ్నించాడు.

"ప్రపచంలో ఎవరికీర్తి ఎక్కువగా నాలుగు దిక్కులా వ్యాపిస్తుంది. రాజుదా? లేక కవిదా? ఇద్దరిలో ఎవరు గొప్ప?" సభ అంతా నిశ్శబ్దమయింది.

ప్రశ్నను విని అంతా నిశ్చేష్టులయినారు.

"ఏం చెప్పలేరా? మంత్రివర్యా! మీరు?" భోజరాజు కంఠం ఖంగుమంది. ఆయన ముఖంలో చిరునవ్వు తాండవిస్తూంది. ఒక్కరూ నోరు కదపలేదు.

సమాధానం మాత్రం ఏమని చెప్తారు? ఏదిచెప్తే ఏమవుతుందో? అని అందరి భయం.

భోజరాజు పకపకా నవ్వాడు. అతని తలపాగాకున్న ముత్యాల హారం అటూ, ఇటూ, వూగులాడింది.

"ఏం! మీకు ప్రశ్న అర్థం కాలేదా? అయితే మరొక్కసారి చెప్తున్నాను. ఈ ప్రపంచంలో ఏవరికీర్తి ఎక్కువ వ్యాపిస్తుంది. రాజుదా? లేక కవిదా? ఇద్దరిలో ఎవరు గొప్ప?" అన్నాడు భోజరాజు తిరిగి.

"ఇంత మందిలో ఒక్కరూ చెప్పలేరా?" భోజరాజుకంఠంలో హేళన ధ్వనించింది.

"ప్రభూ! ఎందుకు చెప్పలేరు! నేను చెప్తాను దానికి జవాబు." అంటూ ఒక కంఠం వినవచ్చింది.

సభా మంటపం ద్వారం వద్ద చిరునవ్వుతో నిలబడివున్న కాళిదాసు వైపు అందరూ తిరిగారు.

భోజరాజు ముఖం వికసించింది.

"దానికి జవాబు నేచెప్తాను ప్రభూ!" అంటూ గబగబా నడుచుకుంటూ తన ఆసనాన్ని అధిష్ఠించాడు కాళిదాసు.

అంతవరకు జవాబు చెప్పలేని స్థితిలో వున్న మంత్రిగారు, ఇతరులు "అబ్బ" అని నిట్టూర్చారు.

"విన్నావు కదా నా ప్రశ్న?" అని ప్రశ్నించాడు, భోజరాజు కాళిదాసును.

"ఆఁ!" అన్నాడు, కాళిదాసు. "జవాబు కూడా చెప్పగలను అనుమతిస్తే"

"త్వరగా చెప్పవయ్యా" అన్నాడు. అతని కంఠంలో వినయం తొణికిసలాడుతూంది.

కాళిదాసు నిల్చున్నాడు. పైపంచెను సరిచేసుకుని భోజరాజు వైపు తిరిగి "ప్రభూ! ఏదైనా తప్పు చెప్తే మన్నించండి" అన్నాడు.

అందరు, భోజరాజు కూడా ఎంతో ఆత్రుతతో కాళిదాసు సమాధానం కొరకు వేచియున్నారు.

అప్పుడు కాళిదాసు కంఠం ఖంగుమంది.

"ప్రభూ! నిశ్చయంగా కవియొక్క కీర్తే నాలుగు దిక్కులా వ్యాపిస్తుంది. రాజుయొక్క కీర్తి వ్యాపించినా అదిఅతని రాజ్యంలోనే. మీరడిగిన దానికి ఇదే సమాధానం. క్షమించండి."

అందరూ కాళిదాసు చెప్పిన సమాధానానికి ఆశ్చర్యపడ్డారు.

"ఔరా!" అంటూ ముక్కున వేలేసుకున్నారు.

రత్నాల పీటపై వున్న కాలును క్రిందపెట్టాడు భోజరాజు. లేచి నిల్చున్నాడు. అతని ముఖంలోని చిరునవ్వు మాయమయింది.

## కవి - రాజు

"ఆఁ!" కవిదా? పొరబడుతున్నారు కవివర్యా! ఎప్పటికీ రాజుదే. తెలిసే చెప్తున్నారా?" అన్నాడు.

"దీనిలో పొరపాటేమీ లేదు ప్రభూ. నిశ్చయముగా కవియొక్క కీర్తి రాజుకంటె యెక్కువగా నాలుగు దిక్కులా వ్యాపిస్తుంది."

"ఆఁ! ఎంతధైర్యం! మమ్మల్నే ధిక్కరిస్తావా? ఛో! ఇక నీ ముఖం నాకు చూపకు!"అన్నాడు కోపంతో భోజరాజు.

కాళిదాసు నవ్వుతూ అన్నాడు: "పోతాను. ప్రభూ! అసలు జవాబు చెప్పడం నా తప్పు. కానీ ఏం చేస్తాం. ప్రభూ! నీరు పల్లమెరుగునట్లు నిజము, దేముడే కాదు, అందరూ తెలిసికుంటారు. ఇదో పోతున్నాను. కానీ కాళిదాసును మరువకండి" అంటూ కాళిదాసు తనువున్న స్థానం వదిలి చకాచకా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

జరిగినదంతా నోరు తెరుచుకుని చూస్తున్నారు అందరూ.

"ఎంత ధైర్యం" అనుకున్నారు. "భోజరాజు తొందరపడ్డాడేమో" అని అనుకొన్నారు కొందరు.

ఆ రోజుకు సభ చాలించి కోపంతో వేదిక దిగి గబగబా తన మందిరం వైపు వెళ్ళిపోయాడు భోజరాజు. వారం రోజులు గడిచాయి.

కాళిదాసు ఆవూరు విడిచి పోయినట్లు భోజరాజుకు వర్తమానం అందింది. ఇది విని భోజరాజు చాలా బాధపడ్డాడు. అన్యాయంగా తను కాళిదాసును అవమానించాడే! అతనుమాత్రం తప్పేమి చెప్పాడు? తనడిగిన దానికి జవాబు కదా చెప్పినది. తనకంత కోపం ఎందుకు రావాలి? కాళిదాసు చెప్పిన దాంట్లో నిజముండకపోదు.

ఈ విధంగా భోజరాజు బాధపడేవాడు. భోజనం చేస్తున్నా, పడుకున్నా, ఉద్యానవనంలో విహరించినా ఇదే ఆలోచన తను కాళిదాసును అవమానించాడేమోనని. రాజకార్యాలలో అశ్రద్ధవహించాడు. ఎవరితోనూ మాట్లాడ్డం మానేశాడు.

ఒకరోజు మంత్రి రాజు నడిగాడు రాజు విచారానికి కారణం. ఇక భరించలేక భోజరాజు మంత్రితో అంతా చెప్పాడు.

మంత్రి ఇదంతా మొదటనే వూహించాడు. నవ్వుకున్నాడు. భోజరాజు మంత్రితో, "మంత్రిగారూ! అన్నిచోట్లకు సేవకుల్ని పంపించి కాళిదాసును వెతికించి తీసుకురండి. ఆయనకు తీరని అపకారం చేశాను. ఆయనను క్షమా

### 'బాడిగ'

"మా ముగ్గురికీ కలిపి ఎంత పుచ్చుకుంటా'వని అడిగాడు తనభార్య,ఒక పిల్లవాడితోనూ రిక్షా ఎక్కబోతున్న ఒకాయన. "మీ ఇద్దరికీ కలిపి అర్ధ రూపాయి. పిల్లవాడికి ఛార్జి ఏమీలేదు." రిక్షాలాగేమనిషి జవాబిచ్చాడు. "అయితే మేమిద్దరం నడిచివస్తాం.మావాడిని మాత్రం తీసుకురా" అన్నాడా పెద్దమనిషి.

కృణ అడగనిదే నాకు శాంతిలేదు." అన్నాడు ఆ వేదనతో.

"చిత్రం" అన్నాడు మంత్రి.

మంత్రి నలుదిక్కులా సైనికుల్ని పంపాడు. కాళిదాసు కోసరం ఊరూరు గాలించారు. కానీ కాళిదాసు ఎక్కడా కనపడలేదు.

ఇది విని ఇంకా విచారించాడు భోజరాజు. ఆఖరికి ఒక రోజు మంత్రితో, "మంత్రిగారూ! ఇక ఏం లాభంలేదు. నేనే పోతాను. నేనే కాళిదాసును వెతికి తెస్తాను" అన్నాడు. "వద్దు ప్రభూ! మీరు పోతే ఇక్కడ ఎట్లా" అన్నాడు మంత్రి. "నామాట కాదనకండి. నే వచ్చేంతవరకు రాజ్యాన్ని కాపాడండి. వస్తే కాళిదాసును తీసుకుని వస్తాను. లేకుంటే భోజరాజు లేడనుకోండి."

భోజరాజు పట్టినపట్టు విడువడని మంత్రికి తెలుసు. ఒక రోజు ఎవరికి తెలియకుండా మంత్రి ఆజ్ఞననుసరించి ఒక సామాన్యుడి వేషంలో బయలుదేరాడు భోజరాజు. కొంత డబ్బు మూటకట్టుకున్నాడు.

ఊరూరు తిరిగాడు.

ప్రతీ ఊరులోను ఆగేవాడు. అక్కడ ఎవర్నయినా అడిగేవాడు, "భోజరాజు మంచివాడా" అని. "ఆయనా! ధర్మప్రభువులు". అనగానే భోజరాజు ఆనందపడేవాడు. కాళిదాసు పొరబడ్డాడేమో అనుకున్నాడు.

అక్కడనుండి వేరే ఊరుకు పోయేవాడు. అక్కడ ఆగి ఎవరినైనా అడిగేవాడు. "కాళిదాసు తెలుసా" అని. "ఆఁ! ఆయనా! ఆయన్ని తెలియని వారెవరైనా వుంటారా" అనేవారు.

దాంతో భోజరాజు హృదయం

# నవ్వబోకో సామీ!

'శర్వరి'

నవ్వబోకో సామి!
నా తోటలో విచ్చు
పువ్వులే చిన్నవని
నవ్వబోకో సామి!
రతనాల మంజీర రవళిలో మైమఱచు
పతిలోక నాథుండ వైన నీ కడ జేరి
గతిలేని వెతలలో కరగిపోయెడివారి
చితుకు గాథల నేను చిలికించి పలికింతు;
దివ్వెలో కొడివోలె
తెగిరాలుదునటంచు
కవ్వించి గాయాల
త్రవ్వబోకో సామి!
నవ్వబోకో సామి,
నా తోటలో విచ్చు
పువ్వులే చిన్నవని
నవ్వబోకో సామి!
నీవు తారలరాశి నింగిలో పఱపించి
భావాల వీథిలో పయనింపజను వేళ
పూవురేకున పొరలి భూదేవి [illegible]లు
కావిమబ్బుల నీటి కతలనే వినిపింతు
పువ్వులోపల దాగు
మూగగవ్వనటంచు
నవ్వులో నిలుచుండి
దయమానకో సామి!
నవ్వబోకో స్వామి,
నా తోటలో విచ్చు
పువ్వులే చిన్నవని
నవ్వబోకో సామి!

బాధపడేది. కాళిదాసు చెప్పినదే సరి అయినదేమో అనుకున్నాడు.

ఇట్లా చాలా దేశాలు తిరిగాడు భోజరాజు. ఎక్కడవిన్నా కాళిదాసు కీర్తే. కానీ తన్నుగురించి ఎక్కడా తన రాజ్యంలో తప్పించి, ఎవరూ అనుకోవడం వినలేదు. ఎక్కడా కాళిదాసు ప్రతిభను పొగిడేవారే. తన రాజ్యంలోనే ప్రజలు ఈవిధంగా అనుకునేవారు. "పాపం! కాళిదాసు గారిని భోజరాజు వెళ్ళిపొమ్మన్నారట, రత్నాన్ని కాలదన్నే వాడెవడు? పిచ్చివాడు కాని."

ఇప్పుడు భోజరాజుకు అంతా అర్థమయింది. తను వేసిన ప్రశ్నకు సమాధానం సరిగా తెలుసుకున్నాడు.

ఒకరోజు రాత్రి భోజరాజు ఒక రాజ్యం చేరుకున్నాడు. అది రాత్రి సమయం. అప్పటికే భోజరాజు చాలా అలసి వున్నాడు. ఆహారం లేదు. డబ్బుఅయిపోయింది. కాని ఒక ఖరీదైన రత్నాలహారం మాత్రం అతని దగ్గర వుంది. దాన్ని ఆ వూరిలో అమ్మ నిశ్చయించుకున్నాడు.

ఆ రాత్రి ఎట్లో గడిపేశాడు భోజరాజు.

మరునాటి ఉదయాన ఆరత్నహారాన్ని తీసుకుని ఒక కంసాలి అంగడికి వెళ్ళాడు అమ్మడానికి. కంసాలి ఆ హారాన్ని పరిశీలించాడు. ఒక్కసారి భోజరాజు వైపు చూచాడు. మట్టిగొట్టుకుని వున్న దుస్తులలో, వాడిపోయిన ముఖంతో వున్నాడు భోజరాజు. కంసాలి భోజరాజును చూచి దొంగ అని అనుమానించాడు. వెంటనే రక్షక భటులను పిల్చి వారికి అప్పగించాడు ఆ హారంతో కూడా.

రక్షక భటులు భోజరాజును, ఆయన వేషాన్ని చూచి అనుమానించి ఆ రాజ్యపురాజు దగ్గరకు బంధించి తీసుకెళ్లారు.

భోజరాజు ఏం చేయగలడు?

మరునాడు ఉదయం.

## కపి - రాజు

తండ్రి—అబ్బాయి! మన చేలు పంట పండినవి. కూలీలను పిలుచుకొనిరా, కోత కొయ్యాలి.

అబ్బాయి—ఊహూ! నేను పిలుచుకొనిరాను.

తండ్రి—ఎందుకురా?

అబ్బాయి-నాన్నా! మీరే కదా చెప్పారు, కోతలు కొయ్యవద్దని

ఒక వ్యాపారస్థుడు, మామిడి పండ్లు అమ్ముతూ "అణాకారు, అణాకారు" అని అరిచాడు.

ఒకవిద్యార్థి, వెంటనే అతని దగ్గఱకు వెళ్ళి ఏమయ్యా ఆ "అణాకారు" ఇలా ఇవ్వు స్కూల్‌కు టైము అయినది త్వరగా వెళ్లాలి.

యస్. రామిరెడ్డి (తిరుపతి)

ఆ రాజ్యపు రాజైన వీరసేనుడు సింహాసనంపై కూర్చుని ఉన్నాడు. కవులు, గాయకులు, మంత్రులు మొదలగువారు అందరూ సభలో వున్నారు. సభ కిటకిట లాడుతూంది.

వీరసేనుడు అక్కడ వున్న సైనికుల వైపు తిరిగి, "దొంగను ప్రవేశ పెట్టండి." అన్నాడు.

మరుక్షణంలో భోజరాజు సంకెళ్ళచే బంధింపబడి సైనికులవెంట రాజు ఎదుట "దోషి"గా నిలబడ్డాడు.

అలసిపోయి బోనులో వున్న సింహం లాగున్నాడు భోజరాజు.

"ఇతనే ప్రభూ! ఖరీదైన రత్నాలహారాన్ని అమ్ముతుండగా పట్టుకున్నాము. ఇంత ఖరీదైన హారం ఈ బిచ్చగాడిదగ్గ రెందుకుంటుంది. అందుకనే బంధించి మీవద్దకు తీసుకు వచ్చాము" అన్నారు సైనికులు.

ఒక సారి తలెత్తి సభ వైపు చూచాడు భోజరాజు.

ఎంత విధి వైపరీత్యం! మహారాజాధిరాజైన భోజరాజు, పరదేశపు రాజుముందర బంధింపబడి 'దోషి'గా విచారణకు నిలబడడమా?

భోజరాజు అవమానంతో తల వంచుకు నిలబడ్డాడు. నోట మాట రాలేదు. తన మీద తనకే అసహ్యం కల్గింది.

అక్కడ ఆసనాలలో కూర్చుని ఉన్న కవులలోనుండి ఒకాయన లేచి, "ఎవరూ! ప్రభువులు భోజరాజుగారా!" అన్నాడు.

ఆశ్చర్యంతో.

"ఎవరయ్యా? కాళిదాసుగారూ! ఆదోషి మీకు తెలుసా?" అని ప్రశ్నించాడు వీరసేనుడు.

తలెత్తి అక్కడ నిలబడివున్న కాళిదాసును కళ్ళార్పకుండా చూస్తున్నాడు భోజరాజు. అయితే కాళిదాసు ఈ రాజ్యంలో వుంటున్నాడా? అనుకున్నాడు.

తను వున్న ఆసనందిగి గబగబా నడుచుకుంటూ, భోజరాజును సమీపించాడు కాళిదాసు. వెంటనే అతనిచేతికున్న సంకెళ్ళను విడతీశాడు "ప్రభూ! ఎంత కష్టం వచ్చింది మీకు. ఇక్కడికి ఎట్లా వచ్చారు?"

అంటూ భోజరాజును కౌగిలించుకున్నాడు కాళిదాసు.

అనుకోకుండా కాళిదాసు కనపడి తన్ను రక్షించినందుకు భోజరాజు ఆశ్చర్యపడ్డాడు.

వెంటనే కాళిదాసు చేతులు పట్టుకుని, "క్షమించు కవివర్యా! మీకు తీరని అపకారం చేశాను. అవమానించాను. నన్ను క్షమించండి. మీ కోసమే నేను రాజ్యం విడిచి బయల్దేరాను. మిమ్మల్ని విడిచి ఈ భోజరాజు వుండగలడా?"

జరుగుతున్నదంతా వీరసేనుడు నోరు తెరుచుకుని చూస్తున్నాడు.

అప్పుడు భోజరాజును వీరసేనుడికి పరిచయం చేశాడు కాళిదాసు. అప్పుడు వీరసేనుడు భోజరాజు చేతులుపట్టుకుని, "క్షమించండి! పొరపాటు జరిగింది. జరిగినది మర్చిపొండి. మా ఆతిథ్యం స్వీకరించండి" అన్నాడు.

అంతే! బిచ్చగాడిలావున్న భోజరాజు మహారాజైనాడు. వీరసేనుడు అతిగొప్పగా సన్మానించాడు.

అక్కడ వీరసేనుడి దగ్గర కొన్ని రోజులున్నాడు భోజరాజు. ఒక శుభ ముహూర్తాన వీరసేను డిచ్చిన పరివారాన్ని తీసికొని తన రాజ్యానికి బయల్దేరాడు.

వీరసేనుడి అంగీకారంతో కాళిదాసు కూడా భోజరాజువెంట బయల్దేరాడు.

రెండు రత్నాలు తిరిగి కలుసుకున్నాయ్!

# ఉ గా ది మ జి లీ

కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు

ఈ అనంతకాల యాత్ర
లో ఉగాది మైలురాళ్ళ
ఎన్ని దాటి వచ్చితినో ..
ఏ దిశలో గమింతునో...

ఎన్నిసార్లు క్రుద్ధప్రకృతి
ఏకాకిని ఎదిరిస్తే
ఎదిరినిల్చి పోరితినో...
విధినే శాసించితినో...

ఎన్నిసార్లు రిక్తమైన
ఈ జీవన పాత్రికలో
నవజీవం నింపితినో....
నవాశ లూరించితినో...

ఏమైనను ముగియబోని
దీ విచిత్ర కాలయాత్ర —
ఏనాటికి పగిలిపోని
దీ జీవన వజ్రపాత్ర —

ఈ అనంతకాల యాత్ర
లో ఉగా మైలురాళ్ల
ఎన్ని దాటి వచ్చితినో ..
ఏ దిశలో గమింతునో ..

పల్లకిలో పోతూ కాళిదాసు భోజరాజుతో అన్నాడు, "ప్రభూ! ఇప్పటికయినా మీరు చెప్పిన ప్రశ్నకు సమాధానం తెలుసుకున్నారా? నేను చెప్పినది సరిఅయినదని అంగీకరిస్తారా? కవి కీర్తి నలుదిక్కులా వ్యాపిస్తున్నందువలననే అతను ఎక్కడయినా వుండగలడు. తల దాచుకోగలడు. నివసించగలడు. కానీ రాజు కీర్తి ఆరాజ్యంలోనే. దానివలననే ఆతని ప్రతిభ అతని రాజ్యంలోనే వుంటుంది. రాజ్యం విడిచి బయటికివస్తే అతను మామూలు మానవుడు. కాని కవి కవే. ఎక్కడయినా కవే. మీరు ఈ సంగతి గ్రహించే వుంటారు. తిరిగి మరొక్కసారి క్షమించమంటున్నాను."

"నిజం! కవివర్యా నిజం! మీరు చెప్పినది అక్షరాలా నిజం! మిమ్మల్ని అవమానించినందుకు క్షమించండి: ఇక అది మరచిపొండి. కొన్ని సంగతులు అనుభవపూర్వకంగా తెలుసుకోవాలి. ఏమంటారు?" అన్నాడు భోజరాజు. ★

# ఋత్విక్కులు




రచయితలు వరే .

తెలుగు సినిమా రచయితలు మరే భాషా చిత్ర రంగ రచయితలకూ తీసిపోరు, ఇది నిజం.

అయితే

మనం అనుకునే యీ రచయితలు ప్రముఖంగా కవులు. రెండో విధంగా కథకులు, మూడవ స్థానంలో చక్కని సాంసారిక సంభాషణలు వ్రాయగలవారు.

కాని

నాటక కర్తలు కారు

అంటే. ..

నాటకం ( డ్రామా ) సృష్టించి దానిపై రస సాంద్రతగల సొప్పన్ను, సమస్య ఉచితమైన పరిష్కారం పోషించి అవునవిపించుకునేవారు కారు అని నా భావం.

అనగా

అలనాటి రంగస్థలంపై నాటకాలు వ్రాసి మాటి మాటి ద్వారా ప్రేక్షకులను ఉక్కిరి బిక్కిరి చేయగలిగిన నాటక శిల్పులు ఈనాడు లేరు.

ముఖ్యంగా

'సారంగధర' నాటకంలో ధర్మవరం చూపిన నాటక విధానంవంటి స్వతంత్ర సృష్టి, దృష్టి కల వారు ఈనాడు లేరు. అందులో పావురమేచాలు. ఉక్కిరుమనకుండా తిప్పుకొస్తుంది నాటకమంతా.

బలిజేపల్లివారి హరిశ్చంద్రలూ, మరొకరి వర విక్రయాలు అనుకరించడమేగాని, స్వతంత్రించి అటువంటి కథా నాటకం సృష్టించడం లోపించిందని చెప్పక తప్పక తప్పడంలేదు

ఇటీవల ఒక ప్రసిద్ధ సాంఘిక చిత్రం భక్త పుండరీకుని కథకు నాగరికం అని అందరికీ తెలుసు !

ఈ రోజున మనకు మల్లాది వారివంటి కవి కథకులూ, పాలగుమ్మి, పినిసెట్టివంటి కథకులు, దేవుల పల్లివంటి కవులు, పింగళి, నరసరాజువంటి నాటక కర్తలు, సదాశివబ్రహ్మంవంటి సినీ కథావధానులూ ఉన్నారు. అందుకు తోడు

బి. యన్, కె. వి , కమలాకర కామేశ్వరరావుల వంటి భావుకులయిన దర్శకులున్నారు

సముద్రాల, ఆత్రేయ (?) ప్రత్యగాత్మలవంటి తెర సంభాషణ భూషణులూ ఉన్నారు

అయినా వెలువడుతున్న తెలుగు సినిమాలలో నాటకీయత లోపిస్తున్నది. ఎక్కడో అక్కడ కథ ఒక్క(టే) విధంగా దెబ్బ తింటున్నది కథనం అనే రైలుబండి నిర్మాతల జోక్యం అనే గుదిబండ పాలబడి సూళ్ళూరుపేట మెయిల్ గొడవ జ్ఞాపకం చేస్తున్నది.

దానికి కారణం వేరే చెప్పకుండానే చెప్పాం కథకుడగాని, నాటకకర్తగాని ఏదో అంచనాతో, ఆధారంతోనే ముందుకు సాగుతాడు. అందుకు వలసిన సాధన సంపత్తి ముందే కొంత వినియోగిస్తాడు అతని దారికి అడ్డంపడితే మొదట పెట్టుబడి వృథా అవుతుంది అనుకున్న కథ వధ అయిపోతుంది కథాంతరం పుడుతుంది అయ్యవార్లంగార్ని చేయబోతే కోతి అవుతుంది

దాదాపు ఈ 'తికో' (తిరగేసి) అయ్యవార్లంగారనే భ్రమాదానికి లోనవుతున్నారు—నవ్వుతున్నారు ఆనందిస్తున్నారు జనం

వాణిజ్యం, పెట్టుబడి, వాటి రక్షణ యివన్నీ చలన చిత్ర వ్యాపారానికి అవసరమే.

కాని

కళగా చలన చిత్రానికి ఈ త్రయం అనవసరం

ఈ సంగతిని సూత్రప్రాయంగానేగాక, ప్రత్యక్ష విధానంలోనూ ఆమోదిస్తే ఇప్పటి సినిమా చప్పదనంపోయి గొప్పదనం కన్పిస్తుంది

కథకు సంబంధించినంతవరకు కథకుడూ—సినేరియా రచనకు రచయిత, దర్శకుడు, కథకుడూ కలసి కథన విధానం ఒకటి చక్కగా ఏర్పరచుకొన్నట్లయితే ఆ విధానంపై పెట్టుబడిపెట్టే నిర్మాత తన అసలుకు మోసంరాని విధంగా కొన్ని సూచనలు చేయవచ్చు. అవి కథకు గొడ్డలి పెట్లు కాని రీతిని మార్చి కథక, రచయితలు ఆమోదించవచ్చు ఇలా విడివిడి అధికారాలు, పరిధులు చలన చిత్ర సమాఖ్యలోవుంటే శాఖలవింగడింపు లెక్క ప్రకారం ఒక పద్ధతి ప్రకారం ఉంటే కళగా చలన చిత్రం కుంటుపడకుండా స్వతస్సుందరంగా తయారవుతుంది

కాని,

నిర్మాతల జోక్యం ఎంతవరకు ఆపగలం ? అనేది మిగత వారికి పెద్ద సమస్య — కన్నవారిని కాచుకునే అధికారం మాతకు ఉన్నట్లే కొన్న వారిని కాచుకునే అధికారం నిర్మాతకూ ఉన్నది మరో విషయం ఏమిటంటే . . .

అసలు నిర్మాతలకు (కొందరు) ఉన్నంత సాంకేతిక పరిజ్ఞానం, కథా కథన చాతురి, ఆఖరికి కామెరా కోణ విజ్ఞానం, ఆ యా శాఖల వారికి ఉన్నట్లు కన్పించదు మంచి చదువరులు, స్వతహాగా బుద్ధి వికాసం కలవారు, క్రాంతదర్శులూ అయిన నిర్మాతలు లేకపోలేదు చూస్తూ చూస్తూ వారు తమ చలన చిత్ర కన్యక తప్పు టడుగులు వేస్తూంటే సహించి వూరుకోలేరు అప్పుడు జోక్యం కన్న లౌక్యం లేదు, తప్పదు.

అదే మరి కొన్ని పట్ల జరుగుతున్నది అది కాదనడం అవివేకం

తమ కళాకారులతోపాటు పరిశ్రమించి, సేవ్య సేవకభావం రాకుండా, పెట్టుబడి బెట్టుబడి రట్టుబడి కాకుండా కష్టించే నిర్మాతలూ ఉన్నారు.

వేయేల ?

నిర్మాతలలో.. .

దర్శక నిర్మాత, నిర్మాత కథకుడు, నిర్మాత — సంగీత దర్శకుడు, నిర్మాత — ఛాయా గ్రాహకుడు, నిర్మాత నటుడు, వంటివారు ద్విగుణ భూషణులున్నారు. వారు అలా రాణిస్తున్నారు కూడా.

'చండీరాణి' (భరణి) చిత్ర కథా రచన, దర్శకత్వం, ద్విపాత్రాభినయం, గానం కూడా నిర్వహించిన నటీమణి భానుమతి అందుకొక మచ్చుతునక.

పురాణ కథా సరోవరం అవలోడించి రావణ కథా మణులను ఏర్చి కూర్చి 'సీతారామ కళ్యాణం' చిత్రమాలను తీర్చడానికి పరిశ్రమిస్తున్న సోదరులు రామారావు, త్రివిక్రమరావులు చాలు. అటు నిర్మాతలయినా ఇటు నటులుగా ఒకరు దర్శకులుగా, సంగీత సూచకులుగా, ఉత్తమ లక్ష్యలతోపాటుబడుతున్న నిర్మాతలు వీరు

ఏది ఏమైనా

నిర్మాతలలో సాంకేతిక నిపుణులూ, సాంకేతిక నిపుణులలో నిర్మాతలు ఉన్నారు మొత్తంమీద వారి వీరి సమ్యగనుబంధం ఉంటేనే 'కళ' కుంటుపడదు.

కళా కుసుమ వికసనానికి వీరి ప్రతిభా కిరణ విన్యాసంయోగక్రియ అవసరమైనంతగా పరస్పరం వీరి పేచీ పూచీలు ఆవశ్యకం కావు.





మహేంద్రాపిక్చర్సువారి "కృష్ణప్రేమ"లో జమున

# వార్తాభరణం

మహేంద్రా పిక్చర్స్‌వారి రసవత్తర పౌరాణికం కృష్ణప్రేమ' ఏప్రిల్ 20 ప్రాంతాల విడుదల అవుతుంది జమున, బాలయ్య, రేలంగి వగైరా నటించే ఈ చిత్రానికి సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు

విజయావారి భారీ జానపదం 'జగదేకవీరుడు' మనోహర దృశ్యకావ్యంగా, నేత్రపర్వంగా తయారయినట్లు వార్త ఏప్రిల్‌లో కొన్ని పతాక ఘట్టాలు చిత్రీకరించగానే చిత్రం పూర్తి అవుతుంది దర్శకుడు కె వి రెడ్డి తెర నాటక రచన పింగళి పాళీ సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు ఎన్ టి రామారావు, బి. సరోజాదేవి, రేలంగి, ముక్కామల, రాజనాల, సి ఎస్ ఆర్ గిరిజ, విజయలక్ష్మి, కన్నాంబ నటిస్తున్నారు ఛాయ మార్కస్ బార్ట్లే

* * *

డి బి ఎస్ వారి 'సెంటిమెంటు'' గుబాళించే చిత్రం 'పెండ్లిపిలుపు' ఏప్రిల్ చివరకు విడుదల కానున్నది ఎన్ టి రామారావు, దేవిక, కన్నాంబ, రేలంగి, గిరిజ, సూర్యకాంతం, శర్మ, హేమలత, సి ఎస్ ఆర్ నటిస్తున్నారు కథ అచత తూలికాభూషణ్, మాటలు, పాటలు ఆరుద్ర ఆత్రేయ, శ్రీశ్రీ దర్శకుడు అమంచర్ల శేషగిరిరావు (అశ్విని)

* * *

కె పి ఆర్ట్స్ వారి 'కన్న కొడుకు' ఏప్రిల్‌లో విడుదలకాగలదని వినికిడి జగ్గయ్య, దేవిక, ఛాయాదేవి, రమణారెడ్డి వగయిరాలు నటులు సంగీతం కోదండపాణి దర్శకుడు కృష్ణా (ముందడుగు) రావు

* * *

నేషనల్ ఆర్ట్స్ థియేటర్‌వారు 'గులేబకావళి' పౌరాణిక చిత్రం నవ్య రీతులలో నిర్మిస్తున్నారు భావకవి శ్రీ సి నారాయణరెడ్డి పాటలు, సముద్రాల (జూనియర్) మాటలు సమకూరుస్తున్నారు నాయికా పాత్రకు సరికొత్త తారను ఈ చిత్రంలో పరిచయం చేయాలని నిర్మాతలు సంకల్పించారు ముఖ్య నటుడు నందమూరి తారక రామారావు సంగీతం గాలిపెంచల నరసింహారావు, నిర్మాత త్రివిక్రమరావు

* * *

సారధివారి 'కలసి ఉంటే కలదు సుఖం' (బాగ పిరివిన్నై) లో ఎన్ టి రామారావు, సావిత్రి, రేలంగి, హరనాథ్ వగైరాలు నటిస్తున్నారు చిత్రం మూడవవంతు పూర్తయినది తిరిగి ఏప్రిల్ 14 వ తేదీ నుంచి చిత్రీకరణ జరుగుతుంది సంగీతం వేణు దర్శకుడు తాపీ చాణక్య

శ్రీరామా పిక్చర్స్‌వారి 'దేశద్రోహులు' అపరాధ పరిశోధక సాంఘిక చిత్రం నూతన రీతిని చిత్రిస్తున్న ఈ చిత్రం దాదాపు సగం పైగా పూర్తి అయింది ఎన్ టి రామారావు, దేవిక, గిరిజ, రాజనాల, రమణారెడ్డి, కాంతారావు, రామకృష్ణ, శోభన్‌బాబు వగైరాలు నటిస్తున్నారు ఇటీవలనే జెమినీచంద్ర, గిరిజల చిత్రాలు చిత్రీకరించారు సంగీతం సాలూరు రాజేశ్వరరావు, దర్శకుడు బోళ్ల సుబ్బారావు.

* * *

విఠల్ ప్రొడక్షన్స్ వారు తమ పౌరాణిక చిత్రం 'వరలక్ష్మీ వ్రతం' ప్రారంభించారు కాంతారావు, రాజనాల, కృష్ణకుమారి, మీనాకుమారి, రమాదేవి, జయశ్రీ, సత్యనారాయణ, బాలకృష్ణ, జగ్గారావు, నటిస్తున్నారు సంగీతం రాజన్, నాగేంద్ర రచన జి కృష్ణమూర్తి దర్శకత్వం విఠలాచార్య

* * *

లలితకళా నికేతన్ వారి 'భక్త జయదేవ' పద్మావతీ చరణ చారణ చక్రవర్తి మధుర గాథ ఏప్రిల్ తొలి భాగంలో విడుదల కాగలదని తెలిసింది రచన సముద్రాలరాఘవాచార్య సంగీతం రాజేశ్వరరావు నాగేశ్వరరావు, అంజలి, రేలంగి, కె వి. ఎస్ శర్మ మిక్కిలినేని నటిస్తున్నారు దర్శకుడు. పి. రామారావు. ★

# అవీ... ఇవీ...

సినారె రాకతో తెలుగు చిత్ర కవితా సరోవరం క్రొత్తనీరు పెట్టుకున్నది. ఎన్. ఎ. టి. వారి 'గులేబకావళి' చిత్రంలో సినారె వివిధ గతులలో విలక్షణమైన గీతాలు రచిస్తున్నట్లు, తెలుగు దేశీయత గుబాళించే నుడికట్లు, పలుకుబళ్ళు ఎన్నో ఉపయోగిస్తున్నారనీ నిర్మాత, ముఖ్య నటుడు ఎన్. టి. రామారావు వెల్లడించారు.

'కవితాధోరణి ఇతర రంగాలలో వలెనే సినీ రంగంలోనూ మారాలి. అందుకోసం సినారె వంటి భావకవిని ఆహ్వానించాం' అన్నారు రామారావు.



భరణీవారి "బటసారి"లో భానుమతి, రమణమూర్తి.

కింవదంతులూ, కుశంకలూ మితిమీరినప్పుడు కృతి, దానివల్ల మతి కూడా చెడడం మామూలు. చిత్రలోకంలో కళారాధన అటువంటి కొంత యిటువంటి మామూళ్ళ మామూళ్ళు అయినాయి.

పత్రికా విలేఖరులమీద, పాటి కళాకారులమీద, కవిమీద కవి, మరొకరిమీద ఇంకొకరు — ఈ మాటే పోటీలు తెరకు మరకలే గాని మెరుగులు కావు. చాటిం జాడీలలో పరస్పర ద్వేషాలు పూరవేస్తే దానివల్ల ప్రయోజనం లేదు. రుచిపచి లేని ఒరుగై కళ కళవళిస్తుంది.

ఎవరి వైయక్తిక పురోభివృద్ధికి వారు పాటుపడడం మంచిదే. డార్విన్ చెప్పాడు. కాని ఇంకొకళ్ళని అణచి మనం పైకి రావడం లాభమే కాని శుభం కాదు.

* * *

అసభ్యమైన ప్రకటన పత్రాల (Wall Posters) పై సర్వోదయ నాయకులు లేపిన ఉద్యమంపై కొందరు సినీకారులు వ్యక్తిగతంగా కేవలం ఏకీభావం ప్రకటించారు. మరీ పరిధులు దాటిన సంఘటనలలో వాటిని సరిదిద్దాలి తప్ప దని వీరి భావం.

నిజమే.

తమిళ సినిమా బొమ్మలు చూసినా అది సమంజస మనిపించకపోదు.

శృంగారం అసభ్యం కానంతవరకు బంగారమే. ఆ బంగారం పదార్వన్నెలతో వెలగాలి వెండితెరమీద.

* * *

కన్నాంబ అనగానే మన పాతికేళ్ళ తెలుగు చిత్ర పరిశ్రమ కళ్ళలో మెదుల్తుంది. 'కృష్ణంభజే రాధా' 'నేనే రాణినైతే' 'భారతదేశం మనదే కానీ ఫలితము మనకేది' ఇత్యాది పాటలూ ఒక్కసారి చెవుల రింగుమంటున్నాయి. గృహలక్ష్మిగా, పల్నాటి నాగమ్మగా, తల్లిగా, ప్రేయసిగా ఆమె ఎన్ని విధాల పాత్రతను గడించుకొన్న కళాతపస్వి. తన సహజ కాంస్యగళంతో ఆమె రసవీణలు రకరకాలుగా పలికించి ఉత్తమ నటన అందించినది. ఇటీవల ఆమెకు అనారోగ్యం కలిగి దాదాపు రెండు నెలలపాటు చిత్ర పరిశ్రమ స్తంభించిపోయింది! తిరిగి ఏప్రిల్ 10 నుంచి ఆమె రంగంలో కాలు పెడుతున్నారు.

ఒకనటి అనారోగ్యం కళకు అవాంతరమైనదీ అంటే ఆమె స్థానం ఎంతటిదో తెలుస్తుంది. ★



మహేంద్రాపిక్చర్స్‌వారి "కృష్ణప్రేమ"లో జమున, బాలయ్య.



(శ్రీ) కాంత్ ప్రొడక్షన్స్‌వారి "సతీసులోచన"లో రావణ ప్రతిమావిష్కరణ

# స రి గ మ లు

## 'సెంటి మెంటాలిటీ'

"శామ్యూల్ స్మయిల్స్ 'డ్యూటీ' తీసి అందులో వున్న ఒక్కొక్క నీతిని ఏరి దానికో కథా దేహం నమర్చించి తెరకు అనువదించుకుంటే చాలు—సినీ పరిశ్రమ ఉభయతారకమైన కళాసేవ కాక తప్పదు' అన్నారు ప్రసిద్ధ చిత్ర నిర్మాత శ్రీ దినవహి భాస్కర నారాయణ

'మన బతుకంతా సెంటిమెంటు తప్ప మరోటి కాదు. దేవుడికి జీవుడికి గల అనుబంధమే సెంటిమెంటు మన గడ్డమీద దేవుడులేని జీవుడు లేడు పరంలేని ఇహంలేదు ప్రతిదీ సెంటిమెంటుతో ముడి వేసుకునే వుంటుంది అందుకు విభిన్నంగా ఉండే సంఘాన్ని సహించనట్లే చలన చిత్రాన్ని సహించదు జనత' అన్నారు శ్రీ డి బి యస్

"ఉత్తర ధ్రువంలో సీల్ మాంసంతినే ఎస్కిమోలకు గుంటూరు గోంగూర వన ఎలా తెలుస్తుంది? పారలౌకిక దృష్టితో కూడిన సెంటిమెంటు సారథం, ఐహికభోగులయిన పాశ్చాత్యులకూ అలాగే తెలీదు

వారికి తెలీకపోవడం కూడా వారి గొప్పదనమే అనుకుని అనుకరించబోవడం హాస్యాస్పదం 'సెంటిమెంటు' విడచిన సాముగరిడీలు అంటువంటివే"

'సెంటిమెంటు' లేని టాలెంటు మంటికీ మింటికీ కాకుండా పోతుందని ఆయన నమ్మకం

రంగస్థల నాటకాల విజయానికి ఇదే కారణమంటారు డి బి యస్

## పౌ రా ణి కా లం

'కళ్ళముందు కదలాడే సాంఘికంకన్న కథలుగా కట్టు కథలుగా మిగిలిపోయిన పౌరాణికాలు గొప్పవి. కళ్ళముందు వాటిని అద్దంలో చూపించడం గొప్ప కాదు కథలా, కలగా చూపించడం గొప్పతనం పౌరాణికాలు తెరకు తేవడంలో నా ఆంతర్యం యిదే కదిలేదీ కదిలించేదీ పురాణం అదే నా సినీ కిరాణం' అంటారు దర్శకుడు శ్రీ రజనీకాంత్

సాంకేతిక నిపుణుడుగానేకాక, వ్యక్తిగా, మనిషిగా రజనీకాంత్ పేరుకు తగ్గ తీరు కలవాడు. ఓపిక, ఒద్దిక, నేర్పు కలవాడు మర్యాద అనే పరిభాష, మన్నన అనే భాష అతనికి బాగా వచ్చును. పుట్టుకచేత మహారాష్ట్రుడయినా తెలుగుతనం తొలుకాడే మాటవరస, మనస్సువరస కలవాడు

తొలి చిత్రం 'వదినగారి గాజులు' కదలించిన సాంఘికం ఆ చిత్రం తెరమీద నవల చదువుకున్నట్టు వున్నదని అనేకులు శ్లాఘించారు కృత్రిమతకు చోటు, సహజత్వానికి లోటు రానీయని యువ దర్శకుడు రజనీకాంత్ ఇప్పుడు 'సతీ సులోచన' అనే భారీ పౌరాణికం తీస్తున్నారు

'వర్తమానంకన్న భూతకాలాన్ని గత చరిత్రని పట్టడం కష్టసాధ్యం మన ప్రాచీన పురాణాలన్నీ దృశ్యకావ్యాలుగా చిత్రీకరించాలని నా ఆశయం అందుకే పౌరాణికాలంలో పడ్డాను'అన్నారు శ్రీ రజనీకాంత్

# సితారాపథంలో....

అది చిత్రలోకాలోక రమణీయ ఉద్యానవన వీథి

'విజయ' నామాంకిత సినిరమా విలాస మందిరం

ఆ సుందర మందిరం పార్శ్వకారణంగా తారా తోరణం అనుక్షణం కళా సమీరచాలనంతో కదులాడుతూ ఉంటుంది

నిత్యనృత్య సంగీత రాగాతిశయంతో చిత్రకళ చలనచిత్ర కళగా వెలుగొంది అందం చందం చిందుతూ ఉంటుంది

ఆ విజయోద్యానంలో అడుగిడగానే ఒకవైపున కదురంబోధివరీతమైన ధరణీచక్రం ఒకవైపున, దరాబాదీ గానాబజానా భజానా మరోవైపున, ప్రణయకాంతి ప్ఫుటార్ఫుట తటిల్లతావటులత ఒక దిక్కున, భక్తిమరంద సమ్మిళిత గానరస విర్ఘిరోపారణ తోక దిక్కున విభిన్నంగా, విశిష్టంగా విలసిల్లే వింత దృశ్యాలు

నవనాగరికపు తుమ్మీలా విదవర్తం తోక వైపున గానం—

ఆ దిశ అడుగులు పడగా పడగా,

ముక్కుపచ్చ లారీ ఆరని పాలమోముల గోముల బంగారుబాలపిచ్చుకలు రెండు—

పరువం తొలుకాడే ఆడని ప్రాఫిత పాటను తింపి పాటమరించని పారువాలు రెండు—

పాదమంజీర ఘలంఘలల అలలపైన తేలి తూలి తేలి లీలగా నర్తించే మయూరికలు రెండు—

మొత్తము (మూడు రెళ్ళు రెండే) రెండు తారికలు — శకుంతల, కళావతి అనే బాలికలు, సినీ సోపాన గోపుర శైలూషికలు — లయలు హొయలు పలుకాడే రంజయిత పాటమీద, అబల చేతి తబలా బలబల మీద, — హార్మణి నొక్కుల సొక్కే హార్మోనియం పలుకులమీద విలాసంగా నర్తన చేస్తున్నారు 'ఇదీ రేయి కాదోయి గోపికా' అనే పాట అది రచన శ్రీరంగం శ్రీనివాసరావు సంగీతం: ప్రసాదరావు టి. వి. ఎస్— 'పెండ్లి పిలుపు' కు వలపు గాలిసే మధుర సన్నివేశాలు అక్కడ చిత్రిస్తున్నారు.

అటునుంచి మెల్ల మెల్లగా సాగే అడుగులతో తూగిపోగా మరోరాగం, మరో ప్రవంత రాగం, బహుశః ఎవరో భక్తుని హృదయపరాగం, శ్రీరాగం వినిపిస్తోంది దగ్గరకు పోయి చూస్తే 'మహాత్ము అయినా, దురాత్ము అయినా దేవుని పేరని మనరయ్యా' అనే తత్వం ఓ పదహారేళ్ళ బాలాకుమారి కంఠం నుండి వెలువడుతున్నది మరో రాత్రి కుడు సామోదంగా ఆ మాటలు విని ఆనందిస్తున్నారు అక్కడ తిరుపతి వెంకటేశ్వరస్వామి పటం, శ్రీరామ పంచాయతనం అన్నీ భక్తి నిదర్శనాలుగా ఉన్నాయి

ఆ పాటలో పాల్గొంటున్నది లీలంగి, కృష్ణకుమారి కవితా చైత్రేయ ఆత్రేయ కవితాచిత్రం 'వాగ్దానం' లో ఆ భక్తిరస పోషణ జరుగుతున్నది. సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు

'కలికాలమున కొండొకచో భక్తి తప్పదు' అని తెలిసి అటుపిడి అడుగు వేయగా విలయ విలయమునదగిన తటిల్లతా చటులార్భటమైన వీధిని సమయం! భీకరాకారరాకాసి వికటాట్టహాస మువు దగ్గ మెరుపులు, పిడుగులు దివ్యతేజస్ఫూర్తి ఎవరో పరివ్రాజకమూర్తి విధినే కాసిన్నా



శాంతికళాఫిలిమ్స్‌వారి "శాంతి" చిత్రంలో సురభి బాలసరస్వతి, గుమ్మడి.

# సీతారా పథంలో...

ఉద్యాన నిర్మాణానికి ప్రకృతిని విజృంభింప చేస్తున్నారు.

ఆ పక్కన దిక్కున మనకే అసలే తెలియని అరవ మిత్రుని అడుగుతే 'అది రష్యా సింగర్' అన్నాడు 'హతోస్మి 'ఋష్యశృంగ అయివుండా'లనుకునేసరికి ఆ ప్రళయం ఆగిపోయి ఋష్య శృంగుడు సిగరెట్ వెలిగించాడు పరకాయించి చూస్తే ఆ పరకాయ ప్రవేశం చేసింది నవ నటుడు హరనాథ్ అది గీతా ఎక్సర్స్‌వారి ఋష్య శృంగ'లో సన్నివేశం

ఈ గ్రదగోళం నుండి సుదూరం పోగాపోగా ఉద్యాన సీమలు వెనుకపడి ప్రకాశ్ స్టూడియో ఉద్యానం వచ్చింది అక్కడ రత్నసౌధలు, రత్నసింహాసనం రత్నసభాటం, భాసురాసనం వారి వల్లప్పలు ఆది శ్రీకాంత్ ప్రొడక్షన్స్‌వారి 'సతీ సులోచన'లో పతాక ఘట్టం ఆ ఘట్టంలోంచి నవరత్నమణి మాణిక్య ఖచిత ఖచితమైన కిరీటం గల ఓ కిరీటరావుగారు, హృదయ వైశాల్యం గాఢ్ని నవ్వుతూ వచ్చి 'మీకు నచ్చిమెరవకాయ బజ్జీలో ఏందు వేయాలి' అన్నారు

ఎవరీ ఇక్ష్వాకుల నాటి మేటి ? సరాసరి నన్ను చూసి పచ్చిమెరప బజ్జీ అంటాడు ?' అని రెండు ప్రశ్నార్థకాలు కళ్లలో వేసుకు మరీ చూద్దును కదా అతను నందమూరి తారకరామారావు !

తరువాత రామారావు గాయకుడుగా(!) కొన్ని పాటలు పాడి వినిపించి కొంత కాలాన్ని సుఖపెట్టి పంపించాడు

స్టూడియోద్యాన విహారం అంతటితో అయిపోయింది ★



'సతీసులోచన'లో రామారావు, అంజలి.

# సరిగమలు

## రస ముద్రాల

సముద్రాలంటే మామూలుగా కడలి సముద్రాలలో రెండు రెగలున్నాయి సీనియర్‌లన్నీ మహాసముద్రాలు జూనియర్‌లన్నీ సముద్రాలు కాని చిత్రలోకంలో సీనియర్ అంటే శ్రీమాన్ సముద్రాల రాఘవాచార్యులు జూనియర్ అంటే ఆయన కుమారుడు రామానుజం

సముద్రమంటే కేవలం ఉప్పునీటి మొత్తమే కాదు నవరత్న వజ్రవైడూర్య మాణిక్యాలకు ఆకరమైనది కూడా అలాగే సముద్రాలవారు కూడా రత్నాలవంటి పాటలు, వజ్రాలవంటి (సానపట్టిన తర్వాత) మాటలు కూర్చిన చిత్రమాణిక్యాలు ఎన్నో ఉన్నాయి

సముద్రాలకు అవధులు లేనట్లు సముద్రాల (ఉభయుల)కు పరిధులు లేవు వారు కథకులుగా, దర్శకులుగా, రచయితలుగా రాణించారు 'వినాయక చవితి' అనే చిత్రానికి సముద్రాలవారు దర్శకులుగా వున్నారు

అలనాటి 'వందే మాతరం'నుంచి నేటి భక్త జయదేవ, రేపటి మరోటీవరకు వారి పరిధి విస్తరించివున్నది సముద్రాల అట్టడుగున్నగుప్తమై నిక్షిప్తమైవున్న రత్న మాణిక్యాలవలన సముద్రుడు గంభీరుడు, గౌరవనీయుడు అయినట్లు తమలోంచి వెలుగుతున ప్రతిభా కిరణాలవల్ల సముద్రాల చిత్ర రచనాపితామహులైనారు

సముద్రాలకువలె సముద్రాల'కు చెలియలి కట్టలేదు అందుకే చిత్ర లోకంలో తీర ప్రాంతాలకేగాక, లోలోపలి ప్రాంతాలకూ వారి ప్రభావ భంగాలు తాకుతూ ఉంటాయి

## స్వర రమేష్

హిందూస్తానీ స్వర కిసలయాలుమేసివి తెలుగు సినీవనంలో కలకంఠం ఒలికించే కోకిల రమేష్ నాయుడు తెలుగు తెరమీదకు రమేష్ వచ్చి పట్టుమని గట్టిగా నాలుగేళ్లు అయిందేమో !

ఈ అనతికాలంలో రమేష్ కట్టిన బాణీలు రక్తికట్టినట్లు అందరూ ఒప్పుకుంటారు. 'దాంపత్యం' చిత్రంలో అతని పాట లన్నీ నాటు మోగిపోయినా ఆ చిత్రం అంత ప్రజాదరణ పొందని కారణాన అతని పేరు ప్రసిద్ధం కాలేదు 'తా నేమి తలంచెనో' అనే యుగళ గీతానికి అతను సంతరించిన పియానో నేపథ్యం కడు రమ్యమైంది తెలుగు సంగీత దర్శకులలో 'ఆర్కెస్ట్రేయిజేషన్' కళ తెలిసిన ఒక రిద్దరిలో రమేష్ ఒకరని వినికిడి

'స్వయంప్రభ' లో ఆనంద మధుర మీవేళ', 'మనోరమ' లో 'అందాలసీమ', 'చేసిన బాసలూ' వంటి పాటలు రమేష్‌సంగీతచంద్రికలే

అవకాశం అనే ఆకాశంలో తారగా, ధ్రువ తారగా వెలిగే వెలుగు రమేష్‌నాయుడుకూ ఉంది అయితే అతనికి కావలసిందల్లా ఇతోధికమైన పదునుకాలం మాత్రమే. ★

స్పష్టంగా కనబడింది. అప్పుడు ఎక్కడా మబ్బు తునక్కైనా లేదు.

పైలట్ వాతావరణం, తిరుతెమ్మలు చాలాసేపు క్షుణ్ణంగా పరిశీలించాడు. తనలో తనే ఏదో గొణుక్కున్నాడు. తరవాత పక్కనే ఉన్న ఫాగ్‌కేసి చూశాడు.

"ఒక్కమాట చెప్పాలి ఉంది. దాపరికం లేకుండా చెప్పమంటారా ?" అన్నాడు

"చెప్పండి"

"పెద్ద పెట్టున హోరుగాలి వీస్తుంది కొంత సేపటిలో."

"దక్షిణం నించా, ఉత్తరం నించా ?" అన్నాడు ఫాగ్

"దక్షిణంవేపు నించే.. తుఫాను రాబోతోంది.

"యస్. అంతకన్నా కావలసిం దేముంది దక్షిణం నుంచి వస్తే, మన పడవని వెళ్ళాల్సిన వేపుకే తోస్తుందన్నమాట" అన్నాడు ఫాగ్

"మీరు అలాగే అనుకుంటే, ఇంక నేను చెప్పేదేమీ లేదు" అన్నాడు పైలట్—అతన్ని తేరి పార చూసి.

పైలట్ అనుమానాలు నిజమయ్యాయి. మరో ఋతువులో అయితే "తుఫాను మెరుపులా వచ్చి మాయమయ్యేది గాని, ఈ శీతాకాలం రోజుల్లో వస్తే మహా దౌర్జన్యంగా విజృంభిస్తుంది అతనికి వరస తెలుసు ముందే జాగ్రత్త పడ్డాడు తెరచాపలన్నీ చుట్టేయించాడు కొయ్యలన్నీ దింపేయించాడు అంత తలో చెయ్యివేసి డెక్‌మీద ద్వారాలన్నీ కట్టుదిట్టంగా బంధించి బిగించారు పడవలోపలికి ఒక్క బొట్టు కూడా దిగడానికి వీలులేకుండా జాగ్రత్తపడ్డారు తుఫాను గాలి ధాటి తట్టుకుని నిలబడగల త్రికోణాకారపు తెరచాప ఒకటి మాత్రం ముందర ఎగురవేశారు ఎదురుచూస్తూ కూర్చున్నారు

తన పడవమీది ప్రయాణీకులు ముగ్గురినీ గదిలోనే కదలకుండా కూర్చోవలసిందని, పైకి రావద్దని బతిమాలాడు పైలట్. గాలి, వెల్తురు రాకుండా దిగ్బంధం చేసిన ఆ గదిలో కదలినా మానినా అసలు ఉండడం దుస్సాధ్యమని, ఫాగ్ అయ్యూదాలు డెక్‌మీదకే వచ్చేశారు ఆఖరికి ఫిక్స్ కూడా లోపల కూర్చుందికి ఒప్పుకోలేదు

ఎనిమిది గంటలవేళ, గాలీ వానా ముంచుకు వచ్చాయి ఒకేఒక్క చిన్న తెరచాప వేసుకున్నా, అదే ఆధారం చేసుకుని టాంకడీర్‌ను తూలికలా తేలికగా ఎగరేసుకు పోయింది గాలి ఆ ధాటికి పక్షిలాగే ఎగిరిపోయింది పడవ రైలింజను పొగలిగినంత వేగంగానూ పోతుం దనుకొని అంతకు నాలుగు రెట్లు వేగాన్ని ఊహించుకున్నా, అది ఈ క్షణంలో టాంకడీర్ జోరుకు తీసికట్టనిపిస్తుంది

ఆరోజు పగలంతా టాంకడీర్ అంత వేగం గాను ఉత్తరదిశాభిముఖంగా ఎగురుతూనే ప్రయాణం చేసింది బ్రహ్మాండమైన కెరటాల పైనా తేలుతూ తూలుతూ పట్టపగ్గాలు లేకుండా పరుగెత్తింది. వెనకనించి పెద్దపెద్ద కొండల్లా లేచి విరిగిపడుతున్న కెరటాలు దాన్ని అణచి ముంచేసే ప్రమాదం ఆరోజున 20 సార్లయినా తప్పివుంటుంది ఎప్పటికప్పుడు అప్రమత్తుడై

# 80 రోజుల్లో భూప్రదక్షిణం

(39 వ పేజీ తరువాయి)

చుక్కాని కొయ్యకు పైలట్ బన్స్బీ చాకచక్యం, ఒడుపు దానిని కాపాడుతూ వచ్చాయి. కెరటాల జల్లు, డెక్‌మీద ప్రయాణీకులను ముంచెత్తివేసింది. ఆ ముగ్గురికీ ముగ్గురూ వేదాంత ధోరణిలో, ఆ ఉపద్రవాన్ని భరిస్తూ నిలబడ్డారు ఫిక్స్‌కి ఈ వరస నచ్చలేదు కోపం వచ్చింది తుఫానుమీద. అయూదా ధ్యానంతా తుఫానుమీద కాదు కానీ చుట్టుముట్టిన జలప్రళయం మధ్య నిశ్చలంగా బలంగా నిలబడిన ఫిలియాస్‌ఫాగ్ మీద. అతని ధైర్యస్థైర్యాలను చూసి ఆశ్చర్యపడడంలో, తుఫాను భీభత్సానికి భయపడడానికి వీలులేకపోయింది ఆమెకు. పోతే ఫిలియాస్‌ఫాగ్‌కు ఏ భావమూ కలుగలేదు ఇదంతా అనుకున్న కార్యక్రమంలో ఒక అంశమే నన్నట్టు నిలబడ్డారు.

ఇంతవరకూ 'టాంకడియర్' ఉత్తరంవేపునే పోతూవచ్చింది గాని సాయంకాలం అయ్యేసరికి గాలివాలు మారింది. క్రమంగా మూడొంతులభాగం తిరిగి వాయవ్యంనించి ఎదురు వీచసాగింది. అంతవరకూ కెరటాలకు వెన్ను తన్ని వాలుగా నిలచి సాగుతున్న పడవ పక్కకు తిరగవలసి వచ్చింది కెరటాల తాకిడి ఎక్కువైంది. టాంకడియర్‌ను తునకలుచెయ్యాలని కూడబలుక్కున్నట్టు వచ్చి కొట్టసాగాయి ఓడలను ఎంత కట్టుదిట్టంగా మేకు బందీచేసి నిర్మిస్తారో తెలియనివాళ్ళు — ఇప్పుడో, ఇంకో నిముషానికో ఇది ముక్కముక్కలై పోతుందని భయపడేవారే. రాత్రి పడేసరికి గాలి వాన మరింత ఉధృతమైంది. జాన్ బన్స్బీ కంగారు పడసాగాడు వాతావరణం తరహా చూసి ఎక్కు

## 'కష్టాలు'

'కష్టాలకు ఓర్చుకొనగలిగిన వ్యక్తి పెద్దఉద్యోగమునకు కావలెను'నని ప్రకటన చూసి దరఖాస్తు పెట్టుకున్న ఒక పెద్దమనిషి. ఇంటర్వ్యూకు వెళ్లాడు. అన్ని విషయాలూ చర్చించినతర్వాత 'జీతమెంత' అని అడిగాడు. "అది తెచ్చుకొనడమే నీ మొదటి కష్టం." అన్న జవాబు వచ్చింది.

వైనా అంగరువేస్తే మంచిదేమోనని తోచింది. తోటి నావికులతో కూడా ఆలోచించాడు. సంప్రతింపులు ముగిశాక ఫాగ్‌దగ్గరకు వచ్చాడు.

"మనం కోస్తాకి తిరిగి ఏదో ఒక రేవులో అంగరువేస్తే మంచిదని తోస్తోంది" అన్నాడు

"మరే. నేనూ అదే అనుకుంటున్నాను" అన్నాడు ఫాగ్.

"ఔను .... ఏ రేవు ?"

"నాకు తెలిసిన రేవు ఒక్కటే—"

"ఏది ?"

"షాంగ్‌హై."

పైలట్ బన్స్బీ నివ్వెరపోయాడు. ఈ జవాబు ముందర అతనికి అర్థంకాలేదు. అందులో అంతర్యం, దాని వెనక ఉన్న పట్టుదల, మొండిధైర్యం ఎంతటివో అతనికి తెలియదు. కొద్ది క్షణాల తరువాత ఫాగ్ సమాధానంలో తాత్పర్యం అర్థమైంది.

"అంతేనండి. అంతే. షాంగ్‌హైకే పోదాం" అన్నాడు

టాంకడియర్ యథాప్రకారం ఉత్తరదిశాభిముఖంగా పోసాగింది

అది చాలా భయంకరమైన రాత్రి. ఆ ప్రళయంలో, అల్పకమైన ఆ చిన్న పడవ ఎప్పుడో మునిగిపోవలసింది అది మునగకపోవడమే ఒక పెద్ద అద్భుతం. రెండుసార్లు దాదాపు మునిగిపోయినంతపని జరిగింది. ఆ పూట తాళ్ళు పట్టు సడలితేంటే, తెగితేంటే డెక్‌మీద ఉన్న సర్వచరాచరాలూ సముద్రగర్భంలో కలిసిపోయేవే.

అయూదా పూర్తిగా అలసిపోయింది నీరసించిపోయింది. అయినా, ఫాగ్‌తో ఆ విషయం మాట మాత్రం కూడా అనలేదు డెక్‌మీద పడి అన్నిటినీ ఎగరేసుకు పోజాస్తున్న కెరటాల తాకిడినుండి ఆమెను కాపాడడానికి కొండు మూడుసార్లు ఫాగ్ ముందుకు దుమికి ఆమెను పట్టుకుని ఆదుకున్నాడు.

తెల్లవారింది. చీకటి విడింది తుఫాను మాత్రం ధాటి తగ్గకుండా విజృంభిస్తూనే ఉంది. అయితే గాలివాలు మాత్రం, తిరిగి ఓడకి అనుకూలంగా తిరిగింది ఆగ్నేయపవనం అనుకూలమయినా కొత్త ఉపద్రవం వచ్చింది. అంతవరకూ ఒకవేపునుంచి లేచిపడుతున్న కెరటాలూ, ఇప్పుడు ఈ కొత్తగాలివల్ల లేచిపడే కెరటాలూ ఢీకొన్నాయి. ప్రళయమే సృష్టించాయి. 'టాంకడియర్' ను గనుక కట్టుదిట్టంగా కట్టి ఉండకపోతే ఎడాపెడా వచ్చిన ఈ తాకిడికి అది చితికి చిద్రుపలయిపోయేదే మనకవెల్తురులో ఉండుండి దూరాన తీరం కనిపిస్తోంది. కాని ఎక్కడా ఓడలూ, పడవలూ కానరాలేదు. ఆ ప్రళయసమయంలో ప్రయాణం చేస్తున్నది—చేయ సాహసించినది ఇది ఒక్కటే

మధ్యాహ్నానికి, తుఫాను తెరపి ఇచ్చే సూచనలు కనబడ్డాయి సాయంత్రం పొద్దు వాటారే వేళకు అవి మరింత బలపడాయి

తుఫాను కొద్దికాలమే ఉండి, పోవడానికి కారణం దాని ఉధృతమే గాలీ వానా తగ్గి పోడ, మనుషులు, మనసులు కుదురుపడేసరికి ప్రయా

[illegible] బాగా అలసి నీరసించిపోయారు. ఫాగ్ అయినా ఫిక్సులు తేలికగా భోజనంచేసి విశ్రమించారు.

రాత్రి కొంత ప్రశాంతంగానే ఉంది. పైలట్ తిరిగి తెరచాపలెత్తించాడు. ఎట్టి కొంచెం తగ్గువగా ఎత్తించాడు పడవ జోరుగానే పోసాగింది. మర్నాడు 11 వ తేదీ ఉదయం బన్స్బీ దూరాన్ని కొలిచాడు లెక్కలువేసి షాంగ్‌హై ఇంక వందమైళ్ళకూడా ఉండదని తేల్చాడు.

వందమైళ్ళ దూరం, ఒక్క పూట గడువు! యోకహామా స్టీమరు అందుకోవాలంటే ఫాగ్ ఆరోజు సాయంకాలానికల్లా షాంగ్‌హై చేరాలి. తుఫానువల్ల ఎన్నో గంటల కాలం వృధా అయిపోయింది. అది కాకపోతే అతను ఈపాటికి 30 మైళ్ళ దూరంలో ఉండేవాడు

గాలిజోరు తగ్గింది అదృష్టం బావుండి దాంతో బాటు సముద్రం కూడా చల్లారింది తెరచాపలు ఉన్నవన్నీ ఎత్తారు అందినంతగాలి పోసుకొని పడవ ముందుకు సాగింది.

# 80 రోజులలో భూ ప్రదక్షిణం

మధ్యాహ్నం 12 గంట లయేసరికి షాంగ్‌హై 45 మైళ్ళ దూరంలోకి వచ్చేసింది. యోకహామా ఓడ కదలేలోగా చేరడానికి ఇంకా ఆరుగంటల వ్యవధి ఉంది

టాంకడియర్‌లో అందరిదృష్టి ఆ వాచ్ కాలం మీదనే ఉంది. ప్రాణాలుగ్గబట్టుకు ప్రయాణం సాగించారు అందరికీ గుండెలు ఉద్వేగంగా కొట్టుకుంటున్నాయి. కుదురుగా ఉన్నవాడు ఫిలియాస్‌ఫాగ్ ఒక్కడే పడవ గంటకు తొమ్మిది నాట్లకు తక్కువకాకుండా పోతే తప్ప మాట దక్కేటట్టు లేదు; గాలి వరస చూడగా అది మాట దక్కనిచ్చేటట్టు లేదు చూస్తూఉండగా గాలి జోరు తగ్గిపోయింది. ఉండుండి ఎవరో ఊదినట్టు ఒక్క కెరటంలా వీస్తుంది తరవాత ఏమీ ఉండదు. లేదన్నందుకు నిదర్శనంలా సముద్రం బల్లపరుపై పోతుంది

అదృష్టవశాత్తు టాంకడియర్ చిన్న పడవ తేలికైనది తెరచాపలన్నీ వాయుశక్తులా వెతికి ఎక్కడెక్కడ పర్చుకున్న గాలికెరటాలను పోగుచేసుకొచ్చినట్టు తెచ్చుకుని పడవని ముందుకు తీసుకువెళ్తున్నాయి సాయంకాలం ఆరుగంట లయేసరికి, బన్స్బీ లెక్కలువేసి షాంగ్‌హైనది ఇంక పదిమైళ్ళుందని ప్రకటించాడు. పట్నం ముఖద్వారానికి 12 మైళ్ళ పైగా ఉంది.

ఏడు గంటలకు 'టాంకడియర్' షాంగ్‌హై ఇంకా మూడుమైళ్ళ దూరంలో ఉంది పైలట్‌కి ప్రాణం ఉసూరుమనిపించింది. చూస్తూ ఉండగా రెండువందల పౌండ్ల బహుమతి చెయిజారిపోయేలా ఉంది. కూడనిమాట ఒకటి నోరుజారి వచ్చేసింది నిస్పృహతో దీనంగా, భయంగా ఫిలియాస్‌ఫాగ్‌వంక చూశాడు

ఇరవైవేల పౌండ్లు పందెం ఒడ్డి, అంతటికీ దానిమీద ఆధారపడి ఉన్న ఫాగ్ తొణుకూ బెణుకూ, చీకూచింతా లేనివాడిలా నిలుచుని ఉన్నాడు

ఆ సమయంలో దూరంగా దిగంతాన నల్లటి పొడుగాటి పొగగొట్టం కనబడింది దానిమీద తెల్లటి పొగ అది, వేళపట్టున బయలుదేరి వెళ్ళిపోతున్న అమెరికన్ స్టీమరు

"దీని సాధ్యం గూలా!" అన్నాడు బన్స్బీ ఒక్కసారిగా అదిరిపడి

"సంకేతాలు పంపి ఆపండి" అన్నాడు ఫాగ్.

డెక్‌మీద ఒక చిన్న ఇత్తడి ఫిరంగి ఉంది. పొగమంచు ఆవరించినపుడు సంకేతాలు పంపడానికి దానిని ఉపయోగిస్తారు

అందులో మందు దట్టించారు పైలట్ దానికి నిప్పు ముట్టించబోతూ ఉండగా ఫాగ్, ఆగమని సైగజేశాడు

"మీ జెండా ఎగరవెయ్యండి" అన్నాడు

జెండాను పతాకస్తంభంపై సగం ఎత్తున ఎగురవేశారు — ప్రమాదస్థితికి సూచనగా అమెరికన్ నౌక ఈ పతాకం చూసి, ప్రమాదంలో ఉన్న పడవకు సహాయం చేయడం కోసం ఇటు వస్తుందని బన్స్బీ ఆశ.

"పేల్చండి" అన్నాడు ఫాగ్.

ఫిరంగి పేలింది ధ్వని తరంగం దిశాంతాలకు బయలుదేరింది.

(ఇంకావుంది)

# గళ్లనుడికట్టు-47



## అడ్డం

1. ఖలా—.
3 శోభిల్లే అందం చివర గంటలో సగం.
5 అటునుంచి ఉదరము.
7 11 నిలువు కూడా ఇదే
8. పలుకు, చాలా ఉన్నది.
9 వ్రాయబడింది! ఆప్తమిత్రులకి ముఖము లో వెదకండి.
10 కథ నొక్కి చెప్పకండి.
12 శంఖ, చక్రములలో సాధారణంగా కలిసి ఉంటుంది.
14 —కాయక్లేశము, అంటారు.
15 ఈమాట రెండుసార్లు వాడితే ఒకవిధమైన నవ్వును సూచిస్తుంది
17 పాపము, సర్ప మెక్కడో దాక్కున్నట్లుంది.
18 చిందరవందర లయిపోయిన నిర్ణీత కాలము.
19 వ్రాత
20 చెట్ల సమూహంలో నెట్టడం!
21 అది ముసలితనం ముసలితనం మధ్యన ఉంది.
23 సాధనము దీనికి కూడా కావాలి, సగం తీస్తే వాలు
24 కండూతిలోనే దద్దు.
26 మరి! కొమ్మిచ్చి గర్వమా ?
28 మారుడా! అని వ్రాయండి
29 1 అడ్డంలో చివరకొస్తే వ్రేలు!
30 మర్కటము.
31 ధ్వనించిన చర్యలో ఎద్దు.
33 చర్చా—.
34 తియ్యనివి తీసి వేకూర్చాలి!

## నిలువు

1. రామాయణాలలో పిడకం—!
2 పాము పుట్టదు కాని ఉంటుంది.
3 అంటు.
4 ఆగండి! కదిలిస్తే పందే!
6 పూరి ఎల్ల.
7. ముప్పాతిక సంతోషమే అయినా పువ్వుకుంటే అంతా పోతుంది ఆ సంతోషము ఏమవుతుందో మరి!
8 పగడములోనే విప్పేది
11 శైత్యములో దాక్కున్న పత్రము.
13 భయము
14 తాళం.
16. రసికత్వములో తల ఉందంటే మీరు నమ్మక పోవచ్చు కాని వెతకండి.
17. తియ్యని ద్రవపదార్థం.
20 నీటిలో నెట్టము!
22 దిగే మనస్సు వ్యాపారంలో దొరుకుతుందా ?
23 సాధారణమైన వనంలో తిరిక.
25 నువ్వులు!
27 వెతికి—. తలక్రిందులుగా
29 వేదములనక, బాధ ఎక్కడ ?
30 ఇక చకోరములలోనే వస్త్రము.
32. పది తిమింగళాల్లో ఒక రాక్షసుల తల్లి!

## 'చదువురాని మొద్దు'

తనపదేళ్ల కొడుకు బొత్తిగా చదవకుండా తిరగడం చూసి తండ్రి ఒకసారి గట్టిగా మందలించబోయాడు. "ఈ విధంగా తిరిగితే పదేళ్ల తర్వాత నీ సంగతేమవుతుందో తెలుసా?" అని తీవ్రంగా అడిగాడు.

కొంచెం ఆలోచించి ఆకుర్రవాడిలా సమాధానమిచ్చాడు. "నాకు ఇరవై ఏళ్లు దాటుతాయా?"

---

## 46-వ గళ్లనుడికట్టుకు జవాబు



## బహుమతి పొందిన కార్టూన్




చిత్రకారుడు—చిత్తర్వు సూర్యనారాయణ (మచిలీపట్టణం)

## వకీలు ఇంట్లో దొంగతనం

అర్థరాత్రి దొంగ ఇంట్లో దూరగానే వకీలు గారికి మెలకువ వచ్చింది. లేచి లైటు వేశాడు. దొంగ బిత్తరపోయి ఒకమూల నక్కబోయాడు. వకీలుగారన్నారు—"భయపడకబ్బాయ్! ఇలా రా. కూర్చో. ఇకమీదట దొంగతనం చెయ్యడం మానేయ్. బుద్ధిగా ఏదయినా పనిచేసుకుని బ్రతుకు. అప్పుడు నువ్వెవరికీ భయపడవలసిన అవసరం ఉండదు. ఏమంటావ్? నా సలహా పాటిస్తానంటే నిన్ను పోలీసులకు పట్టివ్వను."

"సరే—అలాగే పాటిస్తా"నని తలూపుతూ, భయవినయాల్ని నటిస్తూ జారుకోబోయాడు దొంగ.

"అలా ఉండు—నా సలహా ఫీజు సంగతి తెలుసుగా ఇరవై

## పొట్టికథలు

రూపాయలు. అక్కడ పెట్టి వెళ్లు"

పోలీసులకు పట్టిస్తే చిక్కుల్లో పడవలసి వస్తుందని దొంగ కిక్కురుమనకుండా జేబులోంచి ఇరవై రూపాయలూ తీసి వకీలుగారి చేతిలో పెట్టి బయటపడ్డాడు.

చీకట్లో మరో వ్యక్తి అడ్డు తగిలి, "నా మామూలు మరిచిపోయినట్లున్నారు." అన్నాడు వినయం, గౌరవం ఉట్టిపడే మాటల్లో. దొంగ తేరిపార చూచాడతని వేపు. అతను వకీలుగారి గుమాస్తా. జేబులో మిగిలిన చిల్లరడబ్బులన్నీ తీసి అతని చేతిలో పోసి పరుగు లంకించుకున్నాడు దొంగ.

వకీళ్ళ ఇళ్ళకు మాత్రం ఎప్పుడూ పోగూడదని నిశ్చయించుకున్నాడు దొంగ.

(ప్రోష్ఠపద (హైదరాబాద్)

## "ప్రమాణం"

ఒక చిన్న కేసులో సాక్ష్యమిస్తున్న డ్రామా యాక్టర్ని తికమకపెట్టే ఉద్దేశంతో ప్రాసిక్యూషన్ న్యాయవాది, "మీరు డ్రామా యాక్టర్ నంటున్నారు. పెద్ద యాక్టర్లా లేక..." అని అడిగాడు వ్యంగ్యంగా. అతను కొంతసేపు ఆలోచించి, 'నిజం చెప్పాలంటే ప్రపంచంలోనే నాకంటే పెద్దనటులెవరూ లే'రన్నాడు.

'బోను'లోనుంచి దిగిన తర్వాత 'డిఫెన్సు' వైపు న్యాయవాది అతన్ని పిలిచి అంత గర్వం కూడదేమోనన్నాడు, మందలింపుగా. "నిజమే కాని ప్రమాణ స్వీకారమైన తర్వాత నన్ను గురించిన సత్యం చెప్పకతీరాలి కదా!" నటకులశేఖరుడు సందేహంగానే సమాధానమిచ్చాడు.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street,

# PHILLIPS ఫిలిప్స్ సైకిల్

ఫిలిప్స్ సైకిళ్ళు చూడ్డానికి అందంగా ఉంటాయి తొక్కడానికి అతి మృదువుగా సునాయాసంగా ఉంటాయి నేటి ఉత్సాహవంతులైన యువకుల అవశ్యకతలకు తగినట్టుగా ప్రత్యేకం నిర్మించబడిన సైకిలు. అచ్చమైన టెంపరు ఉక్కుతో ఎంత చెడతొక్కినా తట్టుకునేటట్లు తయారైంది

ప్రపంచమంతటా సుమారు 70 సంవత్సరాలనుంచీ ప్రఖ్యాతిని పొందుచున్న ఫిలిప్స్ సైకిళ్లు నేడు టి ఐ సైకిల్స్ వారి క్రొత్త ఫ్యాక్టరీలో అతి ఖచ్చితంగా నిర్మింపబడుతున్నాయి







టి ఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా. మద్రాసు